# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపబడిన

## శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

సచిత్రము

పదునాల్గవ భాగము




సంపాదకుడు :

విద్యా భూషణ

ఉపన్యాసక రత్న - కవితా విశారద

ధనకుధరం వరదాచార్యులు



ప్రకాశకులు :

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

శ్రీ లక్ష్మీనారాయణ పురము

గుంటూరు - 522 006

శ్రీ రామానుజ కీర్తి కౌముది

పదునాల్గవ భాగము

మొదటి ముద్రణము

వేయి ప్రతులు

భావ - జ్యేష్ఠము

జూన్ 1994

రామానుజ శకము ౯౭౮

మూల్యము :-

ఏబది రూపాయలు

ముద్రణము :-

షిరిడి సాయి ప్రింటర్స్,

బ్రాడీపేట - గుంటూరు - 2

[ This book is published with financial assistance of Tirumala Tirupati Devasthanams under this Scheme Aid to publish religious books

# సమాలోచన సమితి

వ్యాకరణ విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ
**శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M. A.**
విశాఖపట్టణము

*

న్యాయవిద్యాప్రవీణ
**డాక్టర్ : యస్.బి. రఘునాథాచార్యులు, M. A; Ph. D.**
డైరక్టర్, రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠము
తిరుపతి

*

**శ్రీమాన్ చిలకపాటి విజయ రాఘవాచార్యులు, M. A., B. Ed.**
రాజనీతి శాఖాధ్యక్షులు,
ఆంధ్రప్రదేశ్ గురుకుల డిగ్రీ కళాశాల
నాగార్జునసాగర్ - విజయపురి సౌత్

*

కవికోకిల - విద్వత్కవి - కావ్యకళానిధి
**శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు**
సాహిత్య వికాస మండలి అధ్యక్షులు
సిద్దిపేట

*

**డాక్టరు : చించాపట్టణం శ్రీరంగాచార్యులు, M. A. Ph. D.**
రిటైర్డు లెక్చరర్,
నాగోల్ - హైదరాబాదు
(రంగారెడ్డి జిల్లా)

*

మహోపాధ్యాయ - ఉభయ వేదాంత శిరోమణి
**శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు, M. A; B. O. L.**
సంస్కృతోపన్యాసకులు
శ్రీ వేంకటేశ్వర వివేకవర్ధినీ సంస్కృత కళాశాల
హైదరాబాదు

*

కవిశాబ్దిక కేసరి - ఉభయ వేదాంత విద్వాన్
శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు, B. O. L.
వరంగల్

*

విద్యాప్రవీణ - భాషాప్రవీణ - ఉభయవేదాంత శిరోమణి
శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, M. A.
రిటైర్డు ప్రిన్సిపాల్ :- వేద సంస్కృత కళాశాల
నెల్లూరు

*

సంగీత సాహిత్య కళానిధి - ఉభయ వేదాంత విశారద
శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు
సువర్ణ హస్త కంకణ విరాజితులు.
విజయవాడ

*

సాహిత్య విద్యాప్రవీణ
డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు, M. A., Ph. D.
ఉపన్యాసకులు :- విశిష్టాద్వైత విభాగము
రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠము
తిరుపతి

*

'సాహిత్య విద్యాప్రవీణ'
డాక్టర్ : సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు,
M. A., Ph. D.
సంస్కృతోపన్యాసకులు :- ఆంధ్రగీర్వాణ విద్యా పీఠము
కొవ్వూరు

*

# ప్రముఖులు - ప్రశంసలు

డాక్టర్ : శ్రీరంగాచార్య, MA: Ph.D.

ప్రిన్సిపాల్ - శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ సంస్కృత కళాశాల — పాలెమ్.

శ్రీరామానుజ కీర్తి కౌముది - 13 - వ భాగము - విశేష విషయ సంభరితముగా కలదు: బహు విధ విషయము లనేకములను సేకరించి, వానిని పాఠక లోకమునకు అందించుచున్న తమ కృషి అద్భుతముగా నున్నది. షోడశ కళా పరిపూర్ణ సంఖ్యా పరిమితముగా వెలయింప దలచిన కీర్తి కౌముదీ యజనము సమీపించుచున్నందులకు - త దద్వర విశేష ఫలానుభవములో నున్న మా వంటివారు ధన్యులు. మహత్తర కృషి చేయుచున్న మీరు - ఈ జాతికి నిజముగా - శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వమును ప్రసాదించి, తర తరములకు తరుగని పెన్నిధిగా నిల్పుచున్నారు. శ్రియఃపతి కృపాకటాక్షమున - ఈ సాహిత్య యజ్ఞము నిర్విఘ్నముగా పూర్తియై, మా వంటి అల్పజ్ఞులకు అవభృథ స్నాన ఫలమున - శతాంశమైనను - చెందవలెనని ప్రార్థన.

A. SESHACHARI — Mehadipatnam

District Development officer (Retd) — HYDERABAD - 28.

శ్రీ రామానుజ కీర్తి కౌముది 13 భాగములను చదివినాను. ఎంతో ఆనందము కలిగినది. ప్రతి శ్రీవైష్ణవుడు తెలిసికొనవలసిన సంప్రదాయ విశేషములనేకములు, రహస్యార్థములును - ఈ గ్రంథములలో వివరింపబడినవి. ఇందువలన, ఈ గ్రంథములు మిక్కిలి ఆసక్తిని కలిగించుచు, ఆదర్శప్రాయములై వెలుగొందుచున్నవి. ఇట్టి గ్రంథ రత్నములను వెలయించుచున్న మీరలు - కడుంగడు ప్రశంసాపాత్రులు.

అప్పల్ల సోమేశ్వర శర్మ, M A; P. O. L. — విశాఖపట్టణము

శ్రీవైష్ణవ ధర్మ ప్రచారవిషయంలో మీ కృషి - 'న భూతో - న భవిష్యతి' అనిపిస్తుంది. శ్రీ రామానుజ కీర్తి కౌముది-భగవద్రామానుజుల కీర్తి ధ్వజముగా - కలకాలం నిలుస్తుంది. తథాఽస్తు.

# పత్రికలు - ప్రశంసలు

వైష్ణవ్యాణీ చిత్తూరు. మే 1994

(పదమూడవ భాగమును గుఱించి)

అస్మిన్ సంపాదిత పత్ర గ్రంథే 1. శ్రీనివాస స్తవ రాజః ఇతి ఆంధ్ర పద్య ప్రబంధః 2. అర్చావతార వైభవమ్ 3. భగవ ద్రామానుజ నిత్యగ్రంథః 4. శ్రీమద్రామానుజః – శ్రీభాష్యమ్ 5. శ్రీమద్రామానుజస్య తాత్త్విక దృక్పథమ్ 6. శ్రీరామానుజ సిద్ధాన్త ప్రవర్తకాః 7. శ్రీ పిళ్ళై లోకాచార్య వైభవమ్ 8. అష్టాదశ రహస్యాని - త ద్విశేషాశ్చ ఇతి ప్రధానతమ విషయా నధికృత్య, ఉభయ వేదాన్త ప్రవర్తకై రాచార్యవర్యైః శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వం తత్త్వతః భాషాయాం స్వీయ విస్తృత నిబంధ ప్రబంధైః అస్మిన్ ప్రతిపాదితమ్.

విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదికానాం పూర్వోక్తానాం ప్రబన్ధానాం సంపాదనేన సంపాదకః ఉ. వే. ప్ర శ్రీమాన్ ధనకుధరం వరదాచార్య స్వామి మహోదయః తత్త్వ జిజ్ఞాసూనాం అశేషాన్ధ్రపాఠకోత్తమానాం కృతే మహాన్త ముపకార మాతనోతీతి, ఏతాదృశ గ్రంథాత్మక పత్ర సంకలనేన శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞానాం పుష్ణాతీతి చాభినన్దనీయో భవతి. స్వ సంపాదకీయే నిబన్ధే శ్రీమా నాచార్యః రహస్య గ్రంథా నధికృత్య విలిఖన్, ఉభయ వేదాన్తాభిఖ్యయా ప్రసిద్ధస్య విశిష్టాద్వైత తత్త్వస్య – నాథోపజ్ఞతా ముపపాద్య, పిళ్ళైలోకాచార్యైః నిబద్ధానాం అష్టాదశ రహస్యానా మధ్యయనే నైవ శ్రీవైష్ణవ సిద్ధాన్త సార గ్రహణం భవే దితి సమ్యక్ స్వరూపితమ్

అస్మిన్ సందర్భే - శ్రీమతాం – నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యాణాం 'శ్రీ పిళ్ళలోకాచార్య వైభవమ్', డాక్టర్ : భట్టా విజయరాఘవాచార్యాణాం M.A; Ph. D. 'అష్టాదశ రహస్యాని – త ద్విశేషాః' ఇతి నిబన్ధ ద్వయం పఠనీయ మితి వైష్ణవ్యాణీ సూచయతి. శ్రీ రామానుజ సిద్ధాన్త ప్రవర్తకా ఇతి శీర్షికేన ప్రదత్తః ఉభయ వేదాన్త ప్రవర్తకానాం పూర్వాచార్యాణాం సంక్షిప్త పరిచయోఽపి – పాఠకానా మత్యన్తోపకారాయ భవే దితి విజ్ఞాప్యతే.

త్రయోదశ్యా మస్యాం శ్రీ రామానుజ కీర్తి కౌముద్యాం ప్రకాశితాన్ నిబన్ధా ననుగృహీతవతాం ఆచార్య వర్యాణాం తాన్ సంపాద్య, సంకలయ్య, ప్రకాశిత వతాం శ్రీమతాం ధనకుధరం వరదాచార్య మహోదయానాం, ఏత దర్థం ఆర్థిక సాహాయ్య మర్పితవతాం తి. తి. దేవస్థానాధికారిణాం చ కృతే గైర్వాణీ హార్ద మభివాదన పురస్సర మర్పయతి.

**సాధన పత్రిక – అనంతపురము** **24 - 7 - 93**

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు – మొక్కవోని కృషితో–రామానుజ కీర్తి కౌముది 18 – వ భాగమును వెలువరించినారు. ఒక గ్రంథమును వ్రాసి, ముద్రింపించి, వెలుగునకు తేవలె నన్న, అత్యంత శ్రమకు లోనుగావలసియుండును. పలువురు పండిత విమర్శకులచేత వ్యాసములు వ్రాయించి, తాము కొన్ని వ్యాసములను స్వయముగా వ్రాసి ప్రకటించుట – బహు ప్రయత్న సాధ్యము. అట్టివి 18 భాగములు ప్రకటించుటకు పడిన శ్రమ - అనన్యము. మిగిలిన 8 భాగములు ప్రచురించిన యెడల, వారి జన్మ సార్థకము.

**రామకృష్ణప్రభ – మద్రాసు.** **ఫిబ్రవరి 1994**

మోక్ష సాధన రహస్యాలను లోకమున - అశేష జన క్షేమం కోసం – లోకంలో వెదజల్లిన మహా మనీషి – కారణ జన్ముడు – శ్రీమద్రామానుజులు. ఆ మహనీయ మూర్తి – నవ నిధుల వంటి నవ గ్రంథాలను – భావి తరాలవారికి అందజేయగా, ఆ గ్రంథాలలో నిండిన సారాన్ని – శ్రీ ధనకుధరం వరదాచార్యుల వారు - శ్రీమద్రామానుజ కీర్తి చంద్రికలను – చంద్రుని షోడశ కళల్లాగా 16 భాగాలుగా రూపొందించడం – ఎంతో ముదావహం.



# ARCHA WORSHIP

## A Mode To Reach The Divine

NEWS TIME * Sunday 5th September, 1993

Sri Vaishnavism reached the Telugu land quite early thanks to the great Acharyas including the founder of the Ahobila Math, Sri Adivan Satakopa. Emperor Krishnadeva Raya pays homage to these acharyas in his Amukta Malyada while relating the story of Mala Dasari. The Acharyas referred to by him Ramanuja, Perla Nambi, Alakiya Manavala Nayinar, Adivan Sathakopa Jeer and Vedanta Desika. He has also related in full detail the life of Yamunacharya, generally known as Alavandar. The teaching of these acharyas renewed public participation in rituals and temple worship, and inspired grear literaray works like the Andhra Mahabhagavatam. Nor was Sri Vaishnavism confined to the upper classes. Sri Kidambi Narasimhacharya writes in 'Tirunamamula: Samagra Pariseelanamu' (1984) that Sri Vaishnavism percolated to the lowest levels even in remote villages. There was a veritable storm of Sanskritization as the commoner gave up his indigenous gods and put on the marks of a Sri Vaishnavite. He revered the 74 'Simhasanadhipathis' and works like Sri Vachana Bhushanam. Naturally, archa(idol) worship became increasingly popular. Grand edifices were built to house the delty. A variety of festivals marked a templ's presence. This drawing close to one another and the divine was pleasant, it seemed easier: certainly a visible symbol helped one's religious - spiritual life. Till today the archa worship (at home and in the temple) has been very popular and has brought solace and succour to millions. It is good that sri Dhanakudaram Varadacharyulu has given archa as the theme for the 13th volume of Sri Ramanuja Keerthi Kaumudi.

Appropriately, the volume opens with a collection of traditional prayers to the archa form of Lakshmi Narayana as also Vinjamuri Gopalakrishnamacharyulu's Srinivasa Stava Rajam' which seeks to explain the significance of the term, 'Venkata' and the good that accrues to us when we repeat the 12 holy names like Kesava and Narayana.

Samudrala Venkata Rangaramanujacharyulu has contributed a detailed critique of archa worship. Of the five modes of envisioning the divine (para, Vyuha, Vibhava, Antaryami and Archa), the archa is easiest for us. Here archa means a 'Pratima' or an idol. The entire Achit and Chit are the body of the Iswara. Seen thus, it becomes easy to envision the divine everywhere. Especially in the archa form the divine allows himself to be dicated to by the devotee.

The Smritis, Puranas and Agamas speak glowingly of the archa worship. So too hagiology and history. The life of 'Dhanurdasu' who was captivated by the eyes of Ranganatha is well known. In fact even the Taittireeya Upanishad refers to temple worship; There are also references to such worship in the two epics. Sri Vaishnavism gave much importance to archa worship in households. Sri Gopalakrishnamacharyulu divines the reason as follows :

"'For, man caught in the shacktes of samsara with norest and plentiful worry wants place for his mind which is verity on ocean of worries. The only way in which man's mind can be stilled is worship of the divine. If this heart hard also lac should melt, the only way is worship which includes singing in praise of god and listening to his greatness.

One can worship the lord in any form, including a portrait What is needed is absolute sincerity. Kidambi Srinivasa Rama-

nujacharyulu has gifted a fortunate paraphrase of 'Ramanuja's 'Nityagrantha' which details the mode of archa worship. He rightly points out how Ramakrishna Paramahamsa and Swami Vivekananda demonstrated that idol worship is no obscurantist ritual. If the divine is omnipresent, he is present also in the idol !

Sri Marimganti Srirangacharyulu continues with his commentary on the Sri Bhashya for the Kaumudi while Chinchapatnam Srirangacharyulu writes about Ramanuj's philosophy. Dhanakudharam Varadacharyulu's brief accounts of twenty scholars who disseminated the 'Ramanuja Darsana' are informative. Among them are Nanjiyar, Parasara Bhattar. Periavanchan Pillai. Meghanada Suri and Sri Krishna Guruji.

Nallan Chakravarthla Krishnamacharyulu's account of 'Pillai Lokachary' is an important document. Opening with a Statement that Vaishnavism is as old as the Vedas, he throws light on the brilliant progression from Vasista to 'Suka Maharshi'. Then came the Sramana interrugnum and Vaishnavisam had to sit, waiting in the dark.

Now blossomed the renaissance initiated by the Alwars. The Sanskrit scriptures of the past and the Tamil scriptures of the present initiated the matrix of a new time in Indian religion. The Alwars were followed by the acharyas beginning with Nathamuni (8th century). Ramanuja's wide travels made Vaishnavism a pan - Indian phenomenon. Pillai Lokacharya and his brother Alagiya Manavala Perumal Nayinar give a tremendous fillip to Sri Vaishnavism through writings, teaching, the management of the Srirangam temple and a blameless personal life. During the Islamic invasion, Pillai Lokacharya took the idol of Ranganatha and escaped to Jyothishkudi. The archa idol was brought back to Srirangam after quite some time and worship was restored.

The eighteen works of Pillai Lokacharya are introduced by Thatta Vijayaraghavacharyulu. Among them are Mumukshuppadi that deals with the Ashtakshara, Dvaya and Charama Sloka: Arthapanchakam which speaks of the way and the goal: Archiradi which describes in a dramatic manner the gains of the jeevatma when he reaches the Divine.

Here is an instance :

" The Lord received the jeevatma.

Lord : Who are you.

Realised Soul : Iam like a body to you. A Prince who is yours.

Lord : What were you doing all this time.

Rs : I was lost in sense enjoyment.

Lord : What profit did you gain thereon.

Rs : A sorrowful experience in a terrible hell.

Lord : What did you do thereafter.

Rs : Here, I have come to you.

Lord : What path did you take for this.

Rs : The all – guarding, supreme, yourself as the path.

Lord : What have you gained by reach me.

Rs : I have divested myself of terrible sins. I have gained an endless Ananda. "

In Sri Vaishnavism the way and the goal are the same. It is Lord Narayana who is the way and the goal. The Sri Ramanuja Keerthi Kaumudi volumes have been disseminating this secret of secrets with great enthusiasm.

SRIRANGAM. Dr. PREMANANDAKUMAR, M. A: Ph.D.



# శ్రీ రామానుజ సూక్తి రత్నములు

(భగవద్రామానుజులు - తమ శిష్యకోటికి - సందర్భోచితంగా - అపుడపుడు - అనేక హిత వాక్యములను ఉపదేశించియున్నారు. అట్టి వానిలో-డెబ్బది రెండు (72) శ్రీ సూక్తులు అతి ముఖ్యములైనవి. అందువలన, అట్టి 72 సూక్తి రత్నములు-పాఠకుల ప్రయోజనము నుద్దేశించి, ఇచట పొందుపరవబడుచున్నవి.
— సంపాదకుడు)

1. స్వాచార్య కైంకర్యమందును, భాగవత కైంకర్యమందును - సమ ప్రపత్తి చేయవలెను. 2. పూర్వాచార్యులు పాయించిన శ్రీ సూక్తులయందు విశ్వాసము నుంచవలయును. 3. నిరంతరము ఇంద్రియ కింకరులై యుండవలదు. 4. సామాన్య నిష్ఠులై యుండవలదు. 5. భగవద్విషయక మగు విశేష శాస్త్ర నిష్ఠులై యుండవలెను. 6. తొలుత ఆచార్య కృపచే జ్ఞానియై యుండి, పిదప - శబ్దాది విషయ కింకరులై యుండకూడదు. 7. శబ్దాది విషయ భోగముల నైదింటిని సమముగా జూడవలెను. 8. చందన - కుసుమ - తాంబూలాదులందు అపేక్ష మానియుండవలయును. 9. భగవన్నామ సంకీర్తనలయందు జేయు ఆదరణ - భాగవత నామ సంకీర్తన యందు చేయవలెను. 10. మహా భాగవతాశ్రయమే మోక్ష కారణ మని నమ్మి, వారి యాజ్ఞ ననుసరించి వర్తించవలయును. 11. ఒకడు ఎంత ప్రాజ్ఞుడైనను, భగవత్కైంకర్యమును, భాగవత కైంకర్యమును విడచి, రాగాదులచే విషయ ప్రవణుడైనచో - నశించును. 12. శ్రీవైష్ణవుల యనుష్ఠానములు 'ఉపాయ' మని తలంచకూడదు. 13. శ్రీవైష్ణవానుష్ఠానమును 'ఉపేయ' మని

తలంచవలయును. 14. శ్రీవైష్ణవులను ఏక వచనముగా పిలువరాదు. 15. శ్రీవైష్ణవులను సేవించునపుడే పూర్వాంజలి చేయవలయును. 16. భగవద్భాగవతాచార్య సన్నిధి యందు కాళ్ళు చావరాదు. 17. భగవ ద్భాగవ తాచార్య గృహముల దిక్కున కాళ్ళు జాచుకొని, నిద్రించరాదు. 18. నిదురించి మేలుకొనునప్పుడు – గురుపరంపరాను సంధానము చేయవలయును. 19. భగవత్సన్నిధి యందు శ్రీవైష్ణవులు గోష్ఠిగా వేంచేసియున్నప్పుడు ద్వయానుసంధానము చేయుచు, సాష్టాంగ దండ ప్రణామ మాచరింపవలెను. 20. శ్రీవైష్ణవులు భగవ ద్భాగవత గుణ కీర్తన చేయుచుండగా, వారిని తన శక్తి కొలది పూజింపక, మధ్యలో లేచి పోవుట మిక్కిలి అపచారము.

21. శ్రీవైష్ణవులు వేంచేసిరేని – లేచి, వారికి ఎదురుగా బోయి, పిలుచుకొని వచ్చి, వారు తిరిగి వేంచేయునపుడు కొంత దూరము వారితో పోయి పంపకుండుట అపచారము. 22. ఆత్మయాత్రకై శేషత్వముచే శ్రీవైష్ణవులను అనువర్తింపక, తన దేహయాత్రకుగాను సంసారుల యిండ్లకు పోయి, వారి పేరు ముందు, తన పేరు వెనుక పెట్టుకొని, నియమములను విడచి తిరుగుట స్వరూప హానికరము. 23. ఆత్మోజ్జీవనమునకై శ్రీవైష్ణవులకు శేషభూతుడుగా నుండవలెను. 24. ఉదరపోషణార్థము ప్రాకృతుల ననుసరించి ప్రవర్తించుట – స్వరూప హాని. శ్రీమన్నారాయణుని దివ్య విమానములను, గోపురములను చూచినంతనే నమస్కరింపవలెను. 26. అన్యదేవతాస్తుతులను విని, విస్మయ మొందరాదు. 27. శ్రీవైష్ణవులు భగవద్భాగవతాచార్య గుణకీర్తనములు చేయుచుండగా విని సంతోషింపక, మధ్యలో వారి నాక్షేపించుట అపచారము. 28. శ్రీవైష్ణవుల దేహచ్ఛాయలను దాటరాదు. తన నీడ వారిపై పడరాదు. 29. బద్ధ సంసారులను తాకిన హస్తములతో – శ్రీవైష్ణవులను స్పృశింపరాదు. 30. నిరుపేదలైన శ్రీవైష్ణవులు ముందు నమస్కరింగా, వారిని అనావరణము చేయుట – అపచారము. 31. శ్రీవైష్ణవుల జన్మ నిద్రాలస్యాది దోషములు తనకు తెలిసినను-ఇతరులకు చెప్పక, వారి దోషములను విడచి, గుణములనే గణింపవలయును. 32. భగవ ద్భాగవతాచార్య శ్రీపాద తీర్థములను ప్రాకృతులు చూచుచుండగా స్వీకరింపరాదు. 33. తత్త్వ త్రయ – రహస్య త్రయ జ్ఞానము లేనివారి శ్రీపాద తీర్థమును స్వీకరింపరాదు. 34. జ్ఞానానుష్ఠానములు గల సదాచార సంపన్నులయిన భాగవతుల శ్రీపాద తీర్థమును నిత్యము స్వీకరింపవలెను. 35. తాను తనయందు భాగవత సమ

శుద్ధి చేయరాదు. 36. పొరపాటున ప్రాకృత జన సంపర్కము సంభవించినచో, సచేల స్నాన మాచరించి, శ్రీపాద తీర్థమును స్వీకరింపవలెను. 37. వైరాగ్య - జ్ఞాన - భక్త్యాది సద్గుణ సంపూర్ణులైన శ్రీవైష్ణవులను చివరి అవతార స్వరూపులని యెంచి, వారియందు విశ్వాస ముంచి, వారిని ప్రాప్యమని నమ్మవలెను. 38. ప్రాకృతుల గృహములలో-భగవ తీర్థమును స్వీకరింపరాదు. 39. ప్రాకృతుల గృహములలోని భగవ ద్విగ్రహములను సేవింపరాదు. 40. శ్రీమన్నారాయణుని దివ్యదేశములందు మాత్రము ప్రాకృతులు చూచుచున్నను, తీర్థ ప్రసాదములు స్వీకరింప వచ్చును.

41. శ్రీమన్నారాయణుని సన్నిధిలో ఈయబడిన ప్రసాదమును, ఉపవాసము చేయుచున్నను సంశయింపక, స్వీకరింపవచ్చును. 42. సర్వపాపములను హరించు శ్రీమన్నారాయణుని పవిత్ర ప్రసాదమును - ఎంగిలి యని తలంచరాదు. 43. శ్రీవైష్ణవుల సన్నిధిలో-ఆత్మ స్తుతి, పరనింద కూడదు. 44. నిరంతరము భగవద్భక్త గుణానుభవము చేయుచుండవలెను. 45. అనుదినము, అనిశము స్వాచార్యుల సద్గుణములని కీర్తింపవలెను. 46. పూర్వాచార్యుల దివ్య ప్రబంధములను, స్వాచార్యులచే రచింపబడిన ప్రబంధములను కీర్తింపవలెను. 47. దేహాభిమానులతో స్నేహము చేయరాదు. 48. వేష భాషలలో వైష్ణవులైనను, విషయవాంఛాలోలురైనచో - వారితో స్నేహము చేయరాదు. 49. పరదూషణాతత్పరులగువారితో మాటాడరాదు. 50. అన్యదేవతారాధకుల సంగము తటస్థించున యెడల ఆదోషము పోవుటకై, మహాపురుషులగు శ్రీవైష్ణవులతో అనిశము సంభాషింపవలెను. 51. భాగవతోత్తములను దూషించు మానవాధముని చూడరాదు. 52. గురుద్రోహులను, క్రూరస్వరూపులను చూడరాదు. 53. ద్వయానుసంధాన తత్పరులతో, ప్రవృత్తి ధర్మనిరతులతో సాంగత్యము చేయవలెను. 54. దేవతాంతర-ఉపాయాంతర నిష్ఠలను విడచివేయవలెను. 55. రహస్య త్రయ సారజ్ఞులతో, తత్త్వత్రయ విశారదులతో సాహచర్యము చేయవలెను. 56. శ్రీవైష్ణవుడెవడేని నిన్ను తిరస్కరించినచో, అతనికి అపకారమును తలంపక, మిన్నకుండవలెను. 57. పరమ పదము నాకాంక్షించు వైష్ణవుడు - వైష్ణవులకు హితము చేయవలెను. 58. శ్రీమన్నారాయణుని కర్పింపని అన్నము నెన్నడును భుజింపరాదు. 59. ఫల పుష్ప చందన తాంబూలాదులను శ్రీమన్నారాయణునకు సమర్పింపక, ముందుగా స్వీకరింపరాదు. 60. జాత్యాదులచే దుష్టముగాని అన్నమునే భుజింపవలెను.

61. స్వామివారి నివేదనమునకు శాస్త్రములలో నిర్దేశింపబడిన ప్రసాదభోగ ములను తప్ప, తనకు ఇష్టము లగు ప్రసాద భోగములను శ్రీమన్నారాయణునకు సమర్పింపరాదు. 62. భగవ దర్పితములగు అన్న పానీయములందును, సుగంధ ద్రవ్యాదులందును ప్రసాద మను భావముండవలె గాని, భోగ బుద్ధి కూడదు. 63. భగవ త్కైంకర్య బుద్ధితో శాస్త్రోక్త విధుల నాచరింపవలెను. 64. మంత్ర త్రయార్థ నిష్ఠగల మహా భాగవతోత్తముల పట్ల అహంకార పడుట – వినాశ హేతువు. 65. పరమ భాగవతోత్తముల ముఖోల్లాసకరమే ఆత్మకు మోక్ష హేతువు. 66. విష్ణు భక్తులను పూజించుటయే పరమ పురుషార్థము. 67. విష్ణు భక్తులతో వైరము ఆత్మవినాశకరము. 68. శ్రీ మహావిష్ణువు యొక్క అర్చావిగ్రహమును-శిల యని భావించుట, ఆచార్యులను సామాన్య మానవునిగా భావించుట, విష్ణువు యొక్కయు, విష్ణుభక్తుల యొక్కయు పాదోదకమును సామాన్య జల మని భావించుటయు, కలి కలుషమును హరించు శ్రీమన్నారాయణుని మంత్రమును సామాన్య శబ్దసంచయమే యని తలంచుటయు, శ్రీమన్నారాయణుని ఇతర దేవతలతో సమునిగా నెంచుటయు – నరక హేతువులు. 69. భగవంతుని కైంకర్యమునకన్న, భాగవత కైంకర్యమే మిన్న. 70. శ్రీవైష్ణవోల్లంఘనము-విష్ణుదూషణము కంటెను, పాతకము. 71. విష్ణు పాదోదకము కంటెను విష్ణుభక్తుల పాదోదకము శ్రేష్ఠము. 72. భగవ ద్భక్తి నిష్ఠులతో సాంగత్యము చేసి, వారితో భాషించుచు, తిరుమంత్రమును అనుసంధించుచు – కాలమును గడుపవలెను.



# శుభాకాంక్ష

"లోకా నుద్ధర్తు కామో ధృత మనుజ వపు
ర్భూతలే యోఽవ తీర్ణః
నిర్జి త్యాశేష దుష్టాన్ కుమతి మత పరాన్
వైష్ణవం కర్మ తేనే
బ్రహ్మేశానా ద్యలభ్యం – నిఖిలపతిపదం
దత్తవాన్ స్వాశ్రితేభ్యః
శ్రీమాన్ రామానుజో నో భవ భుజగ ముఖా
త్పాతు నిత్యం దయాళుః".

లోకోద్ధరణార్థమై భూ మండలమున మానవ శరీరధారియై యవతరించి, దుర్వృత్తను లగు సకల నాస్తికులను పరాజితుల గావించి, వైష్ణవ మతమును ప్రతిష్ఠించి, బ్రహ్మ రుద్రాదుల కలభ్యము లగు శ్రీమ న్నారాయణుని పాదారవిందములను స్వాశ్రితులకు ప్రదత్త మొనరించి, ఉభయ విభూతి నాయకులుగా వెలసిన భగవద్రామానుజులు - సంసార రూపమైన కరాళ కాలసర్ప ముఖము నుండి మనలను సర్వదా కాపాడుగావుత !



శ్రీనివాసాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

    

# శ్రీవైష్ణవ సంప్రదాయములో రెండు శాఖలు

( సంపాదకీయము )



శ్రీ శేషాచలాధీశుని దివ్య ఘంటావతారు లగు శ్రీ వేదాంత దేశికులు భగవదనుగ్రహ విశేషముచే-సర్వ తంత్ర స్వతంత్రులై, ముప్పది సారులు శ్రీభాష్యమును అధికరించినవారై, తత్త్వ టీక, శత దూషణి, గీతా భాష్య వ్యాఖ్యానము, అధికరణ సారావళి, తత్త్వ ముక్తా కలాపము, న్యాయసిద్ధాంజనము, న్యాయ పరిశుద్ధి - మొదలగు అనేక గ్రంథములను రచించి, సంస్కృత వేదాంత ప్రస్థానమునకు ఒక నూతనోత్తేజమును కలుగజేసిరి. మఱియు - ద్రమిడోపనిషత్తాత్పర్య రత్నావళిని రచించి - ద్రావిడ వేదాంత ప్రస్థానమునకును, ద్వాత్రింశ ద్రహస్యములను రచించి-రహస్య ప్రస్థానమునకును, పాంచరాత్ర రక్ష - మొదలగువానిని రచించి - శ్రీ పాంచరాత్ర ప్రస్థానమునకును - విశేష ప్రాచుర్యమును గల్గించుటయేగాక, సంస్కృత భాషామయములగు నిరర్గళ ప్రౌఢ గంభీర స్తోత్ర జాలముల వలె - ద్రావిడ భాషా మయము లగు దివ్య ప్రబంధములను గూడ రచించిరి. వీనికే - 'దేశిక ప్రబంధము' అను వ్యవహారము ప్రసిద్ధము. వే యేల ? వీరు రచింపని గ్రంథములు ఏ భాగమునందును లేవన్న, అతిశయోక్తి కానేరదు. ఇట్లు 'దేశికులు - బహు గ్రంథకర్తలై, 'కవి తార్కిక సింహ' అను బిరుదమును

బడసి, అఖండ యశమును సముపార్జించిరి, శ్రీ విశిష్టాద్వైత మత వికాసము నకై, వీ రొనరించిన నిరుపమాన సేవా త్యాగములు-శ్రీవైష్ణవ లోకమునకు చిరస్మరణీయములై యున్నవి."

ఈ మాటలు - ఈనాటివి కావు. ఏనాడు శ్రీ రామానుజ కీర్తికౌముది - మొదటి భాగము వెలువడుచుండెనో, ఆనాడు - ఆ భాగములో - 'శ్రీవైష్ణవ దర్శనము'అను శీర్షికతో, సంపాదకీయమున-శ్రీ వేదాంత దేశికుల ప్రతిభా ప్రాభవముల నుగ్గడించుచు వ్రాయబడిన వాక్యములు.

ఇపు డీ 'చతుర్దశి' కళలో - అట్టి దేశికుల జీవిత విశేషములను, వారు రచించిన గ్రంథ వివరములను, ఆ గ్రంథములలోని విశేషములను, వారి ఛాయా చిత్రాదులను ప్రచురింపగల్గుచున్నందులకు - మే మెంతయు సంత సించుచున్నాము.

* * *

శ్రీవైష్ణవ సంప్రదాయము భారత దేశమున - చిరకాలమునుండియు ప్రచలిత మగుచున్నట్లు - చరిత్రాధారములను బట్టి - తెలియవచ్చుచున్నది. అంతమాత్రమేగాక, భారతదేశమునకు పరిసరములందుగల-జావా, చంపా, శ్యామ, కంబోడియా, బలిద్వీపము - మున్నగు ప్రాంతములందును వైష్ణవ సంప్రదాయము చిర కాలము నుండియు వ్యాపించియున్నట్లు - వైష్ణవ సాహిత్య సిద్ధాంతపరిశోధకుల నిర్ణయము, 1

ఈ వైష్ణవ సంప్రదాయము ఆళ్వారుల యుగమున - అనగా - క్రీస్తు శకమునకు మూడు(3) వేల సంవత్సరముల ముందునుండియు దక్షిణ భారతములో విస్తరించుచు రాగా, ఆచార్యుల యుగమున (క్రీ: శ: 823 - 1446) - భారతదేశమం దంతటను పుష్కల శోభతో ప్రకాశింపసాగెను.

---

1. వైష్ణవ సంప్రదాయోంకా సాహిత్య, ఔర్-సిద్ధాంత్. (15-22 పుటలు)
— ఆచార్య - బలదేవ ఉపాధ్యాయ.

ఒక వంక - పన్నిద్దరాళ్వారుల దివ్య ప్రబంధ మధుర గానము ముముక్షువులకు వీనుల విం దగుచు - భగవ దనుభూతిని కలిగించుచుండ, మఱి యొక వైపున - నాథ, యామున, రామానుజాది ఆచార్య ప్రముఖుల విశిష్టాద్వైత సిద్ధాంత మహోపదేశములు - అట్టి ముముక్షువులకు మార్గదర్శకములై, ఆనందానుభూతిని కలిగింపజేసెను.

అట్టి తరుణమున వేదాంతదేశికు లుద్భవించి, బహుశాస్త్ర కోవిదులై, రామానుజ భక్తులై, తమకు భగవద్రామానుజులయందు అచంచల భక్తి విశ్వాసములు కలవనుటకు తార్కాణముగ - 'యతిరాజ సప్తతి' అను నొక స్తోత్ర గ్రంథమును రచించినవారలై, 2 శ్రీరామానుజ సిద్ధాంతమును దేశమం దంతటను పరివ్యాప్తము గావించుటకు ప్రతిజ్ఞ చేసినవారలై, ఆ రామానుజ సిద్ధాంతమునకు అనుగుణముగా 'తత్త్వముక్తా కలాపము' - మున్నగు వేదాంత గ్రంథము లనేకములను రచించిరి. ఈ యంశమును - పూనా వాస్తవ్యులు, న్యాయ వేదాంత శిరోమణి, విద్యావారిధి పట్టభద్రులునగు శ్రీమాన్- డాక్టర్ : నా. రా. శ్రీకృష్ణ తాతాచార్యులు అను వారలు-దేశికులవారి తత్త్వ ముక్తాకలాప గ్రంథమున - ముందుగా వ్రాసిన 'ప్రస్తావన'లో - ధ్రువీకరించియున్నారు. 3

---

2. శ్రీ వేదాంతదేశికులు సంస్కృతభాషలో రచించిన 'యతిరాజసప్తతి'కి- శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులవారుచేసిన ఆంధ్రపద్యానువాదము- శ్రీరామానుజ కీర్తి కౌముది - ౨ - వ భాగములో ప్రచురింపబడినది.

3. "తత్ర తత్త్వ ముక్తా కలాపాఖ్యా మూల గ్రంథః స్రగ్ధరా వృత్త గుంఫితః 500 పద్యమయ స్స్వతంత్రవత్ - రామానుజ సిద్ధాంత సమ్మత - సకల వేదాన్తార్థ సంగ్రాహకః, తస్య సర్వార్థసిద్ధి నామకః స్వోపజ్ఞ వృత్తి గ్రంథో దర్శనాన్తర తత ద్యుక్తి ప్రమాణాది వివేచన పూర్వకం - తదీయ సిద్ధాంత ఖండన ముఖేన స్వ మతః సంరక్షణాయ, నిర్ధారిణాయ చ ప్రగల్భ్యతే."

—(సంపూర్ణానంద సంస్కృత విశ్వ విద్యాలయము - (వారణాశి) వారిచే 1990 లో ప్రచురింపబడిన తత్త్వ ముక్తా కలాపమునందు-మొదటి పుటలో - 'ప్రస్తావన' పంక్తి భాగము.)

శ్రీ రామానుజ సిద్ధాంత పథమున తాము పయనించుచు, తదనుసారముగ వేదాంత గ్రంథ రచన జేయుచు, ఆ సిద్ధాంతమును ప్రజానీకమున ప్రచారము గావించుటకు శ్రీ వేదాంత దేశికులు ఉద్యుక్తులై, అందుల కొక ప్రణాళికను సిద్ధము చేసికొన్నవారలై, ఆ నూతన ప్రణాళికలో - కొన్ని మార్పులు, కొన్ని చేర్పులు - చేసినవారలై, విశిష్టాద్వైత మత ప్రచారమునకు శ్రీకారము చుట్టిరి. అట్టి చేర్పులు, మార్పులు-దేశికులచే చేయబడిన కారణమువలననే - శ్రీవైష్ణవ సంప్రదాయము రెండు శాఖలుగా చీలి, 'వడగల', 'తెంగల' - అను భేదములతో సిద్ధమయ్యెను. 4

ఏది యేమైనను - భారత భూభాగమున-శ్రీవైష్ణవ సంప్రదాయము నేటి వఱకును సజీవముగ నున్న దన్నచో, అందులకు - ఆనాటి దేశికుల ప్రభావ - ప్రచారములు కొంతవఱకు హేతు భూతము లనుట - నిర్వివాదాంశము.

అట్టి దేశికుల దివ్య మూర్తికి - ఇందుమూలమున మేము-హృదయ పూర్వకముగ - జోహారు లర్పించుచున్నాము.

---

4. 'వడగల — తెంగల సంప్రదాయ భేదములు' అను నొక వ్యాసము - రానున్న పూర్ణిమ కౌముదిలో ప్రచురింపబడనున్నది. కావున, దానిని పరిశీలించి, సంప్రదాయభేదములను పాఠకులు గ్రహింపవచ్చును.



# వి ష యా ను క్ర మ ణి క

# 10. ప్రముఖ వైష్ణవ క్షేత్రములు - తద్విశేషములు 153 - 179

శ్రీమాన్ కందాడై శ్రీనివాసాచార్యులు

శ్రీరంగము
గోష్ఠీపురము
శ్రీవిల్లి పుత్తూరు
ఆళ్వారు తిరునగరి
వానమామల
తిరుక్కురుంగుడి
తిరువనంతపురము
తిరువహీంద్రపురము
కాంచీపురము
తిరువళ్ళూరు
మహాబలి పురము
తిరువళ్ళిక్కేణి
ఘటికాచలము
వేంకటాచలము
అహోబిలము
అయోధ్య
నైమిశారణ్యము
సాలగ్రామము
బదరీ నారాయణము
దేవ ప్రయాగ
నంద ప్రయాగ
ద్వారక
గోకులము
గోవర్ధనము



శ్రీ పద్మావతి

శ్రీ వేంకటాచలపతి

# శ్రీ వేంకటేశ్వరోదాహరణము

రచన:

## శ్రీమాన్ తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు



### ప్రథమా విభక్తి

శ్రీ కరుణాకరుం డగుచు జీవుల తీవులఁ బ్రోచి కాచుచుం
గైకొని లోకముల్ మనిపి, కర్తయు భర్తయునై మునుల్ సురా
నీకము లోకముం బొగడ నీరజజాతుని తాతయైన సు
శ్లోకుఁడు వేంకటేశ్వరుఁడు చూడఁగ నొప్పెడు బ్రహ్మ మింతకున్.

### కళిక

మఱియు నెఱుకల కెల్ల నెల్లగు మహిత హిత జన కల్పభూజము
మెఱపు లొఱపులఁ జెలఁగు వెలుఁగుల మించు మించుల మొదలి తేజము
నుడుఁగు వెడలని చిలువ చెలువము మాయఁజేయు మహానుభావుఁడు
జడధి నడుమను తెరువు విరివిగ జరతి వఱపిన దేవదేవుఁడు
కరము లురలఁగ బాణ ప్రాణము గాఁచి యేఁచిన నాఁటి నేర్పరి
సొరిది బిరుదుల యసుర విసరము స్రుక్కఁ ద్రొక్కిన వేల్పుఁ దీర్పరి
పడగ లడరెడు శయ్య నెయ్యపు భామఁ బ్రేమ రమించు చెలువుఁడు
జడికి గొడుగుగఁ గేల శైలము చాటు వీటికి జేయు బలుపుఁడు.

### ఉత్కళిక

దురిత విరహిత గురుఁడు వేదపు
శరధి నురుతర శాస్త్రవాదపు

నగము సుగుణపు గుణముఁ జుట్టుచు
పొగడఁ దగు సత్త్వమునఁ బట్టుచుఁ
గెరలి తరువఁగ నరుఁడు మీఱఁగ
సురల దొరలకు నోరు లూఱఁగ
నంది పొడమిన యమృత సారము
నంద వనితానందపూరము.

## ద్వితీయా విభక్తి

ఏఁటికి వేల్పులార! చద లేటికిఁ బోయెద రిందు రంతు కో
నేటికి వచ్చుఁ దీర్థచయ మేఁబది లక్షల దోడఁ గూడు ము
క్కోటియు నంచు బల్కు మునికోటుల మాటలు నేర్చి కీరముల్
చాటు తటాట వి న్నటన సల్పెడు వేంకట భర్తఁ గొల్చెదన్.

## కళిక

మఱియు నెఱిఁగిన బుధుల మనసు లెనసినవాని
మెఱుఁగులక గుఱియైన మేను పూనినవాని
గొల్లెతల నెల్లెడలఁ గూడి మాడినవాని
మల్లులను విల్లు నటు మట్టి కొట్టినవాని
జక్రమున చక్రమును జడియ నడిచినవాని
శుక్రు డొక వక్రి గతి............
వీరుఁ డగు కౌరవుని వీడనాడినవాని
శూరుఁ డగు సీరితో తోడుగూడినవాని.

## ఉత్కళిక

మేడెములు గూడుకొని
వాడలను దాడి గొని

యుట్టులనుఁ జుట్టులను
దెట్టెలుగఁ గొట్టి రని
యాటలనుఁ బాటలను
జోటులను మాటుకొని
కలసి మెలసినవాని
దులసి వలసినవాని.

## తృతీయా విభక్తి

తీఱు నఘంబు లెల్ల నిలుఁ దీర్థము వచ్చినయంత సంపదల్
మీఱు సుఖంబు గూడు మతి మిక్కుటమై శ్రుతివీథి దూఱు వే
నూఱులుఁ జెప్పనేల ? సుమనోవిభుచేఁ దిరువేంకటేశుచేఁ
బూఱులుగా వరంబు లిల జొప్పడఁ గొందము రండు మానవుల్.

## కళిక

మఱియు వఱలు సుజన భజన మానలేనివానిచేత
మెఱపు మఱపు లేక జోక విడువ కడరువానిచేత
శ్రుతుల గతుల నడువ నుడువ జొక్కి చిక్కువానిచేత
అతుల మతుల జెలఁగి మెలఁగినట్టివానిచేత
నగము మొగము చూపు దాయ జదియ నడుచువానిచేతఁ
బొగులు మగువ వలువ లొలువఁ బ్రోచి కాచువానిచేత
జాతి నాతిఁ జేసి వాసి ఱట్టుపెట్టువానిచేత
వాత జాతుఁ బనులఁ గొనుచు వసుధ నెసఁగువానిచేత.

## ఉత్కళిక

పురము లెఱియ శర మనంగ
బరగి దురము పురి కొనంగఁ

గమలమునఁ దనయుఁ గను గరుడవాహను వలన
నమిత హిత యువతి తతి నవ్వ మోహను వలన
నలువ నెలవ వల ధ్రువునకు నొసగు హరి వలన
కలువ చెలి చెలియని గలయు బిత్తరి వలన.

## ఉత్కళిక

తెఱఁగు వెఱుఁగని బంది
విఱిగి యెఱుఁగఁగఁ బంది
యుద్ది మద్దుల వ్రాల్చి
గ్రుద్ది యెద్దులఁ గూర్చి
ఘాతఁ బూతనఁ దీర్చి
చేత నేతులు గూర్చి
యున్న వెన్నుని వలన
నున్నతోన్నతు వలన.

## షష్ఠీ విభక్తి

మానిసి దిండ్ల మొత్తు నెఱ మంటల ప్లిల్లల కత్తి వేల్పు, పెన్
బోనపు ముద్ద నిద్దముల పొల్పు దొలంకెడు సంకుఁ గల్గు నె
వ్వానికి వానికి న్నత భవానికి వేంకటశైల శృంగ స
న్మానికి భక్తసంద దభిమానికి నే శరణంబు మ్రొక్కెదన్.

## కళిక

మఱియు నెఱయు మంత్ర తంత్ర మర్మ ధర్మ కీలకునకు
చిఱుత యుఱుత భక్తి శక్తి జెలఁకి మేలఁగు పాలకునకు
సోమ ధామ నూత్న రత్న సుకర మకరకుండలునకు
సామ భూమ గాన మాన నక్త భర్తమండలునకు

బంతిఁ గొంతి తనుజు ననుజు బండి నుండి మాధవునకు
జంతు యింతి గంచ మంద్రి చక్క నొక్క భూధవునకు
రాజి తాజి కుంభి కుంభ రక్తసిక్త భీకరునకు
భోజరాజ పుత్రి మైత్రిఁ బొదలి మొదలు శ్రీకరునకు.

ఉత్కళిక

భువన సువన ఫలము లలమి
జవన పవన బలము కలిమి
యెదలు పొదల మఱఁగి తిరిగి
చదల తుదల కరిగి పెరిగి
సేపు మాపు మించి పొంచి
రూపు మాపి సంచరించు
యోగ రాగ కీరమునకు
యాగ భాగ సారమునకు.

సప్తమీ విభక్తి

కోరి పదారువేలయిన కొమ్మల నెమ్మదిఁ బెండ్లి యాడినన్
ధారుణి బ్రహ్మచారి నని తప్పక పల్కి పరీక్షితున్ మహో
దారతఁ బ్రాణ మెత్తుచుఁ బ్రతాపము మీఱఁగ బ్రోచి మోహనా
కారునియందు వేంకట శిఖామణియందు మనంబు నిల్పెదన్.

కళిక

మఱియు శోభి గుణాభిమానియందు
తఱి నాభి జనితాభిధానియందు
శతపత్ర సమనేత్ర శౌరియందు
తత చిత్రతర గోత్రధారియందు

శతకోటి శతకోటి సారియందు
గ్రతువాటి రిపుధాటికారియందు
భుజగేంద్ర ఘనసాంద్ర భుజునియందు
రజనీంద్ర రుంద్ర గోత్రజునియందు.

### ఉత్కళిక

భువియు బవనంబు
దివియు భువనంబు
రుచులు నచరంబు
ఖచర నిచయంబు
నలరు బలుసొంపు
గలగు చెలువంపు
ధరణీ ధరునంచు
బరమ గురునందు.

### సంబోధన

వాలిన నీ ప్రభావములు వర్ణన సేయఁగరావు కీలికిన్
శూలికిఁ దమ్మిచూలికిని సోలికి నున్నసురారికిం బ్రభా
మూలికి నాకు నెన్న వశమా యసమాన గుణాఢ్య ధన్య గో
పాలక బాలకా నిగమ భాషణ కీలక వేంకటేశ్వరా!

### కళిక

మఱియు దఱచగు సిరుల మరుల కొసఁగెడు దాత!
కఱకు విఱి నెఱి విఱుచు ఘన జనక జామాత!

వెక్కసపు రక్కసుల వేచి కాచినవాఁడ !
యుక్కఱఁగ నక్కడలి యుబ్బు గిబ్బిన ఱేఁడ !
విదురుఁ డెదురుఁగ జేయు విందు పొందుల జాణ !
ముదురు వెదురునఁ బాట మూట గట్టిన గాణ !
వేటి శరకోటి నెడలించి త్రుంచిన రామ !
యేటి నాగేఁటిఁ గదియించి చించిన రామ !

ఉత్కళిక

ఘన వనధి యను పాదు
నను మునుఁ బలుకుఁ బ్రోదు
లలర మొలచిన మొదలు
కలిమి చలువలఁ బొదలు
ప్రమద సుమములఁ దొల్లి
యమరిన రమావల్లి
జెలఁగునో యెలఁదేఁటి !
కలికి తలముల మేటి !

సార్వ విభక్తికము

నీ వీశుండవు - నిన్ను గొల్తు - వరముల్ నీచేతఁ గైకొందు - నేఁ
గైవారం బొనరింతు నీకొఱకు - సంకల్పింప నీడీరె మ
త్సేవల్ నీ వలనన్ - మహా యశము నిచ్చెన్ నీకు - నీయందు ల
క్ష్మీ వాల్లభ్యము గంటి - భక్తవరదా ! శ్రీ వేంకటాద్రీశ్వరా !

అంకితాంకము

అరవితారకకంబుగ నుదాహరణంబు రచించె భక్తివి
స్ఫారతఁ దాళ్ళపాక పుర శాసనుఁ డన్నయ తిరమలార్య డిం
భారఁగఁ జక్రనందక గదాంబుజ ధారికి శ్రీవధూ మనో
హారికి వేంకటాచల విహారికి శౌరికి నంకితంబుగాన.

—o—

# అవతార తత్త్వము దశావతారములు

'సాహిత్య విద్యాప్రవీణ'

## డాక్టర్ : సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు

ఎం. ఏ; పి హెచ్. డి.



## నమస్సుమాంజలి

శ్రీమన్ ! వైకుంఠనాథ ! ప్రతియుగ మవనే ద్వారదూరీ క్రియాయై
గృహ్ణాన్ మత్స్యాదిమూర్తీ రవని ఖల మదో ద్మర్ణవోవ్య త్ప్రహారః
సాధూనాం రక్షణం హి ప్రథమ తర మ భూ ర్మత్స్యదేహా ద్గృహీతే
ర్లక్ష్యం దౌర్జన్య భావ ప్రశమన మపదం కృత్వా మధ్యా మనస్తి ॥

(వ్యాసకర్త రచించిన వైకుంఠనాథ విలాసములోనిది.)

## ఉపక్రమము

పరమ వ్యోమము, త్రిపాద్విభూతి - ఇత్యాదిగా వ్యవహరింపబడు శ్రీవైకుంఠమునందు - శేషశయనుడై పవ్వళించి, లక్ష్మీపరిచర్యచే నిత్య పరితుష్టుడై, స్వాశ్రితుల ఆర్తిని పారద్రోలుటకై, నిరంతరాయుధ సన్నద్ధుడైన శ్రియఃపతి - సృష్టి స్థితి లయము లనబడు తన లీలా ప్రణాళికలో - అప్పుడపుడు భువికి దిగివచ్చుటయు, తనవారితో కలసి ఆనందించుటయు, వారి సుఖ దుఃఖములలో తానును పాలు పంచుకొనుటయు - ఒక లీలా విలాసము. ఈ రీతిగా దిగి వచ్చు దానినే - మనవారు - 'అవతరించుట' - అని వ్యవహరించిరి. ఈ అవతరించుటలోని ఆంతర్యమును, అవతరించిన విధానమును - శ్రుతులు, పురాణములు, ఇతిహాసములు, ఆగమశాస్త్రములు, దివ్య ప్రబంధములు - మున్నగునవి ఎంతగనో కొనియాడినవి.

## అవతార లక్ష్యము

" యదా యదా హి ధర్మస్య - గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య - తదాత్మానం సృజా మ్యహమ్. "

ఎపు డెపుడు (వేదోక్త) ధర్మమునకు లోపమును, అధర్మమునకు వృద్ధియు కలుగుచున్నదో - అప్పుడంతయు - నన్ను నేనే సృజించుకొను చున్నాను' అని భగవద్గీతలో (4_7) శ్రీకృష్ణభగవాను డనుటనుబట్టి, భగవ దవతార లక్ష్యము - ధర్మప్రతిష్ఠాపనమే యని - స్పష్ట మగుచున్నది. అదియును గాక.

" పరిత్రాణాయ సాధూనాం - వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ - సంభవామి యుగే యుగే. "

సాధువులను (ధర్మపరులను) రక్షించుటకును, పాపులను నశింపజేయుటకును, (వైదిక) ధర్మమును స్థాపించుటకును - ప్రతి యుగమునందును నేను పుట్టుచున్నాను. (అవతరించుచున్నాను)' అనియు గీతాచార్యుడు పలికి యున్నాడు. (భ.గీ. 4-7)

" సాధవో హ్యుపాసకాః. తత్పరిత్రాణ మేవ ఉద్దేశ్యమ్. అనుషంగిక స్తు-దుష్కృత వినాశః. సంకల్పమాత్రే ణాపి త దుపపత్తేః. "

సాధువు లనగా - ఉపాసకులు. వారిని రక్షించుటయే భగవానుని ప్రధాన లక్ష్యము. ఇక, దురాత్ములను శిక్షించుట - అనునది - అనుషంగిక ప్రయోజనము. సంకల్ప మాత్రము చేతనే ఆ భగవాను డా పనిని చేయ వచ్చును' అని - భగవద్రామానుజులు - తమ శ్రీభాష్యములో - అంతరాధికరణమున వివరించియున్నారు :-

" పురుషోత్తమః శ్రీమన్నారాయణః.... పాండుతనయ యుద్ధ ప్రోత్సాహన వ్యాజేన.... భక్తియోగ మవతారయామాస. "

పరబ్రహ్మయు, పురుషోత్తముడును అయిన శ్రీమన్నారాయణుడు - చతుర్ముఖబ్రహ్మ మొదలు - స్థావరాంతమైన సృష్టి చేసి, స్వస్వరూపముతో వేంచేసియున్నవాడై, బ్రహ్మ మొదలగు దేవతలను - మనుష్యులకు - ధ్యానము, ఆరాధనము - మున్నగువానికి గోచరము కానివాడై, అపారమైన కారుణ్యము, సౌశీల్యము, వాత్సల్యము, ఔదార్యము - మున్నగు కల్యాణ గుణములు కలవాడై, అద్భుతమైన తన రూపమును, తన స్వభావమును, వదలనివాడై, తత్తత్సజాతీయాకారయుత సన్నివేశముతో కూడి, ఆయాలోకములలో పలుమారులు అవతరించి, వారి వారిచే ఆరాధింపబడి, వారియభీష్టములకు తగిన రీతిగా ధర్మార్థ కామ మోక్షము లనబడు చతుర్విధ పురుషార్థ ఫలమును అనుగ్రహించుచు, భూ భారమును తొలగించుట - అను నెపముతో - మనవంటివారలకు కూడ ఆశ్రయింపదగియుండుటకై, అవతరించి, ఈభూమిపై సర్వ జనులకు దృష్టి గోచరుడై, సమస్త లోక మనోహరములైన కృత్యములను జూపుచు, పూతనాది దుర్వృత్తులను సంహరించి, తన సౌందర్య - సౌశీల్యాది గుణములతో, అక్రూర - మాలాకారులను పరమ భాగవతులనుగా నిరూపించి, అర్జునుని యుద్ధమునకు ప్రోత్సహించుట - అను నెపముతో - పరమ పురుషార్థమైన మోక్షమునకు సాధనమై, ఉపనిషత్తులలో చెప్పబడిన - జ్ఞాన కర్మలతో గూడిన భక్తియోగమును లోకమున భగవంతుడు వ్యాపింపజేసెను' అని - భగవద్రామానుజులు తమ గీతాభాష్యములో - ఉపోద్ఘాతమునందు ఉద్బోధించియున్నారు.

ఇచట - కృష్ణావతారము ప్రధాన లక్ష్యముగా నిరూపింపబడినను, సాధారణముగ - అన్ని అవతారములకు అనుగతముగా నుండు లక్షణములు చెప్పబడినవి :-

(1) పరతత్త్వ దశలో - బ్రహ్మతోబాటు - ఇతర దేవతలకు, మానవులకు - ధ్యానమునకు, ఆరాధనార్థమునకు సైతము గోచరము కాని తనస్వరూపమును, వానిలో సహజముగా గల జ్ఞాన శక్తి బలైశ్వర వీర్య

తేజము లనబడు షడ్గుణైశ్వర్యములను ఏమాత్రమేని విడువక, ఆ యా లోకములలో అవతరించి, వారి వారిచే ఆరాధింపబడుట.

(2) ఆరాధించువారి యభీష్టమునకు తగినట్లు – పురుషార్థ ఫలమును అనుగ్రహించుట.

(3) భూ భారమును తొలగించుట – అను మిషతో – ఏ యొకనికిని అనుభవ గోచరము కాని సర్వాశ్రయణీయుడుగా ఎల్లఱకును కానుపించునట్లు అవతరించుట.

(4) తన దివ్య చేష్టల మూలమున దుష్టులను దునుమాడుట.

(5) తన నాశ్రయించిన పరమ భాగవతోత్తముల వైశిష్ట్యమును లోకమునకు తెలియజేయుట.

(6) ఎవరినో ఒకరిని ఆలంబనము గావించుకొని, సర్వదా తరణోపాయమును, ముఖ్యముగా – జ్ఞాన కర్మానుగృహీతమైన భక్తియోగమును గాని. లేక – ఆ యా కాలములకు దగినట్లు – తాత్త్విక విజ్ఞానమును లోకమునకు అందించుట.

అనునవి – ఏ యవతారమునకేని సాధారణ లక్షణములుగా మనము గుర్తించవచ్చును. దుష్ట శిక్షణము – శిష్ట రక్షణము – అనునవి అనుగతముగా నుండు లక్షణములు. అవతార దశలో – పరమాత్మకు గల దేహము, ఆవిర్భావము మొదలైన వేవియు – మన వలె ప్రాకృతములు కావు.

" ఈశ న్నపి మహాయోగీ సర్వస్య జగతో హరిః
కర్మణ్యారభతే కర్తుం కీనాశ ఇవ దుర్బలః. "

నిఖిల జగత్తులను నియమింప సామర్థ్యము సహజముగా గల భగవానుడు కూడ – ఒక్కొకపుడు దుర్బల చేష్టలను ప్రదర్శించుట – కేవలము లోకమును మోహింపజేయుటయే కాని, వేరు కాదు. ఇత్యాది – స్వేచ్ఛగా

భగవ ద్భావమును కప్పిపుచ్చుకొనుటయే యని మహాభారతేతిహాసము (67-14) వక్కాణించుచున్నది.

విష్వక్సేనాంశా సంభూతు లగు నమ్మాళ్వారు - తమ - తిరువాయి మొళి దివ్య ప్రబంధములో - భగవ దవతార లక్ష్యమును ఇట్లు వ్యక్తీకరించి యున్నారు :-

" తురురిలిక్ శుడరొళి తన్నుడై చ్చోతి నిన్దమ్ నిక్కవే
తుయరి లిల్మకి యిమ్ మనిశర్ శేయ్‌వితుతిన్ తోన్ఱిక్కణ్ణాంచన్ను
తుయరజ్ఞళ్ శెయ్‌తు తన్ తెయవనిలై యంగిల్ పుగవుయ్‌క్కు మన్మాన్
తుయరమిల్ శీర్కణ్ణమాయాన్ పుగళి తుత్తయానోల్ తుమిలనే. "
- (తిరువాయి మొళి : 3-10-6.)

ఈ ద్రావిడ పాశురమునకు ఆంధ్రానువాద మిది.

" నిండు తేజ స్స దే రీతి నెలకొనంగ
ప్రాకృతము కాని దివ్య విగ్రహము తోడ
పాప భూయిష్ఠ మైన ప్రపంచమందు
మనుజుడై పుట్టి కనులార జనులు గాంచు
వగిది నటియించుచు జగంబు భ్రమము జెంద
సాదు జన రక్షణమును, దుష్ట జనుల శిక్ష
సలిపి, తన యీశ్వరత్వంబు స్థాపనం బొ
నర్చు శ్రీకృష్ణమూర్తి గుణంబు లనుభ
వించు నే నెట్లు దుఃఖంబు కాంచగలను?. "
- (శ్రీముఖ సూక్తి : పుట సంఖ్య. 157)

భగవానుడు - తాను అవతరించినపుడు - తన అప్రాకృత దివ్య మంగళ విగ్రహమును, తన అసాధారణమైన కల్యాణ గుణమును, ఆ దివ్య మంగళ విగ్రహ మందలి స్వభావమును - ఎంతమాత్రము విడచివేయక

అవతరించు ననియు, దుఃఖ సాగరముతో మునిగియున్న మానవులకు - సజాతీయము లగు జన్మలతో ఆవిర్భవించి, వారి నేత్రములకు గోచరించుచు, తనయందు ప్రీతి గల్గిన స్వాశ్రితులకు తన లీలలతో అలరించుచు, వ్యామోహమును గల్గించుచు, తన ప్రతికూలతను నశింపజేసియు - తన పదతవీమును లోకమున సుస్థిరము గావించుకొనును.

తన నాశ్రయించినవారిని రక్షించుటకు - ఏ విధమైన జాతిలోనైనను జన్మించును. తుదకు - జలచరాదులందుగాని, పశు పక్ష్యాదులందుగాని భగవాను డావిర్భదించును. పశువులను మేపువాని జాతిలో స్వామి జన్మించినాడు. జల ప్రవాహములో - మత్స్య రూపము ధరించి ఉద్భవించెను. అంతే కాదు. అంతటను ఏవగించుకొను వరాహావతారముతోడను స్వామి ఆవిర్భవించెను.

"ఈ ప్రపంచము యొక్క సృష్టి స్థితి లయములకు కారణమై, తీర్థభూతుడైన సర్వేశ్వరుడు - అశ్వముగను, కూర్మముగను, మీనముగను, మనుష్యుడుగను అవతరించెను. ఆ భగవానుడు మూడు లోకములను రక్షించును."

ఇయ్యవి - నమ్మాళ్వారుల శ్రీసూక్తులు. ఈ సూక్తులనుబట్టి, భగవ తవతార లక్ష్యము - తన సౌలభ్యమును స్వాశ్రితులకు అనుభవ గోచరము చేయుట, స్వాశ్రితులను రక్షణము చేయుటయే - అని స్పష్ట మగుచున్నది.

ఇక గోదాదేవిగా ప్రసిద్ధి గాంచిన ఆండాళ్ - తన 'తిరుప్పావు' దివ్య ప్రబంధములో - శ్రీకృష్ణ భగవానుని -

" పెత్తుం మేయత్తుణ్ణమ్ కుల-త్తిశా పిరస్టు "

ఆవులను మేపుకొను గొల్ల కులములో పుట్టినవా డని వర్ణించినది.

భగవంతుని అవతారమునకు హేతు వేమి? అని - పిళ్ళలోకాచార్యులు తమ 'తత్త్వత్రయ' గ్రంథమున వితర్కించుచు - భగవ దిచ్ఛయే అవతార హేతు వనియు, అటుల స్వేచ్ఛగా అవతరించుటలో - సాధు పరిత్రాణము దుష్ట వినాశము, ధర్మ సంస్థాపనము - అను మూడు కారణములనియు - సిద్ధాంతీకరించిరి.

"పరిత్రాణాయ సాధూనాం" అను భగవద్గీతా శ్లోకమును భగవద్రామానుజులు వ్యాఖ్యానించుచు - 'సాధువు లనగా - వెనుక చెప్పబడిన ధర్మశీలాదులు కల వైష్ణవాగ్రేసరులు; మాత్సర్య దోషము లేనివారు; నన్నాశ్రయించుటలో ప్రవర్తించినవారు; నా పేరు, నేను చేసిన కర్మలు, నామ రూపములు - వా జ్మనస్సులకు గోచరము కాని కారణము వలన, నన్ను దర్శించనిచో - ఆత్మధారణ పోషణాదులను పొందజాలనివారలై, ఒక క్షణ కాలమును కల్ప సహస్రముగా భావించుచు, శిథిలములైన సర్వాంగములు కలవారు కాగల రని, - నా స్వరూపమును - నా చేష్టలను దర్శించి, నాతో మాటాడుట మొదలైనవానిని అనుగ్రహించి, వారిని రక్షించుట, వారికి విపరీతముగ ప్రవర్తించు దుష్టులను నిగ్రహించుట, క్షీణించిన వైదిక ధర్మమును - అనగా - నా ఆరాధన స్వరూపమును, ఆరాధ్య స్వరూపమును దర్శింపజేయుట మూలమున స్థాపించుటకై, ప్రతి యుగ మందును ఆవిర్భవించుచుందును. కృత యుగము, త్రేతాయుగము - అను యుగ విశేష మేమియు లేదు" అని వివరించియున్నారు. ఈ యంశమును గురించి శ్రీవత్సాంకమిశ్రులు (=కూరత్తాళ్వారులు) తమ సుందర బాహు స్తవములో -

" యే భక్తా భవ దేక భోగ మనసో ఽనన్యాత్మ సంజీవినః
త త్సంశ్లేషణ తద్విరోధి నిధనా ద్యర్థం వనాద్రీశ్వర !
మద్యేఽణ్ణం యదవాతరస్సువరా ద్యాకార దివ్యాకృతిః
తే నైవ త్రిదశై ర్న రైశ్చ సుకరం స్వప్రార్థిత ప్రార్థనమ్. " (86)

ఓ వనచగిరినాథా! నీ కంటెను ఇతరమైన ఆత్మోజ్జీవనోపాయమును, నీకంటెను ఇతరమైన భోగ్యమును, (ఉపేయమును) లేని నీ భక్తులను కలియుటకును, వారి విరోధులను చంపుటకును, ఈ బ్రహ్మాండ మధ్యమందు దేవ-మనుష్యాద్యాకారములు గల దివ్యాకారమును గలిగి అవతరించుట చేతనే - దేవతలు, మానవులును - తమ అభీష్టమును కోరుకొనుటకు సుకరమైనది. అవతారమే లేనిచో - వారెవరని ప్రార్థించెదరు? ప్రార్థనయే లేకుండును' - అని - వివరించియున్నారు.

## అవతార భేదములు - వాని ప్రాచీనత

ఆ యా సంప్రదాయములలో - ఆ యా దేవతలకు అవతారములను, వాని లక్ష్యములను వర్ణించుట - అను విధానము మనకు పురాణములలో గోచరించును. వైష్ణవ పురాణములలో విష్ణ్వవతారములను వర్ణించినట్లే, శైవ పురాణములలో - శివావతారములను వర్ణించుట జరిగినది. అయినను - లోకములో - విష్ణ్వవతారములకు గల్గిన ప్రాచుర్యమునుబట్టి 'అవతారములు' అనినంతనే - మనకు - వైష్ణవావతారములే స్ఫురణకు వచ్చును. ఈ అవతారములను గుఱించిన ప్రస్తావన - పురాణములందును, ఇతిహాసములందును విస్తృతముగా నున్నను - వీనికి బీజములు వేదములందే కలవు. ముఖ్యముగా - మహావిష్ణువుకు జెందిన మత్స్య - కచ్ఛప - వరాహ - వామన అవతారములను గుఱించిన ప్రస్తావన ప్రాచీన వాఙ్మయములో గలదు.

**శతపథ బ్రాహ్మణములో అవతార సూచన :**

మత్స్య - కూర్మ - వరాహ - వామనమూర్తుల ప్రస్తావన - శతపథ బ్రాహ్మణములో నున్నది. ఇది భగవదవతారము లను విషయము అచ్చట స్పష్టముగ లేకున్నను, అనంతర కాలమునందు ఆవిర్భవించిన పురాణాదులలో వీని వివరణ ఉండుటనుబట్టి - ఇవి అవతార సిద్ధాంత భావనకు మూల

3).

బీజ మని మనము భావించవచ్చును. శతపథ బ్రాహ్మణములోని ధర్శ - పూర్ణ మాస నిరూపణలో (కా. 1-8-9/58,59). ఒక వృత్తాంత మున్నది.

"మనవే హవే ప్రాతః అవభేద్య ముదక మాజహ్రుర్యథేదం పాణిభ్యా మవనే జనాయా హర న్త్యేవ్వం తస్మావకిని జానస్య మత్స్యః పాణీ ఆదదే........త మేవం ధృత్వా సముద్ర మభ్యవజహార, స యలధీం త త్సమాం పరిదిదేశ. తం సమ త్త్వ ఉపన్యాపుప్లువే, తస్య శృంగే నావః పాశం ప్రతిముమోచ, తేనైత ము త్తరం గిరిమతి దుద్రావ."- - (శతపథ బ్రాహ్మణము : 1-1-5

ఒకపుడు మనువు - ప్రాతః కాలమున - కర పరిమార్జనమున కవసర మగు జలమును తీసికొన్నపుడు - చేతిలోనికి ఒక చిన్న చేపపిల్ల వచ్చి చేరినది. నన్ను నీవు ధరించినచో - నేను నిన్ను తటమునకు చేర్చ గల నని ఆ చేపపిల్ల - మనువుతో పలుకగా, అపుడు మనువు ఆశ్చర్య చకితుడై, నీవు నన్ను ఏ రీతిగా తరింపజేయుగలవు ? అని ప్రశ్నించెను. అపుడు చేపపిల్ల- ఆ ప్రశ్నకు సమాధానముగ 'త్వరలో ఒక జల ప్రళయము రానున్నది. ఆ ప్రళయములో - నీవు నన్ను భద్రముగా కాపాడి ఉంచి, ఒక నావను సిద్ధము గావించుకొన్నచో - ఆ జల ప్రళయమున - నావలో నిన్ను ఆవలి గట్టుకు చేర్చగలను' అని పలికెను. అపుడు మనువు - ఆ చిన్న చేపపిల్ల - పెద్ద చేపపిల్లలచే భక్షింపబడకుండునట్లు - కాపాడెను. అపు డది - ఒక మహా మత్స్య రూపమున రూపొందెను. అయ్యది - ప్రళయ కాల ములో - తన కొమ్మునకు నావను తగిల్చి, ఆవలి గట్టుకు మనువును చేర్చెను. జల ప్రళయానంతరము భూమిపై పాదముంచు మని ఆ మత్స్యము మను వుకు సూచించెను.'

ఈ వాక్యములలో - ప్రళయ కాలమున మత్స్య రూపమును ధరిం చిన పరమాత్మ - మన్వాదులను నావలో రక్షించిన విధానము - పురాణము లలో వర్ణింపబడినదానికి సూచనగా నున్నది. ఇట్లే, మఱికొన్ని అవతారము లను గుఱించిన ప్రసక్తియు - శతపథ బ్రాహ్మణమున కానవచ్చును.

**ఆగమములలో అవతార ప్రస్తావన :**

శ్రీ పాంచరాత్రాగమమునకు జెందిన అహిర్బుధ్న్య సంహితలో - భగవంతునకు - 39 వైభవ మూర్తు లున్నట్లు తెలుపబడినది.

1. పద్మనాభ 2. ధ్రువ 3. అనన్త 4. శక్త్యాత్మక 5. మధుసూదన 6. విద్యాధిదేవ 7. కపిల 8. విశ్వరూప 9. విహంగమ 10. క్రోడాత్మన్ 11. బడబావక్త్ర 12. ధర్మ 13. వాగీశ్వర 14. ఏకార్ణవశాయి 15. కమఠేశ్వర 16. వరాహ 17. నారసింహ 18. పీయూష హరణ 19. శ్రీపతి 20. కాన్తాత్మన్ 21. రామజిత్ 22. కాలనేమిఘ్న 23. పారిజాతహర 24. లోకనాథ 25. శాంతాత్మన్ 26. దత్తాత్రేయ 27. న్యగ్రోధ శాయిన్ 28. ఏక శృంగ తను 29. వామన దేహ 30. త్రివిక్రమ 31. నర 32. నారాయణ 33. హంస 34. కృష్ణ 35. పరశురామ 36. రామధనుర్ధర 37. వేదవిద్ 38. కల్కిన్ 39. పాతాల శయన - అనునవియే ఆ వైభవ మూర్తులు. ఈ మూర్తులలో ప్రసిద్ధము లగు దశావతారములు గలవు. పాంచరాత్రాగమనమునకు సంబంధించిన సాత్త్వత సంహితయందును ఈ మూర్తులు చాలవఱకు వివరింపబడియున్నవి.

పైన పేర్కొనబడిన 39 మూర్తులలో - 4 మూర్తులు భగవానునకు సంబంధించిన సృష్టి ప్రళయములకు అనుబంధించినవి. అవి యెవ్వి యనగా-

చతుర్మూర్తియై, ధర్మాత్మజుడుగా ఈ నాలుగు అవతారములను ధరించినట్లు - మహాభారతములోని శాంతిపర్వమున - మోక్షధర్మపర్వ వచనమనుచున్నది.

> " కృతే యుగే మహారాజ ! పురా స్వాయంభువేఽన్తరే
> నరో నారాయణ శ్చైవ హరి కృష్ణః స్వయంభువః. "
>
> – (మహా భారతము : మోక్షధర్మ పర్వము . నారా: 334 – 12)

1, 5, 29, 30 సంఖ్యలు గల - పద్మనాభ, మధుసూదన, వామన, త్రివిక్రమ - అనెడు నాలుగు మూర్తులు - కేశవాది ద్వాదశ వ్యూహములలో చేరియున్నవి. ఈ నాల్గింటిలో - వామన, త్రివిక్రమావతారములు - మహా విష్ణువుయొక్క రెండు ప్రతీప మూర్తులు మాత్రమే. వామన మూర్తి - 'హృత్స్థ' మూర్తి. త్రివిక్రమ మూర్తి సర్వవ్యాపి, త్రైలోక్య పూరకమైన మూర్తి. ఇయ్యది - "అణో రణీమాన్ మహతో మహీయాన్" - అను తైత్తిరీయ అరణ్యక వచనమునకు నిదర్శనమే. మధుసూదన మూర్తి - 'మధువు' అనబడు రాక్షసుని సంహరించిననాటి వైష్ణవమూర్తి. ఇదియే - హయ వదన మూర్తి, శేషించిన మూర్తులలో కొన్ని - పురాణములలో నిర్దేశింపబడియున్నను - మఱి కొన్ని అవతార మూర్తులు ప్రసిద్ధములు కావు.

పైన పేర్కొనఁబడిన నాలుగు (4) మూర్తులు - భగవానునకు సృష్టి - ప్రళయ ప్రక్రియలకు అనుబంధించినవి. అవి -

1. పద్మనాభమూర్తి : ఈ పద్మనాభుని నాభికమలము నుండియే హిరణ్యగర్భు డావిర్భవించి, సృష్టి గావించెను.

2. ఏకార్ణవ శాయి : లక్ష్మీనాధుడై, ప్రళయానంతరము మహార్ణవ జలములో - శేషశయ్యపై పవ్వళించిన స్వామి. "నిషణ్ణం భోగిశయ్యాయాం" అని, సాత్త్వత సంహితయు, "పద్మయా సహ విద్యయా "సుశయనం చక్రీ" అని లక్ష్మి సంహితయు పేర్కొనియున్నవి. ఆళ్వారులు ఈమూర్తినే బహుధా కీర్తించిరి.

3. న్యగ్రోధశాయి : మఱ్ఱియాకుపై పవళించిన బాలమూర్తి యగు వటపత్రశాయి. ఈయన వాక్కునందే మార్కండేయుడు ప్రళయ కేళితమైన ప్రపంచమును గాంచె నని - మహాభారతము నందలి వన పర్వము వలన తెలియవచ్చుచున్నది.

ఆళ్వారులచే ప్రస్తుతింపబడిన భగవన్మూర్తులలో - ఇది విశేష ఖ్యాపనీయము.

4. పాతాళ శయనుడు : ఈయనయే సంకర్షణ మూర్తిగా తన నోట ఆవిర్భవించిన ప్రళయాగ్నిచే, లోకములను దహించినాడని విష్ణుపురాణము, సాత్త్వత సంహితయు తెలియజేయుచున్నవి.

ఇక - 31 నుండి 34 వఱకు - అనగా - 1. నర 2. నారాయణ 3. హరి 4. కృష్ణ-అను ఈ నాలుగు మూర్తులు కృత యుగమునకు-జెందిన అవతారములు. నారాయణుడే బలరాముని సూచించుచున్నదని కొందఱి వివేచకుల భావన.

## అవతారావిర్భావ మూలము

శ్రీ పాంచరాత్రాగమానుసారము - వ్యూహములనుండి అవతారములు ఉద్భవించుచున్నట్లు తెలియుచున్నది. అవతారము లన్నియు అనిరుద్ధ వ్యూహమునుండి ఆవిర్భవించినవని, విష్వక్సేన సంహిత వివరించుచున్నది. లక్ష్మీ తంత్రము కూడ ఇట్లే చెప్పుచున్నది. ఇంతకు మున్ను పేర్కొనిన వైభవ రూపములు - నామతః నిర్దేశించి, ఏ యే మూర్తితోపాటుగ లక్ష్మీదేవియు అవతరించెనో - ఆ వివరములు కూడ అచట నిర్దేశింపబడినవి. సాత్త్వత సంహితయందును, అహిర్బుధ్న్య సంహిత యందును, లక్ష్మీ తంత్రము నందును - పైన పేర్కొనబడిన ఏకోనచత్వారింశత్ (39) విభవ రూపము లన్నియు - శ్రీ వైకుంఠమునందలి విశాఖ యూప స్వరూపుడైన భగవానుని అనిరుద్ధ వ్యూహము నుండియే ఆవిర్భవించిన వని - ఆగమ శాస్త్రముల నిరూపణము.

ప్రసిద్ధము లగు - దశావతారములు సైతము - భగవానుని వ్యూహ రూపముల నుండియే ఆవిర్భవించినట్లు - ఆగమ శాస్త్ర ప్రవచనము. మత్స్య - కూర్మ - వరాహ మూర్తులు - అనిరుద్ధ వ్యూహము నుండి ఆవిర్భవించిన వని - పాత్త్వత తంత్రము' అను పాంచరాత్ర శాస్త్ర మనుచున్నది. (3-2-31).

ఆగమ గ్రంథములలో చెప్పబడిన అవతారములు - మనుష్య, తిర్యక్ జాతులకు మాత్రమె పరిమితము గాక, వృక్షాది స్థావర సంతతికి కూడ చెందియున్నవి. దండకారణ్యమునందు గల ఆమ్ర వృక్షము (మామిడి చెట్టు) కూడ - భగవ దవతారములలో చేరినదే యని - విష్వక్సేన సంహిత వివరించుచున్నది. అర్చామూర్తిని, అంతర్యామి మూర్తిని కూడ - ఆగమ శాస్త్రములు అవతారములుగా పరిగణించుచున్నవి.

## అవతార ప్రభేదములు

శ్రీ వైష్ణవ సంప్రదాయములో - అవతార ప్రభేదాది నిరూపణ మున్నది. పైన పేర్కొనబడిన పాంచరాత్రాగమ గ్రంథములందును, పురాణములందును - ఆ గ్రంథములను ఆధారము గావించుకొనియున్న సంప్రదాయ గ్రంథములందును - ఈ అవతార తత్త్వ ప్రభేదముల ప్రస్తావనయు, వివేచనము - కలదు. ఈ వివేచనకు - ఆగమ గ్రంథములే అధిక భాగము ఆధారములై యున్నవి. భగవ దవతారములు - ముఖ్యములు, గౌణములు - అని రెండు విధములుగా నుండును.

" ప్రాదుర్భావో ద్విధా ప్రోక్తో - గౌణ ముఖ్య విశేషతః. "

అను - ఆగమ శాస్త్ర వాక్యమే ఇందులకు ప్రమాణము. "గౌణ" మనగా - ముఖ్యము కానిది, అనగా - అప్రధానమైనది. 'ముఖ్య' మనగా - ప్రధానమైనది, ఉపాసకుని దృష్టినిబట్టి - శ్రేష్ఠమైన దనియు - తాత్పర్యము. గౌణావతారమును ఆవేశావతార మనియు, ముఖ్యావతారమును - సాక్షాద వతార మనియు - వ్యవహరింతురు. వీనిలో - గౌణావతారము అనబడు ఆవేశావతారము - అనునదియు - 'ఆవేశము' యొక్క వైవిధ్యమునుబట్టి - 'స్వరూపావతార' మనియు, 'శక్త్యావేశావతార' మనియు - రెండు విధములుగా నుండును. స్వస్వరూపములో - చేతన శరీరములలో - తన అసాధారణ విగ్రహముతోబాటు - ఆవేశించుట - స్వరూపావేశము. పరశు

రామాది అవతారములు ఈ వర్గమునకు చెందినట్టివే. ఇక - అసాధారణ కృత్యమును నిర్వహింపవలసివచ్చినపుడు - భగవానుడు తన శక్తిని - బ్రహ్మ, పరమ శివుడు, కతత్స్థుడు - మున్నగువారియందు ప్రసరింపజేసి ఆ కృత్యమును నిర్వహింపజేయుట - శక్త్యావేశము. అయినచో - ఈ 'గౌణ' - 'ముఖ్య' అవతారములకు గల తారతమ్య మేమి? అన్నపుడు - పరమాత్మ స్వేచ్ఛగా - మనుష్యత్వమును, పశు పక్ష్యాదిత్వమును, స్థావరాదిత్వమును - పొందినట్లే, గౌణావతారముకూడ తన ఇచ్ఛామాత్రము వలననే ఏర్పడుచున్నదికాని, స్వస్వరూపముచే ఏర్పడినది కాదు. ఈ విషయమును, విష్వక్సేన సంహిత ఇట్లు వివరించుచున్నది :-

" మ దిచ్ఛయా హి గౌణత్వం - మనుష్యత్వ మవేచ్ఛయా
సూకరత్వం చ మత్స్యత్వం శ్రీమ దూర్జిత మేవ వా. "

గౌణావతారములలో - భగవంతునకు - అప్రాకృతము, అసాధారణము అయిన విగ్రహముతోబాటు - స్వదోషావిర్భావము ఉండదు.

" యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా
త త్త దేవావ గచ్ఛత్వం మమ తేజోంశ సంభవమ్. "

ఏ యేని వస్తువులు విశేషము కలిగినవియో, (శ్రీమత్ అనగా-కాంతి ధన ధాన్య సమృద్ధి) కలిగినదో, శుభ కార్యమునందే ఉద్యుక్తమైనదో - అవి యన్నియు - నా తేజస్సుయొక్క అంశము కలిగినవని తెలిసికొనుము' అను గీతా వచనము (11-41). ఇట్టి అనంతములైన గౌణావతారములనే సూచించుచున్నది. ఇక - సాక్షా దవతారము - లేక ముఖ్యావతారములో - దీపమునుండి మఱియొక దీపము ఆవిర్భవించినట్లు ఉండునదియు - ముఖ్య ప్రాదుర్భావములు, ఇవి యన్నియు ముముక్షువులకు ఉపాసింపదగినట్టివే యని విష్వక్సేన సంహిత వివరించుచున్నది :-

" ముఖ్యా ఉపాస్యాః సేనేశ । అనర్హాన్ ఇతరాన్ విదుః "

ఇక ఆవేశావతారములైన బ్రహ్మ, శివుడు, అగ్ని, వ్యాసుడు, ఆత్రేయుడు (=దత్తాత్రేయుడు), కపిలుడు మొదలైనవి – ముముక్షువులకు ఉపాసింపదగినవి కావని – విష్వక్సేన సంహిత చెప్పుచున్నది :–

" బ్రహ్మ రుద్రార్జున వ్యాస సహస్రకర భార్గవాః
కకుస్థాత్రేయ కపిల బుద్ధాఖ్యాయే సహస్రశః
శక్త్యావేశావతారాస్తు। విష్ణో స్త త్కాల విగ్రహాః
అనుపాస్యా ముముక్షూణాల యథేంద్రాగ్ని దేవతాః. "

**పురాణ ప్రమాణములు: –**

" దేవ – మానుష – పశ్వాది సరోపైః బహుభి స్థితః
తత స్సర్వేశ్వరో ఒనన్తో – భూతమూర్తి రమూర్తిమాన్. "

వాస్తవమునకు – 'ఇట్టిది' యని నిర్దేశించుటకు వీలుకాని మూర్తి గల పరమాత్మ – 'దేవతా స్వరూపము, మనుష్య రూపము, పశ్వాది రూపములు – ఈ రీతిగా అనేక విధము లగు మూర్తులను ధరించియున్నాడు' అని – విష్ణు పురాణము (1-12-82) తెలియజేయుచున్నది. ఈ విష్ణు పురాణమునందు – వరాహ, కూర్మ, నృసింహ, రామ, పరశురామ, బలరామ, కృష్ణావతారములే గాక, కల్కి, మాయామోహావతారములుకూడ ప్రస్తావింపబడినవి. దీనిలోని మాయామోహావతారము, బుధ అర్హన్ (జైన) మూర్తులు – వేద బాహ్యాములుగా నిరూపింపబడినవి. 'నగ్న' అని వ్యవహరించుటచే, జినిమూర్తిని, 'రక్తాంబర' అని వ్యవహరించుటచే బుధమూర్తిని ఇట్లు వర్ణించినట్లు – వ్యాఖ్యానకారులు వివరించి యున్నారు. ఇవియే గాక, ఏడు (7) మన్వంతర మూర్తులలో – వామనావతార వర్ణన మున్నది.

## మన్వంతరావతారములు

1. స్వాయంభువ మన్వంతరములలో ఆకూతి యందు – కుజ్ఞమూర్తి గాను, 2. స్వారోచిహ మన్వంతరములో – తుషికయందు రజితమూర్తిగను,

3. ఔత్తమ మన్వన్తరములో - సత్య యందు 'సత్య'మూర్తిగను, 4. తామసి మన్వంతరములో హర్యయందు హరిమూర్తిగను, 5. రైవత మన్వంతరములో - సంభూతి యందు - 'సంభూతి' మూర్తిగను, 6. చాక్షుష మన్వంతములో - వికుంఠ యంచు - 'వైకుంఠ' మూర్తిగను, 7. వైవస్వత మన్వంతరములో - కాశ్యపుని వలన అదితి యందు - 'వామన' మూర్తిగను - భగవాను డవతరించె నని విష్ణుపురాణము వివరించుచున్నది. అయినచో - ఈ యవతార విభాగ విషయము - విష్ణుపురాణానంతర మవు దెంచిన భాగవత మహా పురాణములో - అష్టమ స్కంధము నందు - మఱి కొంత స్పష్టముగా కానవచ్చును. (8-13-17-35).

ఇక రానున్న 8. సౌవర్ణి మన్వంతరములో - దేవగుమ్యుని వలన సరస్వతి యందు - సార్వభౌముడుగా పరమాత్మ ఆవిర్భవించును. 9. అటు పిమ్మట - దక్షసావర్ణి మన్వంతరములో - 'విషూచి' యందు - భగ వానుడు - విష్వక్సేనుడుగా అవతరించును. 11. ధర్మసావర్ణి మన్వంతర ములో - 'వైభృతి' యందు - ఆర్యక పుత్రుడుగా ధర్మసేతు నామముతో భగవాను డావిర్భవించును. 12. రుద్రసావర్ణి మన్వంతరములో 'స్వధాము' డను పేరుతో సూనృతికి సుతుడై, శ్రీహరి ఆవిర్భవించును. 14. ఇక చివరి దగు ఇంద్రసావర్ణి మన్వంతరములో - 'బృహద్భానువు' అను పేర, సౌత్రాయణ తనయుడుగా భగవానుడు స్వాంశతో ఆవిర్భవించును. ఇట్లు 8 - వ మన్వంతరమునుండి, 14 వ - మన్వంతరము వఱకుగల మన్వంత రావతారముల వివరణమును - శ్రీమద్భాగవత మహా పురాణమునందు పరి శీలింపవచ్చును.

## యుగావతారములు

యుగావతారముల ప్రస్తావన - విష్ణు పురాణము నందును, భాగవత పురాణము నందును - కానవచ్చును.

" జ్ఞానం చానుయుగం బ్రూతే - హరిః సిద్ధస్వరూపధృక్
ఋషిరూప ధరః కర్మ - యోగం యోగేశ రూప ధృక్. "
- (శ్రీమద్భాగవతము ; 8-14-8)

శ్రీహరి - తాను ప్రతి యుగమందును సిద్ధ స్వరూపమును ధరించి, జ్ఞానమును ప్రతిబోధించును. ఋషి రూపమునుధరించి, కర్మను, యోగేశ్వర రూపమును ధరించి యోగమును బోధించు'నని భాగవత మహా పురాణ ప్రవచనము. ఇది యిట్లుండ - ప్రతి యుగమందును పరమాత్మ ఏ కృత్యమును నిర్వహించునదియు - వివరించుచున్నది విష్ణు పురాణము. కృతయుగమున కపిలా రూపమును ధరించి, జ్ఞానమును ప్రబోధించును. త్రేతాయుగమున - చక్రవర్తి స్వరూపమును ధరించి, దుష్టనిగ్రహముగావించును. ఇక ద్వాపరయుగమున - వ్యాస రూపధారియై, వేదములను సముద్ధరించు నిమిత్తమై, పురాణేతిహాసములు - మున్నగు వానిని రచించును. ఇక కలియుగ మందు - 'కల్కి' అవతారమును ధరించి, దుర్మార్గులను దునుమాడి, సన్మార్గులను సంరక్షించును. (వి.పు. : 3-3- 55 59). ఇదియేగాక, శుక్ల - రక్తాది వర్ణములతో - కృత త్రేతాది నాల్గు యుగము లందును భగవానుడు - నాల్గు మూర్తులను ధరించు నని - పురాణములు బోధించుచున్నవి.

## పురుషావతార నిరూపణము

" పూరుషాశ్చ గుణాత్మానః లీలాత్మాన శ్చ తే త్రిధా. "

(1) పురుషాదవతారము (2) గుణావతారము (3) లీలావతారము - అని - అవతారములు మూడు విధములుగా నుండును. ఈ మూడింటిలో మొదటిదైన పురుషావతారమును గుఱించిన సూచన - విష్ణు పురాణములో ఇట్లున్నది :-

" తస్మై నమోఽనుగుణభుక్ బహుధైవ ఏవ
శుద్ధేప్యశుద్ధ ఇవ భాతి హి యో౽రిభేదైః
జ్ఞానానితః సకల తత్త్వ విభూతి కర్తా
తస్మై నమోఽస్తు పురుషాయ సదాఽవ్యయాయ. "
— (విష్ణు పురాణము : 6-8-6)

ఇట్లే - విష్ణుపురాణ మందలి ప్రథమాంశలో -

"పరస్య బ్రాహ్మణో రూపం - పురుషః ప్రథమః ద్విజ!" (1-8-45)

ఇత్యాదిగా - పురుష మూర్తియే అద్య మూర్తిగా నిర్దేశింపబడినది.

ఈ విషయము విష్ణు పురాణములో - ఇట్లు ధృవీకరింపబడుచున్నది :-

" విష్ణోః స్వరూపాత్ పరతో - ద్వే రూపే ప్రధానం పురుష శ్చ విప్ర! "

ఈ పురుషావతారమే అవ్యక్తమందు ప్రవేశించి, మహత్తత్త్వమునుండి ఆరంభించి, ఆ యుత్పత్తికి నిమిత్త మగుచున్నది. ఈ యంశమును భాగవత మహాపురాణ వాక్యము-

" ఆద్యోఽవతారః పురుషః పరస్య "

అని నిర్దేశించుచున్నది. శ్రీ పాంచరాత్రాగమమునకు జెందిన సాత్త్వత తంత్రము-ఈ పురుషావతారమునకు త్రైవిధ్యమును చెప్పుచున్నది :-

" విష్ణో స్తు త్రీణి రూపాణి - పురుషాఖ్యా వ్యథో విదుః
ఏకం తు మహత స్స్రష్టృ - ద్వితీయ స్త్వణ్డ సంస్థితమ్
తృతీయం సర్వ భూత స్థం - తాని జ్ఞాత్వా విముచ్యతే. "

ఇట్లు నిర్దేశింపబడిన మూడు పురుషావతారములలో - మొదటిది - స్రష్టృ స్వరూపము. ఇదియే కారణార్ణవశాయియైన శ్రీ మహావిష్ణు రూపము. రెండవది - సమష్టి జీవులకు - లేక - హిరణ్య గర్భునకు అంతర్యామియైన రూపము. మూడవది - వ్యష్టిజీవాంతర్యామియైన విష్ణుమూర్తి. ఇచట -

స్రష్టృమూర్తియైన ఆద్యపురుషావతరమును గుఱించి భాగవతము నందలి ఏకాదశ స్కంధములో ఇట్లు చెప్పబడినది :-

" భూతై ర్యదా పంచభి రాత్మ సృష్టైః
పురం విరాజం విరచయ్య తత్ర
స్వాంశేన విష్టః పురుషాభిధాన
మవాప నారాయణ ఆదిదేవః. "

- (శ్రీమద్భాగవతము : 11-4-31)

ఇక సమష్టి జీవాంతర్యామియు, వ్యష్టిజీవాంతర్యామియు నైన పురుష మూర్తులను గుఱించి - బ్రహ్మసంహిత విశదీకరించియున్నది. మహాభారతము నందలి మోక్షధర్మ పర్వములో - గర్భోదకశాయియు - అనిరుద్ధ సంజ్ఞకుడును అయిన పరమాత్మయే - తన నాభికమలభవుడైన చతుర్ముఖ బ్రహ్మకు - హయగ్రీవమూర్తితో మధు కైటభ హననము గావించి, వేదములను సంరక్షించి యిచ్చెను. ఈయనయే హిరణ్య గర్భాంతర్యామి రూపుడైన పురుషావతారుడు. ఈ విషయము మహాభారతము నందలి మోక్ష ధర్మ పర్వములో - నారాయణీయోపాఖ్యానమునందు - నాల్గవ అధ్యాయమున స్పష్టముగా నిరూపింపబడినది. ఇక మూడవ పురుషావతారము - వ్యష్టిజీవాంతర్యామిగా - భాగవత మహాపురాణములో - ద్వితీయ స్కంధము నందలి రెండవ అధ్యాయము నందు - ఇట్లు వివరింపబడినది:-

" కేచిత్ స్వదేహా న్త ర్హృదయావకాశే
ప్రాదేశ మాత్రం పురుషం వస న్తమ్
చతు ర్భుజం కుంజ రథాంగ శంఖ
గదాధరం ధారణయా స్మర న్తి. "

## గుణావతారములు

" జుష్ట రజోగుణం తత్ర స్వయం విశ్వేశ్వరో నాదః
బ్రహ్మ భూత్వా స్స జనత్తో - విసృష్టౌ సంప్రవ ర్తతే

సృష్ట ముపాత్యయుగం - యావత్కల్ప వికల్పనా
సత్త్వభృత్ భగవాన్ విష్ణుః - అప్రమేయ పరాక్రమః
తమోద్రికీ చ కల్పాన్తే - రుద్రరూప జనార్దనః
మైత్రేయాఖిల భూతాని - భక్షయిష్యతి భీకరః."

- (విష్ణు పురాణము 1-3-61,62,63)

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు గుణావతారులుగా చెప్పబడుచున్నారు. శ్రీహరి స్వయముగ రజోగుణమును ధరించి, జగత్సృష్టిని గావించును. సత్త్వగుణ సంపన్నుడై, విష్ణువుగా రక్షణ భారము వహించును. తమోగుణమును తనలో అవహించుకొని – రుద్ర రూపమును ధరించి, సమస్త లోకములను లయము గావించును. ఈ మూడు రూపములును – సృష్టి స్థితి లయములకు అకరములు గావున, సత్త్వ రజ స్తమోగుణముల నాశ్రయించిన మూర్తులైనందున – వీనిని గుణావతారము లని వ్యవహరింతు రని భాగవత మహా పురాణము మనకు బోధించుచున్నది.

## లీలావతారములు

శ్రీ మద్భాగవతమందలి ప్రథమ స్కంధమున – తృతీయాధ్యాయములో – ఈ లీలావతార ప్రసక్తి కలదు. ఈ యంశ మిట్లు నిరూపిత మగుచున్నది :–

" భావకత్వేష సత్త్వేన – లోకాన్ వై లోకభావనః
లీలావతారానురతో - దేవ తిర్య జ్నరాదిషు."

ఈ లీలావతారములను గురించిన విషయము, ప్రస్తావించినపిమ్మట. ఈ లీలావతారములు ఇరువది రెండు (22) కలవని వివరింపబడినది.

1) శ్రీమహావిష్ణువు మొట్టమొదట – కుమార మూర్తిగా అవతరించి, నిశ్చలమైన బ్రహ్మచర్యమును అప్రతిహతముగా నిర్వహించెను.

2) రెండవ అవతారముగా - సూకర మూర్తిని పరిగ్రహించి, పృథివీ మండలమును సముద్ధరించెను.

3) మూడవ అవతారముగా — దేవర్షి అయిన నారదుడై, శ్రీ పాంచ రాత్ర శాస్త్రమును లోకమునకు ప్రబోధించెను. ఈ శాస్త్ర - మిపుడు 'నారద పాంచశాస్త్ర' మనుపేర సుప్రసిద్ధమై యున్నది.

4) నాల్గవ మూర్తిగా - నర నారాయణ ఋషిత్వమును పొంది, తపస్సు నాచరించెను.

5) కపిలు డను అయిదవ మూర్తిని ధరించి, ఆసురికి సాంఖ్య తత్త్వ మును ఉపదేశించెను.

6) ఆఱవ మూర్తిగా - దత్తాత్రేయ స్వరూపమును ధరించి, అలర్కు నకు ఆన్వీక్షిక విద్యను బోధించెను.

7) ఆకూతి యందు 'యజ్ఞ' మూర్తిగా - ఏడవ అవతారమునూ -

8) ఋషభ దేవునిగా ఎనిమిదవ అవతారమునూ -

9) పృథు చక్రవర్తిగా - తొమ్మిదవ అవతారమును - ధరించెను.

10) ఇక - పదవ అవతారము - మత్స్య మూర్తి.

11) పదునొకండవది - కూర్మావతారము.

12) పండ్రెండవది - ధన్వంతరి అవతారము

13) పదమూడవది - మోహినీ అవతారమ.

14) పదునాల్గవది - నృసింహావతారము.

15) పదునైదవది - వామనావతారము.

16) పదునాఱవది - పరశురామావతారము.

17) పదునేడవది - వేదవ్యాసావతారము.

18) పదునెనిమిదవది - రామావతారము.

19) పందొమ్మిదవది - బలరామావతారము.

20) ఇరువదవది - శ్రీకృష్ణావతారము.

21) ఇరువది యొకటవది - కల్కి అవతారము.

విష్ణు - భాగవత పురాణములందే గాన, మఱి కొన్ని పురాణము లందును - అవతార నిర్దేశ మున్నది. మత్స్యపురాణ మందును (114), పద్మ పురాణము నందును (5-13-182, 183) అవతార ప్రసక్తి కాన వచ్చును. గరుడ పురాణములో (1-202) - 19 అవతారములు వర్ణింప బడినవి. ఈ మూర్తులలో - ఒక్క శేషమూర్తి తప్ప, మిగిలినవి భాగవత ద్వితీయ స్కంధమందును, ఏకాదశ స్కంధమందును ఉన్నట్టివే. మార్కం డేయ పురాణములో - శ్రీమన్నారాయణుని సగుణ నిర్గుణ రూపములు రెండును వివరింపబడినవి. మొదట - వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న. అనిరుద్ధ రూపములు నాలుగు (4) నిర్దేశింపబడినవి. వీనిలో మూడవ మూర్తి యగు ప్రద్యుమ్నుని అవతారములుగా - వరాహ, నృసింహ, వామనావ తారములతోపాటు-అనేకములైన అవతారములు నిర్దేశింపబడినవి. 108 వ- అధ్యాయములో - చతుర్వ్యూహములలో మూడవది యగు ప్రద్యుమ్న వ్యూహము నుండి ప్రధానావతారములన్నియు ఆవిర్భవించినట్లుచెప్పబడినది.

"హంస కూర్మ శ్చ మత్స్యశ్చ - ప్రాదుర్భావా ద్విజో త్తమ !
వరాహో నారసింహ శ్చ - వామనో రామ ఏవ చ
రామో దాశరథి శ్చైవ - సాత్త్వతః కల్కి రేవ చ."

అని - మహాభారతమునందలి ఆది పర్వములో - 7-18 - వ అధ్యాయము నందు - భగవదవతారములు వర్ణింపబడినవి. ఇట్లే - నారసింహ, బృహ న్నారదీయ, విష్ణుధర్మోత్తర పురాయణము లందును - ఇంచు మించుగా-ఈ యవతారములే వర్ణింపబడినవి.

# దశావతార వివేచనము

" ప్రాదుర్భావ సహస్రాణి – వ్యతీతాని న సంశయః
భూయ శ్చైవ భవిష్యన్తే – త్యేవమాహ పితామహః"

ఇయ్యది – హరివంశములోని మాట (1–41–11). శ్రీ మహావిష్ణువు ఇంతకు మున్ను – అనేక అవతారములు పరిచయ ముండె ననియు, ఇక మున్ముందు – మఱి కొన్ని అవతారములు ధరింపగలవనియు – దీని తాత్పర్యము. దీనినిబట్టి – భగవంతుని అవతారములు అనంతము లని తెలియుచున్నది. ఈ యంశమును శ్రీమద్భాగవత మహా పురాణము కూడ – ఇట్లు ధృవీకరించుచున్నది.

"అవతారా హ్యసంఖ్యేయాః – హరేః సత్త్వనిధే ర్ద్విజాః !
యథా విదాసినః కుల్యాః – సరసస్స్యుః సహస్రశః."

— (భాగవతము : 1-3-26)

ఈ భాగవత వాక్యములో – భగవ దవతారములు అసంఖ్యాకము లని చెప్పబడినను, శ్రీమన్నారాయణుని దశావతారములు మాత్రము మిగుల ప్రసిద్ధి వహించి, ఆ భగవంతుని అవతార తత్త్వమునకు దర్పణములుగా ప్రసిద్ధి గాంచియున్నవి. ఈ అవతార పరిగణనములో – రెండు సంప్రదాయము లున్నవి. ఏట్లనగా –

" మత్స్యః కూర్మ వరాహ శ్చ – నారసింహ శ్చ వామనః
రామో రామ శ్చ రామశ్చ – బుద్ధః కల్కి రేవ చ."

ఈ శ్లోకము బుద్ధునకు అవతార త్వమును కల్పించి యుండగా – మఱి యొక శ్లోకము – బుద్ధుని స్థానములో బలరాముని జేర్చి –

"రామో రామ శ్చ రామ శ్చ – కృష్ణః కల్కి రేవ చ. "

పరశురామ – శ్రీరామ – బలరామ – కృష్ణ – కల్కి అవతారములను దశావతారములుగా పరిగణించుచున్నది. ఇది యిట్లుండ – "కృష్ణ స్తు భగ

వాన్ స్వయమ్" అను సూక్తిని బట్టి, కృష్ణావతారము పరిపూర్ణావతార మనియు, అత్యంతము మహత్తరమైన దనియు - భాగవత మహాపురాణము నిష్కర్షించుచున్నది.

శ్రీకృష్ణభగవానునిఅవతారము..సర్వావతారములకు మూలమైన తత్త్వ మని భావించియు - బలరామ బుద్ధులలో అవతార దశక పరిగణనము చేసిన వారిలో - వైష్ణవులను కొందఱున్నారు. కొన్ని పురాణములలో బుద్ధుడు ఒక భగవ దవతారముగా వర్ణింపబడియున్నాడు. అయినచో-ఈ బుద్ధుడు చరిత్ర ప్రసిద్ధి గాంచిన బుద్ధుడు కాదనియు, వేరొక యుగమునకు జెందిన వాడనియు తలంచువారును కొందఱు కలరు. బుద్ధుడును ఒక అవతారమూర్తిగా - కొన్ని పురాణములలో నిర్దేశింపబడినను, మత్స్య కూర్మా ద్యవతారముల కొసంగునంతటి ప్రాముఖ్యమును, మాన్యతను - బుద్ధున కొసంగుటలేదు. కేవలము తత్త్వమును స్థగితము గావించి, అవైదిక వాదమును ప్రచారము చేయుట మూలమున దైత్యాదులను మోహింప జేయుటకు మాత్రమే ఈ యవతార మని నిర్వచింపబడినది.

## ఉపసంహారము

ఇంతవఱకు - ఈ రచనలో - భగవంతుని అవతార తత్త్వమును గూర్చియు, అవతార భేదములను గూర్చియు, అవతార ప్రయోజనమును గుఱించియు సంగ్రహముగా వివరింపబడినది. ఇక ముస్ముందు - ఆ భగ వానునకు జెందిన ప్రసిద్ధము లగు మత్స్య-కూర్మ-వరాహ - నారసింహ - వామన - పరశురామ - శ్రీరామ - బలరామ - శ్రీకృష్ణ - కల్కి - అన

బడు దశావతారముల వైశిష్ట్యమును, ఆ యవతారములకు సంబంధించిన లీలా విశేషములను సైతము విశదముగా గ్రహింతము గావుత !

" యం బ్రహ్మ వరుణేంద్ర రుద్ర మరుతః స్తున్వన్తి దివ్యైః స్తవైః
వేదైః సాంగ పదక్రమోపనిషదైః - గాయన్తి యం సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసా - పశ్యన్తి యం యోగినః
యస్యాన్తం న విదు స్సురాసుర గణాః - దేవాయ తస్మై నమః. "

— (శ్రీ మద్భాగవతము : 2 - 13 - 1)



# మహా భారతము - వైష్ణవ తత్త్వము

'ఉభయ వేదాంత శిరోమణి'

శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, ఎం. ఏ.



## వ్యాస స్తుతి

" సత్యజ్ఞాయ కలాపేన – మహతా భారతేన చ
ఉపబృంహిత వేద్యాయ – నమో వ్యాసాయ విష్ణవే. "

## అ వ తా రి క

" వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః" అను గీతాచార్యుని వచనము చొప్పున - వేదము లన్నియు భగవ త్స్వరూపము లగు వేదములచే ప్రతి పాదింపబడిన అర్థములను ఉదాహరణ ప్రత్యుదాహరణాదికములతో విశదీక రింపబడుటకై ఇతిహాస - పురాణములు ఏర్పడినవి.

" ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ ."

అను వాక్యము - ఈ యర్థమునే బోధించుచున్నది. శ్రీమద్రామాయణ - మహాభారతములు ఇతిహాస శ్రేష్ఠములుగ పరిగణింపబడుచున్నవి. ఇంత మాత్రమే కాక -

" వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా ॥ "

'భారతః పంచమో వేదః"ఇత్యాది ప్రమాణములను బట్టి,రామాయణ- మహాభారతములు రెండును వేదార్థోపబృంహితములే గాక, సాక్షాత్తు వేద ములే అనియు తెలియుచున్నది. భగవద్వైభవమును దర్శించుటకు ఇవి రెండును మనకు రెండు నేత్రములు.

రామాయణ - మహాభారతములను గురించి -

## లోకాచార్యుల నిర్వచనము

'ఈ యితిహాస శ్రేష్ఠములు రెండును ప్రతిపాదించు ప్రధాన విషయ మేమి ?' అను ప్రశ్నకు శ్రీ పిళ్ళై లోకాచార్యులవారు శ్రీవచనభూషణము నందు -

" ఇతిహాస శ్రేష్ఠమాన - శ్రీ రామాయణత్తాల్ శిఱై యిరున్దవళ్ ఏత్తం శొల్లి గిరదు. మహాభారతత్తాల్ తూతుపోనవన్ ఏత్తం శొల్లు గిరదు. " (1-5.)

ఇతిహాస శ్రేష్ఠమైన రామాయణమున - రావణుని చెరలో నుండిన సీతాదేవి మాహాత్మ్యము, మహాభారతమున-పాండవ దూతయైన శ్రీకృష్ణుని మాహాత్మ్యము - చెప్పబడినవి - అనియు,

" ఇవై ఇరణ్డాలుం పురుషాకార వైభవముం, ఉపాయ వైభవముం శొల్లుత్తాయిత్తు. "

ఈ రెండు ప్రబంధములచే పురుషకార వైభవము, ఉపాయ వైభవము - నిరూపింపబడినవి' - అనియు సమాధానము నొసంగియున్నారు.

## వాల్మీకి - సూత మహర్షుల తాత్పర్యము

శ్రీమద్రామాయణము సీతాదేవి చరిత్రప్రతిపాదితము - అను విషయమును వాల్మీకమహర్షి -

" కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్. "

అనియు 'మహాభారతము శ్రీ కృష్ణ మాహాత్మ్య ప్రతిపాదకము' అను విషయమును మహాభారత ప్రారంభమున సూతుడు -

" శృణుధ్వం మునయ స్సర్వే నారాయణ కథా మిమామ్
వ్యాస ప్రసాదా ద్వక్ష్యామి .... .... "
అనియు - స్పష్టముగ తెలిపియున్నారు.

## లక్ష్మీ పురుషకారము

భగవ త్సమాశ్రయణ సమయమున - మనకు లక్ష్మీ పురుషకారము అత్యంతముఆవశ్యకము. ఆమె-దేవదేవ దివ్య మహిషి. నిగ్రహ మెరుగని అనుగ్రహమయి. రావణునిచే చెరలో నుంచబడిన దేవతా స్త్రీలనుచెరనుండి విడిపించుటకై, లక్ష్మీదేవి సీతాదేవిగా అవతరించెను. ఆ చెరలో తాను ప్రవేశించి, వారి యందరి చెరను విడిపించెను. ముల్లును ముల్లుతోనే తీయవలయును గదా ! ఈ విషయమును -

" సుందరీ రఘునాధస్య - సురస్త్రీ దుఃఖ శాన్తయే
దశాననస్య భవనే - దశమాసా నువాసహ."

అను శ్లోకము స్పష్టము చేయుచున్నది. ఇది సీతాదేవి చరిత్రలో మహోజ్జ్వల ఘట్టము. కావుననే నమ్మాళ్వారులును -

" తళిళ్ శిరత్తాళ్ కురై విల్లాత్తనిచ్చి రైయిల్
కిళమొళియాళ్ కారణక్కి- శిరరక్కన్నగ రెరిత్త. " (4 - 8 - 5)

ఈ అరవ పాశురమునకు - ఆంధ్ర పద్యానువాదము -

" మెరుగు నెమ్మేని భాసింప - జెర వసించు
భూమి సుత కయి, రావణు పురము లెల్ల
జీల్చి చెండాడినట్టి మా శ్రీధరుండు
— — "

— (శ్రీముఖ సూక్తి - పుట సంఖ్య 194)

చెరసాలలో ఉండి, మహోజ్జ్వలమైన కీర్తి నార్జించిన కీరవాణి యగు సీతాదేవిని విడిపించుటకై, రావణుని లంకా నగరమును దహించిన' అని - ప్రస్తుతించినారు. తప్పు చేసి, చెరలో నుండుట దోషము. కాని, ఆశ్రితరక్షణార్థము చెరలో నుండుట - గుణమే యగును. ఇట్టి పిరాట్టి - భగవత్సన్నిధిలో చేయు పురుషకారము అవశ్య ఫలప్రదము - అను విషయమును శ్రీరామాయణము పలు తావులలో వివరించుటచే, అది ఉపాయ వైభవ ప్రతిపాదక మగుచున్నది.

## భగవత్తత్త్వము

ఇక మహాభారతము - దేవాధిదేవుడైన శ్రీకృష్ణుని యొక్క 'ఆశ్రిత పారతంత్ర్యము' అను గుణమును ప్రస్తుతించుచున్నది. భగవంతుని కల్యాణ గుణములను - ఆశ్రయణ సౌకర్యాపాదకము లనియు, ఆశ్రిత కార్యాపాదకము లనియు - రెండు వర్గములుగా పెద్దలు విభజింతురు. వీనిలో - దయా సౌలభ్య సౌశీల్యాది గుణములు - ఆశ్రయణ సౌకర్యాపాదకములు కాగా, సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాది గుణములు ఆశ్రిత కార్యసాధకములు. ఈ రెండు వర్గములకు జెందిన గుణములను కలిగియుండుటచేతనే, భగవంతుడు మనచే నిస్సంకోచముగ ఆశ్రయింపబడుచున్నాడు. మన అభీష్టములను నెరవేర్చగలుగుచున్నాడు. ఇట్టి రెండు వర్గముల గుణములు లేనివాడు - అట్టి తత్త్వము ఉన్నను, లేకున్నను ఒక్కటే.

ఆశ్రిత పారతంత్ర్యము - అనబడు ఆశ్రయణ సౌకర్యాపాదక గుణము శ్రీకృష్ణావతారమున - అడుగడుగున - మనకు గోచరించును. 'పాండవ దూత' - 'పార్థసారథి' ఇత్యాది నామములు ఈ విషయమునే స్పష్టమొనర్చుచున్నవి. ఇట్టి శ్రీకృష్ణుని మహిమను ప్రతిపాదించునది - మహాభారతము. 'మహా భారత' మనినంతనే - 'కేవలము కౌరవ పాండవుల యుద్ధ కథ' అని అనుకొనవచ్చును. కాని, అంతమాత్రము కాదనుటకై -

" శృణుధ్వం మునయ స్సర్వే నారాయణ కథా మిమామ్. "
అనియు -

" భగవాన్, వాసుదేవ శ్చ కీర్త్యతేఽత్ర సనాతనః. "
అనియు - మహా భారత ప్రతిపాద్య విషయము ప్రారంభముననే ప్రస్తావింప బడినది.

" కృష్ణాశ్రయాః - కృష్ణ బలాః - కృష్ణనాథా శ్చ పాండవాః. "
అనునట్లు - పాండవులు శ్రీకృష్ణుని అవ్యాజ భక్తితో సేవించి తరించినారు.

" యతో ధర్మ స్తతో జయః "

'ధర్మ మెచట నుండునో - జయ మచట నుండును' అని శాస్త్ర వచనము. అనగా -

" రామో విగ్రహవాన్ ధర్మః ." "కృష్ణ స్తు భగవాన్ స్వయమ్. "

అని - రామాయణ - మహా భారతముల సిద్ధాంతము.

మానవుడు - ధర్మ అర్థ కామ మోక్షము లనెడు చతుర్విధ పురుషార్థ ములను సాధించుటకై ప్రయత్నించుచుండును. వీనిని సాధించుటకై - కర్మ జ్ఞాన భక్తి యోగములను మిక్కిలి శ్రద్ధా భక్తులతో అనుష్ఠించుచుండును. ఈ సందర్భమున - 'నేను ఈ కర్మయోగాదుల ద్వారా - నా అభిమత మగు పురుషార్థమును సాధించుకొనగలను'-అను భావన ఏర్పడును. ఇట్టి భావన - అహంకార మమకార సంయుతము. ఇది - సాత్త్వికమునకు తగదు. మరియు - మనము చేయు కర్మయోగాదులు స్వయముగ ఫలితములు కాజాలవు. అవి - అచేతనములు గదా ! మనము చేయు కర్మయోగాదులచే సంతుష్టుడైన భగవంతుడే ఫలప్రదాత యని, బాదరాయణ మహర్షి - బ్రహ్మ సూత్రములయందు - "ఫలమత ఉపపత్తేః" ఇత్యాది ఫలాధికరణ సూత్రము లచే విశదీకరించినారు. మనముచేయు పనులలోని మంచి చెడులను గుర్తించి,

వానికి తగిన విధముగా ఫలముల నీయుగలవాడు - సర్వాంతర్యామి, సర్వనియామకుడు, సర్వసముడు అయిన భగవానుడు కాక - మరెవ్వరు కాగలరు ? కావున, పురుషార్థ సిద్ధికి మనము అచేతనములైన కర్మాదులను కాక, ఫల ప్రదాత యగు ఆ పరమాత్మనే ఉపాస్యముగ ఆశ్రయించుట యుక్తము.

## దేవతాంతర భజన నిషేధము

పరావర తత్త్వ తారతమ్యమును ఎఱుంగని వారు కొందఱు - ఇతర దేవతలను తమ తమ వాంఛా ఫలసిద్ధి నిమిత్తము ఆరాధింతురు. ఎవరు ఏ దేవతను ఆరాధించినను - ఫలము నొసంగునది - శ్రీమన్నారాయణుడేకాని, ఇతర దేవతలు కారు, కాజాలరు. ఈ యంశమును నిరూపించుటకు అనేకములైన ప్రమాణము లున్నవి. కాని, ఇట కొన్ని ప్రమాణములను మాత్రము స్మరింతము.

" ఆకాశా త్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి.''

ఆకాశము నుండి క్రింద పడిన జల మంతయు ఎట్లు సముద్రమున గలసిపోవునో - అట్లే, ఏ దేవునకు నమస్కరించినను - ఆ నమస్కారము శ్రీమన్నారాయణునకే చెందును' అని - అనుదినము మనము అనుసంధించు చునే యున్నాము గదా ! అదియును గాక -

" యే స్యన్యదేవతా భక్తాః - యజన్తే శ్రద్ధయాన్వితాః
తేఽపి మా మేవ కౌన్తేయ ! యజ న్త్యవిధి పూర్వకమ్. '

— ( భగవద్గీత : 9 - 23)

ఇతర దేవతలయందు ఎవరుభక్తి కలిగి, శ్రద్ధతో పూజించెదరో-వారు కూడ, నన్నే పూజించుచున్నారు. అయినను - అది విధి పూర్వకము కాదు (అనగా - వేదాంత విధి తాత్పర్యమును వా రెఱుంగలే దని భావము.)

" అహం హి సర్వ యజ్ఞానాం - భోక్తా చ ప్రభు రేవ చ
న తు మా మభిజానన్తి - తత్త్వేనాఽతశ్చ్యవన్తితే "
— (భగవద్గీత : 9 - 24)

యజ్ఞము లన్నింటికి - ఆరాధ్యుడను, ఫల దాతను నేనే. (కామ్య కర్మ నిష్ఠులు) నిజముగ - నన్నెఱుగరు. కనుకనే, వారికి భ్రంశ మగును. (పడి పోదురు. అనగా - పున ర్జన్మమునకు రాగలరని తాత్పర్యము.)

ఇత్యాది భగవద్గీతా సూక్తులను బట్టి, దేవతాంతర భజనము కూడ దనియు, విష్ణుభగవానుడు ఒక్కడే ఆరాధింపదగినవాడనియు, ఆ భగవానుడే - తన యాశ్రితుల యోగ క్షేమములను చూచుకొను భారము వహింపగలడనియు - స్పష్ట మగుచున్నది కదా! ఈ యంశమును - శంకర, రామానుజ, మధ్వాచార్యు లనబడు త్రిమతాచార్యులును - ఏకగ్రీవముగ అంగీకరించుచు - సాత్త్వతులకు దేవతాంతర భజనము తగ దని సిద్ధాంతీకరించియున్నారు. ఈ సిద్ధాంతములను - వారి వారి గీతా భాష్యములలో - సావధానముగ - సహృదయముతో - సమాలోకించి, గ్రహింపవచ్చును.

## పరతత్త్వ నిర్ణయము

" వేదే రామాయణే పుణ్యే - భారతే భరతర్షభ !
ఆదౌ మధ్యే తథాఽన్తే చ విష్ణు స్సర్వత్ర గీయతే "

ఇత్యాది శ్లోకములు, వేదములు, రామాయణము, మహాభారతము - ఇవి యన్నియు - విష్ణు వైభవ ప్రతిపాదకములు-అని ఘోషించుచున్నవి.

మహాభారత రచనోపక్రమమున - నారాయణ కథను చెప్పెద నని వ్యాస భగవానుడు ప్రారంభించి, సమగ్రముగ చెప్పజాలక, అందులకు చింతిల్లుచు - హరివంశ కథను చెప్ప నారంభించి -

" అస త్కీర్తన కాంతార పరివర్తన పాంసులామ్
వాచం శౌరి కథాలాప గంగ యైవ పునీమహి. "

కౌరవ పాండవుల యుద్ధాది వర్ణనములచే అపరిశుద్ధమైన నా వాక్కును - హరికథా ప్రవచన మనెడి గంగాప్రవాహముచే పరిశుద్ధము గావించుకొందును' అని పలికినాడు. దీనిని బట్టియు - మహాభారతము హరి కథా ప్రధానము - అని స్పష్టము కాగలదు.

ప్రపన్న జన కూటస్థు లగు నమ్మాళ్వారులు - మహాభారతము విష్ణు వైభవ ప్రతిపాదక మనుటకు - ఒక చక్కని దృష్టాంతమును చూపినారు :-

" తీర్తనుల గళన్ద శేవడిమేల్ పూన్దామమ్
శేర్తియవై యే ! శిక న్ముడిమేత్ తానీకండు
పార్తన్ తెళిన్దొళిన్వ పైన్తుళాయాన్ పెరుమై
పేర్తు మొరువరాల్ పేశక్కిడన్దతే. "

ఈ అరవ పాశురమునకు ఆంధ్ర పద్యానువాద మిది :-

" పాండవులకును - కౌరవ ప్రభువునకును
జరుగు ననిలోన నొకనాడు సవ్యసాచి
పాశుపతము పున స్స్మృతి బడయదలచి
పుండరీకాక్షు పదపద్మ పూజ సలిపి
నిద్రలో స్వప్నమున - కాలరుద్రుకడకు
బోయి యా పుష్పముల రుద్రు మూర్ధ మందు
గనుట - కృష్ణపరత్వంబు గాంచగలిగె. "

— (శ్రీముఖ సూక్తి - పుట 104)

తాత్పర్యమిది :-

ముల్లోకములను కొలచిన భగవంతుని పాదార విందముల మీద - తా నుంచిన ఆ పుష్పములు - ఆ రాత్రి - స్వప్నమున - పరమ శివుని శిర

మున నుండుటను గాంచి, పరతత్త్వము శ్రీమన్నారాయణుడే, అని నిర్ణయించుకొనెను. అట్టి ఆ భగవానిని కీర్తించుట ఎవరికి శక్యము? ఈ వృత్తాంతము భారత యుద్ధ సందర్భమున జరిగినది. దీనిని తెలుపు శ్లోక మిది :-

" పార్థో విజేతా మధుసూదనస్య
పాదార విందార్పిత చిత్ర పుష్పమ్
దదర్శ గంగాధర మౌళి మధ్యే
బభూవ వీరః కృత నిశ్చయార్థః. "

అని - వ్యాఖ్యలో ఉదహరింపబడినది. విష్ణు పాదోద్భవమైన గంగను శిరమును దాల్చిన పరమ శివుడు - విష్ణుపాదములందు సమర్పింపబడిన పుష్పములను తల దాల్చుటలో ఆశ్చర్య మే మున్నది ? ఆయన - విష్ణు భక్తుడు కదా! వ్యాసభగవానుడు మహాభారతము ద్వారా - నారాయణ మహిమను లోకమునకు తెలియజేయ దలచెను. అందువలననే - అందలి భగవద్గీతా - విష్ణుసహస్రనామములు నేటికిని - శిష్ట గోష్ఠిలో - నిత్య పారాయణ గ్రంథములుగా వెలుగొందుచున్నవి.

## మహాభారత హృదయము

ఈ మహాభారత ప్రాశస్త్యమును గుఱించి - కాశ్మీర దేశమునకు జెందిన 7 - వ శతాబ్దమందు గల ఆలంకారిక శిరోమణియు, ధ్వనిప్రస్థాన ప్రవర్తకుడును అయిన ఆనందవర్ధనాచార్యులు - ఏ మనుచున్నాడో గమనింపుడు :-

" వ్యంగ్య వ్యంజక భావేఽస్మిన్ వివిధే సంభవత్య
రసాతిమయ ఏకస్మిన్ కవి స్స్యా దవధానతాత్. "

— (ధ్వన్యాలోకము : 4 - వఉల్లాసము)

అను శ్లోకముయొక్క వ్యాఖ్యానమున - మహాభారతములో ప్రధాన రస మేది ? అని ప్రశ్నించుకొని, తమ అభిప్రాయమును విశదము గావించి

యున్నాడు. సంస్కృత భాషామయమగు అట్టి వ్యాఖ్యానమునందలి పంక్తులకు - కీ. శే. శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు ఇట్లు ఆంధ్రీకరించి యున్నారు :-

" ప్రబంధములలో అనేక రసము లున్నను - ఏదియో యొక్క రసమే ప్రధాన మొనరింపబడును. దృష్టాంతము-రామాయణ - మహాభారతములే. "

ఇక మహాభారత విషయమున విచారించుము :- అట - 'మోక్షము' అను పురుషార్థమును, తదవస్థోచిత మగు శాంత రసమును ముఖ్యములుగా వివక్షింపబడిన ఈ విషయమును కవియే సూచించెను. మహాభారతము శాస్త్ర కావ్యచ్ఛాయతో నున్నది. శాస్త్రము వలె పురుషార్థ నిరూపణమును ఇది యొనర్చును. సర్వ సంపత్సమృద్ధులతో వెలిగి వెలిగి, చివరకు - యాదవులు, పాండవులు కూడ-అత్యంత శోచనీయ మగు అవసాన మొందిరి. తుదకు-అట్టి వృష్ణి పాండవుల విరవసానము సనేగదా భారతము ముగియును ! "

దీనిని చదివిన వెంటనే పాఠకుని హృదయమున వైరాగ్యము ఒదవి తీరును. ఎన్ని సంపద లున్న నేమి? ఎంత బల మున్న నేమి ? ఇది ఏమైన వెంట వచ్చునా ? ఏదియైనను, ఎందుకైనను - అవసాన కాలమున ఉపయోగించునా ? అన్నియు - అశాశ్వతమే. అట్లయినపుడు - మన గతి యేమగునో కదా ! ధన కనకము లందును, ఐశ్వర్యము నందును గల మమకారము నిరర్థకములు ... ఈ వైరాగ్యమున గల్గు పురుషార్థము - మోక్షము. రసము శాంతము. ఇవి రెండును పై తీరున వైరాగ్యమును ఉద్బోధించు ఈ కవికి వివక్షితములు' - అనుటలో సందియ మేమున్నది ? ఈ విషయమున కొందరు వ్యాఖ్యాతలు - కొంచెము కొంచెముగా స్పష్టపరచియే యున్నారు. అదంతయు నేల ? అంతు లేని అజ్ఞానాంధకారమున మునిగి, కన్ను కానక యున్న ఈ లోకమును విమల మగు జ్ఞానదీప మను వెలుగు నొసంగి, ఉద్ధరింపదలచు ఆ లోకైకనాథుడే తన అభిప్రాయమును ఇట్లు స్పష్ట పరచియున్నాడు :-

"సారమే లేని లోక ప్రకారమును తెలియుచున్నకొలదియు - వైరాగ్యము ఒడవు నిచట. ఏమియును సంశయములేదు" అని.

ఎంత వల్లించినను - కసారితరములు అంశములుగానే వెంటాడు ననియు, శాంతమే అంగి యనియు, ఇతర పురుషార్థములు ఉపసర్జనీయము లుగా - మోక్షమును అనుసరించియుండు ననియు, మోక్షమే ఇందు ప్రధాన పురుషార్థ మనియు - బాదరాయణునిచే వివరింపబడినది.

ఈ మహా భారతములో - దేవతలు,తీర్థములు, ఋషులు, తపస్సులు మొదలగు వాని వర్ణనములు విశిష్టు లగు దేవతల, పాండవాదుల చరితము ఇతర రాజుల చరిత్ర వర్ణనములును - కానవచ్చును. ఇందలి దేవతా తీర్థ తపః ప్రభృతుల ప్రభావాతిశయము-భగవంతుని పొందుటకు ఉపాయములు కావునను, లేక - భగవంతుని విభూతీ రూపము కావునను-సంభవ మగును. ఇక - పాండవాది చరిత్ర వర్ణనలకు - వైరాగ్యము కలుగుటయే పరమ ప్రయోజన మనుట స్పష్టము. భగవ త్ప్రాప్తికి పరంపరా సాధనము ముఖ్య మని భగద్గీతాది శాస్త్రములలో వివరింపబడినది.

వాసుదేవ సంజ్ఞకు అర్థముగా-మథురా నగరము నందు ఉదయించుట వలన, తన రూపము సకల స్వరూపములను అనుకరింపగలుగు నని వ్యక్త పరచిన అపరిమిత శక్తి నిలయ మగు పరబ్రహ్మమే మహాభారతమున వ్యక్తము గావింపబడినది. వాసుదేవ శబ్దము భగవద్గీతాదులందును - (వాసు దేవస్స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః" ఇత్యాదులందు) సుప్రసిద్ధమే గదా !

అయ్యది - మథురా నగర వాసు డగు వసుదేవ సూతుని మాత్రమే పిల చెప్పరా దందురా ? ఇచట 'సనాతనః' అను శబ్ద విశేషణము ఉపయో గింపబడి యున్నది కదా ! ఈ శబ్దము - శ్రీరామాయణమున - భగవానుని

అవతారాంతర మగు శ్రీరామచంద్రునందు కూడ వాడబడియున్నది. కావున, విశిష్టోపసంహారము వలన - "భగవాన్ వాసుదేవోఽపి కీర్త్యతేఽత్ర సనాతనః" అనుచోట - 'వాసుదేవ' శబ్దముచే - అపరిమిత శక్తినిలయమును, మధురానగరోదయమున సకల స్వరూపమును అనుకరించినసామర్థ్యమును ప్రకటించినవియును అను పరబ్రహ్మమే వివక్షితమైనది. అంతేకాని, మధురా నగరోదయ రూప మగు అంశము మాత్రమే కాదని స్పష్టము.

ఇట్లు అనుక్రమణికయందే వ్యంజనాశక్తి సమన్వితమగు వాక్య విశేషము వలన - 'భగవంతునకు అతిరిక్తమైన దంతయు అనిత్యము' అని - కవి వ్యంగ్య మొనర్చెను.

ఇది-మహాభారతమును గూర్చి ఆనందవర్ధనాచార్యుని అభిప్రాయము. దాక్షిణాత్యులైన పిళ్ళైలోకాచార్యులవారి ఆశయము నైతము దీనిని అనుసరించియే యున్నది. ఇట్లే -

## శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్ర ప్రశస్తి

భీష్మ యుధిష్ఠిర సంవాద రూపమున ప్రస్తుతమైన శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర ప్రారంభమున యుధిష్ఠిరుడు —

" కి మేకం దైవతం లోకే - కిం వా ప్యేకం పరాయణమ్
స్తువంతః కం కమర్చంతః - ప్రాప్నుయు ర్మానవా శ్శుభమ్. "
" కో ధర్మ స్సర్వ ధర్మాణాం - భవతః పరమో మతః
కిం జప న్ముచ్యతే జంతుః - జన్మసంసార బంధనాత్ ? "

అని భీష్మాచార్యులవారు ప్రశ్నింపగా —

" జగ త్ప్రభుం దేవదేవం - అనంతం పురుషోత్తమమ్
స్తువ న్నామ సహస్రేణ - పురుష స్సతతో త్థితః. "

త మేవ చార్చయ న్నిత్యం - భక్త్యా పురుష మవ్యయమ్
ధ్యాయన్ స్తువన్ నమస్యం శ్చ - యజమాన స్త మేవ చ
అనాది నిధనం విష్ణుం - సర్వలోక మహేశ్వరమ్
బ్రహ్మణ్యం సర్వ ధర్మజ్ఞం - లోకానాం కీర్తివర్ధనమ్
లోకనాథం మహ ద్భూతం - సర్వభూత భవోద్భవమ్
ఏష మే సర్వ ధర్మాణాం ధర్మోధిక తమో మతః
య ద్భక్త్యా పుండరీకాక్ష స్త వై రర్చే న్నర స్సదా. "

అని - పరాత్పరుడైన శ్రీ మహావిష్ణువు యొక్క నామసహస్రమును కీర్తించుటయే ఉత్తమోత్తమ ధర్మ మని ప్రస్తుతించినాడు. దీనిని కేవలము ప్రశంసా వచనముగ భావింపరాదు. విశ్వరూప సందర్శనాధ్యాయమున ప్రదర్శించిన విధముగా - సర్వదేవాంతకుడై —

" భీషా ష్మా ద్వాతః పవతే - భీషోదేతి సూర్యః. భీషాస్మా
దగ్ని శ్చేంద్ర శ్చ. మృత్యుర్ధా వతి పంచమ ఇతి. "
— (తైత్తిరీయోపనిషత్తు - ఆనందవల్లి )

అను శ్రుతి వాక్యము చొప్పున సత్య నియామకుడై -

" అంత ర్బహి శ్చ త త్సర్వం వ్యాప్య నారాయణ స్థితః.

అను విష్ణుసూక్త వాక్యానుసారము - లోపల, వెలుపల వ్యాపించియున్న వాడును, ఆ కారణముచే సర్వము తానయైనవాడును, జగత్కారణభూతుడును, మోక్షప్రదాతయునైన శ్రీ మహావిష్ణువును గూర్చి పలికినది అక్షర సత్యమే గాని, ప్రశంసా మాత్ర వచనము కాదు. కావుననే - అతనికి అన్ని విశేషణ ములు వాడబడినవి.

# శ్రీ పాంచరాత్రాగమ ప్రాశస్త్యము

పైన పేర్కొనబడిన కారణములవలననే-ఉపరిచర వసు వృత్తాంత ప్రస్తావనమున - భగవదారాధనాపరమైన భగవచ్ఛాస్త్ర మనబడెడు శ్రీ పాంచ రాత్ర శాస్త్రమును -

"పాంచరాత్రస్య కృత్స్నస్య - వక్తా నారాయణ స్స్వయమ్ "
—(మహాభారతము - శాంతి పర్వము : 341 - 68 శ్లో)

సాక్షాత్తుగా - నారాయణ ముఖారవిందోదిత మగుటచే - అది ప్రమాణ మూర్ధన్య మని ప్రస్తుతించి -

"పాంచరాత్ర విధాయే తు - యథాక్రమపరాః నృప !
ఏకాంతభావోపగతాః - తే హరిం ప్రవి శంతి వై."

అని - శ్రీ పాంచరాత్ర మార్గమున భగవంతుని ఆరాధించిన పరమై కాంతులు - పరమ పదమున - హరిని సేవించుచుందురు' - అని వివరింప బడినది.

## మహాభారత నీరాజనము

"అగ్ని రవమో దేవతానాం - విష్ణుః ప్రథమః "

దేవతలలో అగ్ని - చివరివా డనియు, విష్ణువు మొదటివాడనియు - ఈ వేద వాక్యము స్పష్టము చేయుచున్నందున, విష్ణువు సర్వ ప్రథము డనియు, సర్వోత్తము డనియు, సర్వేశ్వరు డనియు విశద మగును.

ఇట్లు వేదములందు దేవాధిదేవుడుగా కీర్తింపబడిన ఆ విష్ణువే - దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ - ధర్మ సంస్థాపనములకై శ్రీకృష్ణుడుగా అవనిలో అవతరించును. అట్టి శ్రీకృష్ణుని సంకీర్తించుటకు - ఆ వేదములే వేద

వ్యాసుని ముఖారవిందమునుండి మహాభారత రూపమున అవతరించినవి. అట్టి వేదముల ముఖ్య లక్ష్యము – యజ్ఞ పురుష వైభవ కీర్తనము. వాని అవతారమైన మహాభారతము సైతము–ఆ యజ్ఞపురుషునే కీర్తించి," భారతః పంచమో వేదః" అను కీర్తినార్జించి యున్నది.

" నమో నారాయణాయేదం – కృష్ణద్వైపాయనాత్మనే
యదా ముష్యాయణా వేదాః – మహా భారత పంచమః "



# సంస్కృత వాఙ్మయములో
# రామాయణ - మహాభారతముల వైశిష్ట్యము

'విద్యా భూషణ - కవితా విశారద'

**శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు**

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు



## 1. ఆరంభ వాక్యము

ప్రకృతిలో మహానందము నందవలె నన్న, ఆ ప్రకృతిని కవినేత్రములతో గాంచుము, గ్రహించుము, సన్నిహితము గావించుకొనుము' అని- విశ్వకవి రవీంద్రుడు బోధించియున్నాడు. కావున, కవినేత్రములు అసాధారణమైన ప్రతిభలో సుసంపన్నములై యుండు నని స్పష్ట మగుచున్నది. సామాన్య మానవుడు - ప్రకృతిని భౌతిక దృష్టితో, దార్శనికుడు - తాత్త్విక దృష్టితో, కవి - రస దృష్టితో గాంచుట సహజము. తత్ఫలముగా - సామాన్య మానవునిలో భోగ ప్రవృత్తియు, దార్శనికునిలో వైరాగ్య ప్రవృత్తియు, కవిలో రస ప్రవృత్తియు ప్రజ్వరిల్లును.ఐనచో - కవి యైనవానికి - అప్రతిమ ప్రతిభా ప్రభావము గల నేత్రము లెట్లు ప్రాప్తించును ? అని - ఇట నొక ప్రశ్న ఉదయించును.

## 2. కవి లక్షణము

మానవ ప్రవృత్తి సహజముగ భోగ మయమై యుండును. కావున, అట్టి భోగ ప్రవృత్తి నుండి మానవుడు విడివడవలె నన్నచో - అతనికి తప స్సాధన - ఆవశ్యకము.

౧. ఋతం తప స్సత్యం తప శ్శ్రుతం తప శ్శాంతం తపో - దమ
స్తప శ్శమ స్తపో - దానం తపో - యజ్ఞ స్తపో - భూ ర్భువ స్సువ
ర్బ్రహ్మై త దుపా స్యైత త్తపః. "

మనస్సుతో వస్తు చింతనము, వాక్కుతో సత్యము పలుకుట, వేద మును అధ్యయనము చేయుట, బాహ్యేంద్రియములను నిగ్రహించుట, శాస్త్రీయము లగు ఉపవాసాదికముల నాచరించుట, శరీరమును శుష్కింప జేయుట, శత్రువులందు క్రోధము లేకుండుట, ద్రవ్యమును యోగ్యు లగు వారికి ప్రత్యుపకార బుద్ధితో కాక - దానము చేయుట, భగవ దారాధనము గావించుట, భూ ర్భువ ర్లోకాత్మక మగు విరాడ్రూప ధారియైన పరబ్రహ్మ మును ఉపాసించుట - అను లక్షణములు 'తపస్సు' అనబడును." ఇది వేద ప్రమాణము.

౨. య ద్దుష్కరం య ద్దురాపం య ద్దు ర్గం య చ్చ దుష్కరమ్
త త్సర్వం తపసా ప్రాప్తం - తపో హి దురతిక్రమః. "

దేనిని తరించుటయు, పొందుటయు, ప్రవేశించుటయు, నిర్వహించు టయు కష్టమో, అసాధ్యమో - అవి యన్నియు - తప స్సాధన వలన సాధ్య మగును. తప శ్శక్తిని ఏదియు అతిక్రమింప జాలదు." ఇయ్యది - శాస్త్ర ప్రమాణము.

వైదిక యుగమునకు జెందిన కవిని - 'ఋషి' యని వ్యవహరింతురు. ఆ మహర్షియు - తప స్సాధన వలననే కవిదృష్టిని పొందగల్గెను. వైదిక ఋషుల యనంతరము - వ్యాస వాల్మీకులు మున్నగు మహా కవులు కొందఱు - వేద వేదాంగాది వివిధ విద్యలలో విద్వాంసులై, ఈ ఋషి పరంపరలో చేరిరి.

కవికి విద్యలందును, ఉప విద్యలందును-సమగ్రమైన అవగాహనము ఆవశ్యకము. వ్యాకరణము, నిఘంటువు, ఛందస్సు, అలంకారము - అనునవి

నాల్గును విద్యలుగా, గీతము, వాద్యము, నృత్యము, నాట్యము, చిత్ర లేఖనము, ఉదక వాద్యము, ఇంద్రజాలము, హస్తలాఘవము, సూత్రప్రక్రియ, కావ్య సమస్యా పూరణము, పుస్తకవాచనము, వాస్తు విద్య, జ్యోతిష విద్య, సాముద్రిక విద్య, అవధాన విద్య, రూప్య రత్నక పరీక్ష, ద్యూత విశేషము, రక్షణము, ఆకర జ్ఞానము, మణిరాగ జ్ఞానము, వృక్షాయుర్వేద విజ్ఞానము, నాడీ విజ్ఞానము, దేశ భాషా విజ్ఞానము, వస్త్ర గోపనము, బాలక క్రీడానకములు, వైతాళిక విద్యా జ్ఞానము - మున్నగునవి - చతుష్షష్టి (64) కళలుగా, చతుష్షష్టి ఉప విద్యలుగా - విఖ్యాతములై యున్నవి.

## 3. కావ్య ప్రయోజనము

కవి యైనవాడు - చరాచరాత్మకమైన సమస్త విశ్వమును సమున్మీలితము గావించు నిమిత్తము - కావ్య రూప మగు సాధనమును సృజించును. అట్టి కావ్యము - మానవునకు చరాచర ప్రపంచము నందలి ప్రతి యణువు నందును విశ్వరూపమును విలోకింపగల దృష్టిని ప్రసాదించి, త దాస్వాదనము గావింపజేసి, ఆత్మ తృప్తిని కల్గించును. సర్వ లక్షణ సంపన్నమైన కావ్యము - సహృదయు లగు రసజ్ఞులకు - అప్రాకృతమైన మహానందమును గల్గించును. అట్టి ఆనందమునకు సాటి యగునది మఱి యొకటి లేదు. ఈ యంశమును భర్తృహరి మహాకవి ధృవీకరించును.

" సుకవితా యద్యస్తి - రాజ్యేన కిమ్ ? "

సత్కావ్య మున్నచో - ఇక రాజ్యభోగ మేల ? అని పలికెను. తాత్పర్య మేమనగా - సత్కార్యము వలన గల్గు అనందము అపారమైనదనియు, రాజ్య వైభవము వలన గల్గు ఆనందము అల్పమైన దనియు - అ మహాకవి మనోభావనము.

ఇట్లే - 'మమ్మటుఁడు' అను మహాకవియు సత్కావ్యము వలన - షడ్విధములైన ప్రయోజనములు కలవని తెలుపుచు -

" కావ్యం యశసే ఽర్థకృతే - వ్యవహార విదే - శివేతర క్షతయే
సద్యః పర నిర్వృతయే - కాంతా సమ్మిత తయోపదేశ యుజే. "

సత్కావ్యము వలన - కీర్తియు, లోక వ్యవహారము, విశేష పరిజ్ఞానము ప్రాప్తించుటేగాక, అశుభములు తొలగును. కాంత వలె హిత ముపదేశించును. ఎంతో మేలు చేకూరును' అని - బోధించుచున్నాడు. అనగా - సత్కావ్యము వలన - వివిధములైన ప్రయోజనములు గల్గుటే గాక, అప్రాకృతమైన ఆనందము కూడ లభింపగలదని దీని తాత్పర్యము.

'భామహుడు' అను - మఱి యొక మహా కవియు - సత్కావ్యము వలన చతుర్విధ పురుషార్థములు లభింపగలవని తెలియజేయుచున్నాడు :-

" ధర్మార్థ కామ మోక్షేషు - వైలక్షణ్యం కలాచన
ప్రీతిం కరోతి కీర్తిం చ - సాధు కావ్య నిబంధనమ్. "

సత్కావ్య రచనము వలన - రచయితకు చతుర్విధ పురుషార్థము లనబడు ధర్మార్థ కామ మోక్షములు లభించును. లోకమున కీర్తి చేకూరును. పఠితలకు సంతుష్టియు కల్గును. ఇదియే సత్కావ్య రచన వలన గల్గు ప్రయోజనము.

## 4. వైదిక కావ్యములు

నిత్య నవ నవోన్మేష మగు కవి దృష్టి - విశాల విశ్వ మండలి చరాచర ప్రవృత్తులను గ్రహింప, వానిలోని ఆ శబ్ద తరంగముల మూలమున వెలువడు భావపరంపరలే కావ్య రూపమును ధరించును. భారతీయ కావ్యము మొట్ట మొదట - ఋగ్వేద సూక్తములలో-ఛందోబద్ధము లగు శ్లోక మాలికలలో-బహు విధ విషయ ప్రబోధకమై, అనేక భావ రస ప్రయుక్తమై వెలువడినది.

ఆ యుగమున కేవలము ముక్తకముల వంటివే గాక,ఆఖ్యానములు, గాథలు - అను శీర్షికలతో కూడ మఱి కొన్ని వెలువడియున్నవి. అయ్యవి-

ఆకారమున ముక్తకములకంటెను దీర్ఘములుగా గన్పట్టును. అనంతర కాలమున వెలువడిన మహా కావ్య నాటకాదులు సైతము - వైదిక రచనల వలెనే సంభావింపబడుచున్నవి.

## 5. ఆర్ష కావ్యము - ఆది కావ్యము

వైదిక యుగమునకు పిమ్మట వెలువడిన రామాయణ-మహాభారత ములు రెండును - ఇతిహాస శ్రేష్ఠములై, వేద సారమును విశదీకరించునవియై, విఖ్యాతి గాంచి యున్నవి.* వీనిలో - రామాయణము ఆదికవి యైన వాల్మీకి మహర్షి చే రచింపబడినందున ఆది కావ్య మనియు, మహా భారతము వ్యాస మహర్షిచే రచింపబడినందున ఆర్ష కావ్య మనియు ప్రసిద్ధిగాంచి

---

* " ఇతిహాసః పూర్వ వృత్తమ్. "

పూర్వ చరిత్ర ప్రతిపాదకమైనదే 'ఇతిహాస' మని - అమర నిఘంటు నిర్వచనము. కావున, రామాయణ - మహాభారతముల వంటి గ్రంథములే - 'ఇతిహాసము' లని వీని తాత్పర్యము.

ఇందులకు తార్కాణముగా - రామాయణ - మహా భారతములు రెండును ఇతి హాస శ్రేష్ఠము లని నిరూపించుటే గాక, ఇంకను - మఱి కొన్ని విశేషాంశములను పొందుపఱచుచు - A. SRINIVASA RAGHAVAN అను ప్రముఖులొకరు - 'VISISTADVAITA' అను పేర నొక గ్రంథమును ఆంగ్ల భాషలో రచింప, ఆ గ్రంథ రత్నమును - తిరుమల తిరుపతి దేవస్థానముల వారు-1986వ సంవత్సరమున-ప్రచురించియున్నారు. ఇట్టి యీ గ్రంథమునందు-207 పుటమొదలు 211 పుటకును గల 1) Itihasa, (Epic) and its Validity; 2) Mahabharata and Validity - అను రెండు శీర్షికలతో పొందు పరచబడిన యంశములను జిజ్ఞాసువులు పరిశీలించి, ఇతిహాస శ్రేష్ఠములైన రామాయణ - మహా భారతముల వైశిష్ట్యమును గ్రహింపవచ్చును.

— వ్యాసకర్త.

యున్నవి. వీనిలో-రామాయణము ఆదర్శ మానవ జీవితమును ప్రతిబింబించు చుండ, మహాభారతము - సనాతన ధర్మ ప్రబోధకమై వెలయుచున్నది.

## 6. రామాయణము మధుర కావ్యము

పై జెప్పబడిన వైదిక యుగమునకు పిమ్మట-సంస్కృత కావ్యము అనేకములు - అభినవ రూప లావణ్యములను సంతరించుకొని వెలువడినవి. అయ్యది —

" దృశ్య శ్రవ్య భేదేన ద్విధా విభాజితమ్. "

దృశ్య శ్రవ్య భేదములచే రెండుగా - విభక్తములై, క్రీస్తు శకారంభము నుండియు - శ్రవ్య కావ్యములుగా, దృశ్య కావ్యములుగా - మహోన్నత స్థాన మలంకరించియున్నవి. అట్టి కావ్యములలో-భావ గాంభీర్యము, ఔదార్యము మున్నగు గుణములు పరాకాష్ట నందుకొని, ఆ కావ్యములకు శ్రేష్ఠతను సంతరింపజేయుచున్నవి.

వాల్మీకి రామాయణము - "పాఠ్యే గేయే చ మధురమ్" అనునట్లు - పఠించుటకు, గానము చేయుటకును - మధురముగా నుండి, ఈ కోవకు చెందియున్నందున, మహా కావ్యములలో అగ్రగణ్యమైనదిగా సంభావింపబడు చున్నది.

## 7. మహాభారతము పంచమ వేదము

మహాభారతము మహా కావ్య శ్రేణికి చెందినదే యయ్యును-ముఖ్యముగా - వేదములలో ప్రతిపాదింప బడిన ధర్మములను, వేదాంతములలో నిక్షిప్తములైన మర్మములను బోధించుచున్నందున, ధర్మ శాస్త్రముగా - వేదాంత శాస్త్రముగా పరిగణింపబడుచున్నది.

" ధర్మ మూలం జగత్సర్వం — ధర్మ శ్చ శ్రుతి మూలకమ్ .
భారతః పంచమో వేదః - శ్రుతి సర్వత్ర గీయతే. "

విశ్వ మంతయు ధర్మ మూలకము. అట్టి ధర్మము శ్రుతి మూలకము. 'శ్రుతి' యనగా — వేదము — వేద మనగా — జ్ఞానము. కావున, అట్టి వేద ధర్మములతో విస్తరించియున్న మహా భారతము - పంచమ వేద మన బడుచున్నది.' ఇయ్యది — పై యంశమును - ధృవ పఱచుచున్నది కదా !

అయినచో - వేదము లనగా నేమి ? ఆ వేదముల స్వరూప మేమి ? వానిలో ఏ యే విశేషము లున్నవి ? వాని వలన కల్గెడి ప్రయోజన మేమి ? అను ప్రశ్న లిట నుదయించుట సహజము.

## 8. వేద వాఙ్మయ పరిచయము

౧. ఋగ్వేదము ౨. యజుర్వేదము ౩. సామ వేదము ౪. అథర్వ వేదము - అని - వేదములు నాలుగు.

౧. ఋగ్వేదములో -

సృష్టి రచన, ప్రకృతి స్వరూపము, జీవాత్మ స్వరూపము, పరమాత్మ స్వరూపము, దైవ ప్రార్థన, ధర్మ నీతి, సాంఘిక నీతి, రాజ నీతి, అర్థ నీతి, అంక గణితము, రేఖా గణితము, బీజ గణితము, భూగోళ విజ్ఞానము, భూగర్భ విజ్ఞానము, దేహ విజ్ఞానము, మనో విజ్ఞానము, జ్యోతిషము - మున్నగు విద్యా విశేషము లనేకములు గలవు.

౨. యజుర్వేదములో -

వివిధ యజ్ఞ యాగాది క్రియా విశేషములు, రాజ నీతి, సాంఘిక నీతి, శిల్ప విజ్ఞానము, కృషి విజ్ఞానము, రాజ్యము, స్వరాజ్యము - మున్నగు విషయములు వివరింపబడినవి.

౩. సామ వేదములో -

భక్తి రస ప్లావితము లగు స్తోత్రము లనేకములు - సంగీత భంగీ తరంగితములుగా నొప్పారుచున్నవి. ఈ సామ వేదము - ఆకృతిలో చిన్నదియేయైనను-అంతస్థులో మిన్నయైనది. "వేదానాం సామవేదోఽస్మి" అను గీతా సూక్తియే ఇందులకు సాక్ష్యాధారము.

౪. అధర్వ వేదములో -

ధర్మార్థ కామ సంబంధము లగు విద్యా విశేషములు, తత్సాధనములు, ఆరోగ్య విజ్ఞానము, బలకర ప్రక్రియలు, ప్రభుత్వాధికారుల నియామక విధానము, ధర్మము, నీతి, సత్ప్రవర్తన - ఇత్యాది విషయములు విపులీకరింపబడినవి.

## 9. వేద వైశిష్ట్యము

విశిష్టమైన యిట్టి వేద వాఙ్మయము - కర్మ కాండ యనియు, జ్ఞాన కాండ యనియు - రెండు విభాగములుగా నుండును.

స్థూలముగా ఇదియే వేదముల స్వరూపము. దీనిని బట్టి, ఈ వేదముల వైశిష్ట్యమును, ప్రయోజనమును, మనము సులభముగా గ్రహింపవచ్చును. ఇట్టి వేద సమామ్నాయమే మన సనాతన మతమునకు మూలాధారము. ఇయ్యది - అపౌరుషేయముగా, స్వతః ప్రమాణముగా, క్రాంత దర్శిగా, తప స్సమాధి గోచరముగా, అనాది నిధనముగా, స్వయం జాతముగా, బ్రహ్మతత్త్వావబోధకముగా, గురు శిష్య పరం పరా ప్రాప్తముగా, పరమ పావనముగా, శ్రీరూపముగా ప్రసిద్ధి గాంచి, విశ్వ వాఙ్మయ భాండాగారమున ఒక విశిష్ట స్థాన మాక్రమించియున్నది.

ఇట్టి యీ వేద వాఙ్మయములో - ధర్మ స్వరూపము, బ్రహ్మస్వరూపము - అనునవి రెండును వ్యక్తము చేయబడినవి. ఇందు ప్రతిపాదింపబడిన పరబ్రహ్మము – " సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ " " ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ " - ఇత్యాది శ్రుతి ప్రమాణములనుబట్టి, సత్య జ్ఞానానంద స్వరూప విశిష్ట మని స్పష్ట మగును. ఇట్టి వేద ధర్మమునకు హాని కల్గినపుడు, అధర్మము వృద్ధియైనపుడును - భగవాను డవతరించి, ధర్మ సంస్థాపన జేయును.

" యదా యదా హి ధర్మస్య – గ్లాని ర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య – త దాత్మానం సృజా మ్యహమ్. "

ఈ గీతా సూక్తియే ఇందులకు ప్రమాణము. (4 - 7)

## 10. రామ కృష్ణావతారముల ప్రాముఖ్యము

" జ్ఞాన శక్తి బ లైశ్వర్య – వీర్య తేజాం స్యశేషతః
భగవ చ్ఛబ్ద వాచ్యాని – వినా హేయై ర్గుణాదిభిః
పరమ బ్రహ్మభూతస్య – వాసుదేవస్య నాన్యగః
సర్వాణి తత్ర భూతాని – వసంతి పరమాత్మని
భూతేషు చ స సర్వాత్మా - వాసుదేవ స్తత స్మృతః. "

అను విష్ణుపురాణోక్తరీత్యా, (7-7-89.90) - షడ్గుణైశ్వర్య సంపన్నుడగు భగవానుడు – ధర్మోద్ధరణార్థము భారత భూ భాగమున – ఆ యా సమయములందు – ఆ యా తావులలో-అనేక రూపములతో అవతరించి, సనాతనమైన వేద ధర్మమును సంరక్షించియున్నాడు. అట్టి యవతారములలో – మానవ రూపములుగా గల రామ – కృష్ణావతారములు రెండు మాత్రము – అత్యంతము ప్రాముఖ్యమును పొందియున్నవి.

# 11. రామ శబ్దార్థములు

రామ శబ్దమునకు - అనేకములైన అర్థము లున్నవి. ఆ యర్థము లన్నియు - రాముని కల్యాణ గుణములను అభివ్యక్తము గావించు నట్టివే. అట్టివానిలో - కొన్నింటిని ఇట సమీక్షింతము :-

౧. రామో రమయితాం వరః.
రమింపజేయు (=సంతోషపెట్టు) వారిలో శ్రేష్ఠుడు.

౨. రమయతి సర్వాన్ గుణై రితి రామః.
గుణములచేత అందఱను రమింపజేయువాడు. (=సంతసింపజేయు వాడు.)

౩. రమన్తేఽస్మిన్ సర్వే జనా గుణై రితి రామః
గుణములచే అందఱును ఇతనియందు రమింతురు. (= సంతోషము కలిగి యుందురు.)

౪. రమన్తే యోగినోఽనన్తే - సత్యానందే - చిదాత్మని
ఇతి రామపదే నాసౌ - పరబ్రహ్మాభిధీయతే. "

— (అగస్త్య సంహిత)

అనంతుడు, అనగా - సర్వ వస్తువులందును సర్వ కాలములందును, సర్వ దేశములందును - ఉండువా డగుటచే, త్రివిధ పరిచ్ఛేద రహితుడు, సత్యానంద స్వరూపుడును అగు ఆతనియందు రమించుచున్నారు. ( = ఈ లామును గుఱించి సంతోషించుచున్నారు.) కావున, ఇతడు - 'రాముడు' అనబడుచున్నాడు. ఈ రాముడు - పరబ్రహ్మముగా చెప్పబడుచున్నాడు.'

# 12. రాముని సౌందర్య పరిభావము

" పుంసాం మోహన రూపాయ - పుణ్య శ్లోకాయ మంగళమ్. "

అనునట్లు - పురుషులను సైతము మోహింపజేయు దివ్య సౌందర్యము గలవాడు రాముడు. అందుచే, ఒకపుడు - దేవతలు, మహర్షులు కొందఱును - ఆ రాముని భువనమోహన సౌందర్యమునకు ఆకర్షితులై, ఆతని అలింగన భాగ్యమును అభిలషించి రట ! ఈ వృత్తాంతము - కృష్ణోపనిషత్తులో నిట్లు స్పష్టముగా వర్ణింపబడినది :-

శ్రీమహావిష్ణుం సచ్చిదానంద లక్షణం రామచంద్రం దృష్ట్వా సర్వాంగ సుందరం మునయో వనవాసినో విస్మితా బభూవుః. తం హోచు ర్నోఽనవద్య మవతారాన్ వై గణ్యన్తే. ఆవిరరామో భవన్త మితి. భవాన్తరే-కృష్ణావతారే యూయం గోపికా భూత్వా, మా మాలింగథ. అన్యే యేఽవతారాస్తే హి గోపానస్త్రీశ్చ (నో) కురు. "

సచ్చిదానంద స్వరూపుడు - శ్రీ మహా విష్ణువు - సర్వాంగ సుందరుడు నగు శ్రీరాముని-వన వాసులైన మహర్షులు మున్నగువారు కొందఱు దర్శించి, ఆ సౌందర్యమునకు ముగ్ధులై, నిన్ను మేము ఆలింగనముగావించు కొన నభిలషించుచున్నా' మని రామునకు విన్నవింప, అపు డా రాముడు - నే నిక మున్ముందు, కాలాంతరమున - కృష్ణావతారమును ధరింపనున్నాను కనుక, అపుడు మీరు గోపికలై, నన్ను ఆలింగనము చేసికొనవచ్చు నని సమాధాన మొసంగి, అట్లే - కృష్ణావతారమున వారి కోరికను నెరవేర్చెనట రాముడు !

" యో రామః కృష్ణతా మేత్య - సార్వాత్మ్యం ప్రాప్య లీలయా
అతోషయ ద్దేవ మౌళి పటలం తం నమా మ్యహమ్. "

ఏ రాముడు కృష్ణావతారమును ధరించి, తన లీలా విశేషములతో - సర్వశక్తిమంతుడై, దేవతలయొక్కయు, మహర్షులయొక్కయు వాంఛను సఫలము గావించెనో - అట్టి రామునకు నమస్కరించుచున్నాను.'

కృష్ణోపనిషత్తు నందలి పై వాక్యములనుబట్టి, రాముడు, కృష్ణుడు - అనువార లిరువురును విష్ణువుయొక్క అవతారములే యని స్పష్టమగుచున్నది గదా ! అట్టి రామకృష్ణుల లీలా విశేషములను వర్ణించునవియే-రామాయణ - మహాభారతములు. ఇట్టి రామాయణ మహాభారతముల వంటి వాఙ్మయము-ప్రపంచములో — ఏ వాఙ్మయమునందును, ఏదేశమునందును-నేటివఱకు - వచ్చియుండలేదు.

## 13. రామాయణ ప్రశస్తి

రామాయణములో-1) బాల కాండ 2) అయోధ్యా కాండ 3) అరణ్య కాండ 4 కిష్కింధా కాండ 5) సుందర కాండ 6) యుద్ధ కాండ 7) ఉత్తర కాండ - అను విభాగములతో ఏడు కాండలు కలవు.

" శ్రీవిష్ణోః ప్రథమే కాండే - జగ జ్జనన హేతుతా
ద్వితీయే స్థితి హేతుత్వం - తృతీయే మోక్షదాయతా
చతుర్థే గుణ సంపత్తిః - పంచమే సర్వ హన్తృతా
షష్ఠే వేదాంగ వేద్యత్వం - సప్తమే స్రష్టు హేతుతా
ఏవం విష్ణుః పరం తత్త్వం - రామాత్మేతి సునిశ్చితమ్. "

శ్రీ మహా విష్ణువు జగ జ్జన్మకారణ మని మొదటి కాండ మందును, జగత్తు నిలుచుటకు కారణ మని రెండవ కాండ మందును, మోక్షము నిచ్చు వాడని మూడవ కాండ మందును, సకల సద్గుణ సంపన్ను డని నాల్గవకాండ మందును, సర్వ రక్షకు డని అయిదవ కాండ మందును, వేదాంత వేద్యుడని ఆఱవ కాండమందును, బ్రహ్మపుట్టువుకు కూడ హేతు వని యేడవ కాండ

మందును చెప్పబడినది. కనుక, విష్ణువేరాముని రూపమున అవతరించెననుట- స్పష్టము. అట్టి రాముడు - జననీ జనకుల యందును, గురువుల యందును- అచంచల మైనట్టియు, అపారమైనట్టియును అగు భక్తి భావము గలవాడనియు, సోదరులయందు వాత్సల్య గుణము గలవాడనియు, ఏకపత్నీవ్రతుడనియు, సకల జనుల యందును సమభావము గలవాడనియు, భక్తవత్సలుడనియు, శరణాగత రక్షకుడనియు, కృతజ్ఞతా లక్షణములు గలవాడనియు, సత్యవాక్పాలకుడనియు-ఇంకను ఎన్నెన్నియో కల్యాణ గుణములు గలవాడనియు - ఆదికవియైన వాల్మీకి మహాముని - తన రామాయణమున తనివి తీర వర్ణించియున్నాడు.

## 14. వివిధ భాషలలో రామాయణములు

సకల సద్గుణ సంపన్నుడైనట్టియు, ఆశ్రితులను తరింపజేయునట్టియు నగు శ్రీరామచంద్రుని కల్యాణ గుణ గణములను అభివర్ణించుచు- కేవలము ఆదికవియైన వాల్మీకి మహామునియె గాక, "నా నృషిః కురుతే కావ్యం" అనునట్లు, ఋషులును. ఋషితుల్యులును అగు మహాకవులు, మహనీయులు నగు మఱి కొందఱు - సంస్కృత భాషయందును, దేశ భాష లందును, రాష్ట్ర భాషలయందును - మఱికొన్ని రామాయణములను రచించి, వారలకు శ్రీరాముని యందు గల భక్తి ప్రపత్తులను వ్యక్తము గావించి యున్నారు.

అట్టి రామాయణములలో - విశ్వామిత్ర మహర్షిచే రచింపబడిన ఆధ్యాత్మ రామాయణము, వశిష్ఠ మహర్షిచే రచింపబడిన ఆనంద రామాయణము, కావ్యములలో - కాళిదాసుని రఘు వంశ మహాకావ్యము, కుమార దాసుని జానకీ హరణము, భట్టి కుమారుని రావణ వధము, అభినందన కవి విరచిత మగు రామ చరితమ్ము, వేదాంత దేశికుని పాదుకా సహస్రము, రఘు వీర గద్యము, రామ భట్ట బాణుని రఘునాథ చరిత్రము, అభినవ రామ విరచిత మగు అభినవ రామాభ్యుదయము, రామ వన వాసము మొదలు -

రావణ వధ వఱకు వర్ణించిన భాసుని ప్రతిమా నాటకము. మాధవ విద్యారణ్యుని రామోల్లాసము, శ్లేష కావ్యములలో - ధనుంజయుని రాఘవ - పాండవీయము. కవిరాజు కవి రాఘవ-పాండవీయము, చిదంబర కవి విరచిత మగు రాఘవ - పాండవీయము, వేంకటాధ్వరి యాదవ - రాఘవీయము, హరి దత్త సూరి రచిత మగు - రాఘవ - నైషధీయము, చిత్ర కావ్యములలో - విట్ఠల ఉపమాక వేంకటేశ్వరకవి విరచిత మగు ఇరువది (20) సర్గల రామాయణ సంగ్రహము, కృష్ణ కవి రచిత మగు పదునైదు (15) సర్గల ఉమా గోపన రామాయణము - మున్నగునవి సంస్కృత భాషా భూషితములై, పేరుగాంచియున్నవి

ఇక మన తెలుగులో - రంగనాథ రామాయణము మొట్ట మొదట పేర్కొనదగినది. దీనిని ద్విపదలో - పూర్వ కాండను - కోన బుద్ధభూపతి రచింపగా, ఆతని తనయు లగు కోన కాచ భూపతి,కాచ విట్ఠల భూపతియు- కాలాంతరమున - ఉత్తర కాండను ద్విపద వృత్తమునందే రచించిరి.

ఈ రంగనాథ రామాయణమునకు పిమ్మట స్మరింపదగినది - బహుకల్పక మగు భాస్కర రామాయణము. అనంతర కాలములో - ఋగ్వేదకవి వేంకటాచలపతి చంపూ రామాయణము, కంకంటి పాపరాజు నిర్వచనోత్తర రామాయణము, తిక్కన సోమయాజి ఉత్తర రామ చరితము, పిండిప్రోలు లక్ష్మణ కవి 'రామ దమ్మీయ' మను నామాంతరము గల లంకా విజయమను ద్వ్యర్థి కావ్యము, మొల్ల రామాయణము, సీరము సుభద్రాంబ సుభద్రా రామాయణము, చేబ్రోలు సరస్వతి సరస్వతీ రామాయణము, అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయము, గరుడాచల కవి కౌసలేయ చరిత్ర,రంగయ్య కవి రామోదంతము, చింతపల్లి ఛాయాపతి రాఘవ చరితము, రామాయణ - మహాభారతముల రెంటిని జోడించి, ద్వ్యర్థి కావ్యముగా - పింగళి సూరనార్యుడు రచించిన రాఘవ-పాండవీయము, క్రొత్త లంక మృత్యుంజయుని ధరాత్మజా పరిణయము, శ్రీరామ వేంకటాచలము రచించిన ధరాత్మజా

పరిణయము, వేంకట రమణ కవి విరచిత మగు సకల వర్ణనాపూర్ణ రామాయణము, పెద్దన సోమయాజి మున్నగు ఆఱుగురు కవులచే రచింపబడిన యథా శ్లోక రామాయణము, చెన్నూరి రామన్న కవి రామాయణము, గడియారము వేంకట రామశాస్త్రి విశిష్ట రామాయణము, నరసింహ దేవర వేంకటశాస్త్రి విచిత్ర రామాయణము (చంపూ కావ్యము, 7 కాండలు.), చిల్లరిగె యోగానందయ్య పంతుల శ్రీ యోగానందాంధ్ర రామాయణము, ఆత్మకూరి గోవిందాచార్యుల గోవింద రామాయణము, కోపల్లె శివరామ కృష్ణ శర్మ శ్రీమద్రామాయణము, ఏలేశ్వరపు సుబ్రహ్మణ్య శాస్త్రి ద్విపద రామాయణము, ముడుంబై వేంకట కృష్ణమాచార్యుల ద్విపద రామాయణము, దేవణూరి వేంకటాచార్యుల రామచంద్రోపాఖ్యానము (ద్విపద-ఉత్తరరామాయణము), ఏనుగు లక్ష్మణకవి రామ విలాసము, అనంతరాజు జన్నయ కవి రచించిన రామ కథాభిరామము, దిట్టకవి పాపరాజు కవి రామకథాసారము, మిక్కిలి మల్లికార్జున కవి విరచిత మగు రామచంద్రోపాఖ్యానము, వారణాసి వేంకట కవి విరచిత మగు రామచంద్రోపాఖ్యానము, మంత్రిప్రగడ సూర్యప్రకాశము రచించిన సీతారామ చరిత్రము, వడ్డాది తిమ్మరాజు విరచిత మగు శ్రీరామావతారము (ఏకాశ్వాస ప్రబంధము), మండ కామేశ్వరశాస్త్రి రామకథాసార సంగ్రహము, చామర్తి శేషగిరిరాయ కవి రామ కథా సుధా లహరి, క్రొత్తపల్లి అచ్చయ కవి దాశరథి విలాసము, నాగలింగకవి పట్టాభిరామ విలాసము, శ్రీరామ వేంటాచలము రచించిన శ్రీ రామ కృష్ణోపాఖ్యానము, తిరుమల బుక్కపట్టణము వేంకటాచార్య కవి విరచితమగు అచలాత్మజా పరిణయము, నెల్లూరి వీరరాఘవ కవి విరచితమగు రాఘవ-యాదవ-పాండవీయము (త్ర్యర్థి కావ్యము), విలకూచి బాల సరస్వతి రచిత మగు యాదవ - రాఘవ - పాండవీయము ( త్ర్యర్థి కావ్యము), కట్టా వరదరాజు రామాభ్యుదయము, (ద్విపద), గణపవరపు వేంకటకవి బాల రామాయణము, భోసల ఏకోజీ విరచితమగు ఏకోజీ రామాయణము, చేడ రాఘవరెడ్డి రచిత

మగు రాఘవ రామాయణము, విజయరామరాజు వినుకొండ రామాయణము, తరిగొండ వేంకమాంబ వాశిష్ఠరామాయణము, రఘునాథ నాయకుని రఘునాథ రామాయణము, కూచిమంచి తిమ్మకవి అచ్చతెలుగు రామాయణము, కోటమ రాజు నాగయామాత్యుని అధ్యాత్మరామాయణము, కనుపర్తి అబ్బయామాత్యుని ఉత్తరకాండము, అవుడూరి పిచ్చయ్యకవి విరచితమగు రఘువంశము, మడికి సింగన వాశిష్ఠరామాయణము, మద్దనకవి విరచితమగు సీతారామ విజయము, మరింగంటి సింగరాచార్యుల దశరథ రాజ నందన చరితము (నిరోష్ఠ్యము), గోపీనాథుని వేంకటకవి విరచితమగు గోపీనాథ రామాయణము (7కాండలు, వ్యాఖ్యానముతో సహా), జనమంచి శేషాద్రి శర్మ ఆంధ్ర శ్రీమ ద్వాల్మీకి రామాయణము, సీరము చిత్రకవి జానకీ పరిణయము, చెఱకూరి కృష్ణకవి శృంగార రాఘవము, ఆనంద కానన రఘురామ విజయము, అప్పలరాజు సీతా చరిత్రము, నండూరి చావమంత్రి శ్రీరామ చరిత్రము. రంగయ కవి రామోదయము (6 కాండలు), కొంచనపల్లి కనకాంబ శ్రీమద్రామాయణ కథా సారము, పుట్టపర్తి నారాయణాచార్యుల జనప్రియ రామాయణము, అచ్చ తెలుగులో - పొన్నికంటి మెగనామాత్యకవి యయాతి చరిత్ర (ఇందు సందర్భోచితముగా, రామ కథను జొప్పించినాడు కవి.), అడిదము భాస్కర కవి శుద్ధాంధ్ర రామాయణము, కందుకూరి వీరేశలింగం పంతులు రచించిన శుద్ధాంధ్ర నిరోష్ట్య సీతా కల్యాణము, పిడపర్తి జనవత్స కవి విరచిత మగు నిరోష్ఠ్య సీతా కల్యాణము, అబ్బరాజు హనుమంతరాయశర్మ విరచిత మగు అచ్చాంధ్ర నిరోష్ఠ్య నిర్గద్య దాశరథి చరిత్ర, శఠకోపాచార్య రచిత మగు పట్టాభి రామాయణము (ఉత్తర కాండ), నందగిరి వేంకట అప్పారావు పంతుల ఆంధ్ర రామాయణము (ఉత్తర కాండము), కంచర్ల శరభన కవి విరచితమగు అధ్యాత్మ రామాయణము (చంపూ కావ్యము,) శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రి విరచిత మగు శ్రీకృష్ణ రామాయణము, జనమంచి శేషాద్రి

శర్మ రామాయణము, వేంకట పార్వతీశ్వర కవుల రామాయణము (అసంపూర్ణము) విశ్వనాథ సత్యనారాయణ రామాయణకల్పవృక్షము, ధనకుధరం వేంకటాచార్యుల ధనకుదర రామాయణము (బాలకాండ) కేశవ తీర్థస్వామి ఆంధ్ర రామచరిత మానసము,వచనములో-శ్రీనివాసశిరోమణి విరచితమగు వాల్మీకిరామాయణము, కల్లూరిచంద్రమౌళి రామాయణ సుధాలహరి,తెలికిచెర్ల కందాడ గోపాలాచార్యుల రామాయణ రత్నాకరము, శ్రీ భాష్యం అప్పలాచార్యులసుందరకాండ సంస్కృత మాతృకకు 'తత్త్వ దీపిక' శీర్షికతో-ఆంధ్ర వ్యాఖ్యానము, వాల్మీకి రామాయణ మూలమునకు - చలమచర్ల వేంకట శేషాచార్యుల ఆంధ్ర తాత్పర్యము ( 7 కాండలు), సురవరము ప్రతాపరెడ్డి రామాయణ విశేషములు, ఉషశ్రీ రామాయణము - మున్నగునవి ప్రశస్తములై యున్నవి.

ఇవియే గాక, మఱి యింకను ఆంధ్ర వాఙ్మయమునందే - పురాణములు, శతకములు, హరికథలు, ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు, త్యాగరాజ కృతులు, నాటకములు, యక్షగానములు, లాలి పాటలు, జోలపాటలు, మంగళ హారతులు, సుప్రభాత స్తోత్రములు, బహు పరాకులు, తోలుబొమ్మలాట కథలు, చలన చిత్రములు - మున్నగునవి-వివిధ ప్రక్రియలలో రామ చరితము - ఆంధ్ర దేశ మందంతటను వ్యాపించియున్నది.

ఇక - ప్రాంతీయ భాషలలో వెలువడిన రామాయణములను గుఱించి ఇట కొంత పరామర్శింతము :,

తమిళమున భక్త కవులుగా ప్రసిద్ధి గాంచిన సన్నిద్ధరాళ్వారులలో - తిరుమంగై యాళ్వారులు, పెరియాళ్వారులు,తిరుమళిశై యాళ్వారులు,ఆండాళ్, పొయిగై యాళ్వారులు-అను దివ్యసూరులు-రాముని చరితమునుగూర్చియు, అతని కల్యాణ గుణములను గూర్చియు - వారి వారి దివ్య ప్రబంధములలో అట నట హృదయంగమముగా వర్ణించియున్నారు. అట్టి వర్ణనముల

నన్నింటిని-12-వ శతాబ్దమున 'పెరియ వాచ్చాన్ పిళ్ళై' అను మహనీయు లొకరు-క్రమ బద్ధముగా ఏర్చి కూర్చి,దానిని ఒక సమగ్ర రామాయణముగా, సంగ్రహ రామాయణముగా రూపొందించి, దానికి - 'పాశురప్పడి రామాయణమ్' అను పేరిడి, ఆళ్వారుల రామభక్తి స్వరూపమును సుస్పష్టము గావించిరి. ఈ పాశురప్పడి రామాయణ స్వరూపమును-శ్రీ రామానుజ కీర్తి కౌమది-నాల్గవభాగము నందలి 'శ్రీ రామ కృష్ణావతారములు-ఆళ్వారులభక్తి విశేషములు' అను ఈ వ్యాసకర్త రచనను పరిశీలించి, గ్రహింపవచ్చును.

మఱి యింకను తమిళమున - రామాయణము లనేకములు వెలువడి యున్నవి. అట్టి వానిలో - కంబ రామాయణము ప్రసిద్ధమైనది. ఇయ్యది - కావ్య ప్రపంచమునందే గాక, ధార్మిక ప్రపంచము నందును పేరు గాంచి యున్నది. ఈ రామాయణ రచనచే కంబ మహాకవి - 'కవి చక్రవర్తి'యను బిరుదమును పొందగల్గెను. 9 - వ శతాబ్దమునకు చెందిన ఈ కంబ మహాకవి - వైష్ణవ హృదయముతో - రామాయణమును రచించుటేగాక, మఱి యింకను - నమ్మాళ్వారులను గుఱించియు నూఱుపాశురములలో (పద్యము లలో) ఒక స్తోత్రమును సైతము రచించి, శ్రీరంగము నందలి శ్రీవైష్ణవ పండితులందరను మెప్పించి,వారిచే కొనియాడఁబడె ననియు-ప్రతీతియున్నది.

'ఒట్టుకూత్తన్' అను కవి - తమిళమున రామాయణమును రచించి, దానిని చోళ రాజుకు విన్పించి, అ రాజుచే - 'కవి చక్రవర్తి' యను బిరుదమును పొందెను. ఆధునికులలో - 'కొట్టైయూర్ సుబ్రహ్మణ్య అయ్యర్' అను కవి - వెణ్బా వృత్తముతో - 7, 379 పద్యములుగల సమగ్ర రామాయణమును రచించెను. 'వేంకట కృష్ణ అయ్యరు' అను కవి - రఘువంశ మహాకావ్యమును తమిళమునందే రచించెను. 'పులవర్ మామునై' అను కవి - వేయి (1000) పద్యములలో, - రామాయణ మహా కావ్యమును రచించెను. 'వీరై ఆళవందార్' అను కవి - జ్ఞాన వాశిష్ఠ రామాయణమును రచించెను. ఇటీవల - 'శ్రీమతి - హా. కి. వాలమ్' అను నొక కవయిత్రి -

'ఇరామాయణ రత్నాకరమ్' అను కావ్యమును రచించెను. రాజాజీ వచన రామాయణము సుప్రసిద్ధమే కదా ! వీరలె గాక, మఱి కొందఱు కవులు, కవయిత్రులును-తమిళమున రామాయణములను వివిధప్రక్రియలలో రచించి, ప్రశస్తి గాంచియున్నారు.

కన్నడ సాహిత్యమున - పొన్నకవి విరచితమైన భాస్కర రామాయణము, నాగచంద్ర విరచితమగు రామచంద్ర చరిత్ర పురాణము, కుమార వాల్మీకి కవి తొరవె రామాయణము, కనకదాసు కృత మగురామ ధ్యాన చరితము, హెళవనకట్టె గిరియమ్మ సీతా కల్యాణము, దేవచంద్ర కవి కృతమగు రామకథావతారము, బసవ్పశాస్త్రి ఉత్తర రామాయణము - మున్నగునవి - విఖ్యాతములై యున్నవి.

కర్నాటకరాష్ట్రమందలి ధారవాడ విశ్వవిద్యాలయములో-ఇంజనీరింగు శాఖయందు ప్రస్తుతము ప్రొఫెసరుగా పనిచేయుచున్న 'నారాయణాచార్యులు' అను నొక వైష్ణవ పండిత ప్రముఖుడు - వేద వాఙ్మయ వైశిష్ట్యమును గూర్చియు, ఆళ్వారుల నాలాయిత దివ్య ప్రబంధప్రశస్తిని గూర్చియు వివరించుచు - నేటి వఱకు కొన్నిగ్రంథములను రచించి వెలువరించియుండుటే గాక, రామాయణ విశేషముల నుగ్గడించుచు- 'రామాయణ సాహస్రి' యను పేర - ఇంతకు మున్ను కొన్ని సంపుటములను కన్నడమున రచించివెలువరించియున్నారు. మఱికొన్ని సంపుటములను మున్ముందు రచించి వెలువరింపనున్నా రనియు - తెలియవచ్చుచున్నది.

మళయాళ సాహిత్యములో - రామ చరిత కట్టళక పొట్టుగళ - అనునదియే గాక, కావ్య నాటకములలో - రామ ఫణిక్కర్ కవి విరచితమగు కణ్ణకి రామాయణము, ఎళుత్తచ్ఛన్ కవి విరచిత మగు అధ్యాత్మ రామాయణము, ఉత్తర రామాయణము, పునం నంబూద్రి రచిత మగు రామాయణ చంపువు, కొట్టారకార తంబిరాన్ రచిత మగు రామనాట్టం అట్ట కథ - మొదలగునవి ప్రముఖములైనవి.

వంగ వాఙ్మయములో - విలంకి రామాయణము, ఓఝూ రామరాజు రచించిన కృత్తివాస రామాయణము, చంద్రావతి రచితములగు రామాయణ గీత, దశ్యకేన రామాయణము, రామశంకర దత్తు రచిత మగు రామశంకర రామాయణము, శంకర కవి చంద్ర రచిత మగు విష్ణు పురీ రామాయణము, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ విరచితములగుసీతావనవాస, ఉత్తరరామచరిత్ర, జయప్రసాద - రాఘవ ప్రసాద నాయకు లగు తండ్రి కొమరులచే రచింప బడిన రామాయణము, ప్రహ్లాదచంద్రవరదోపాధ్యాయ రచిత మగువాల్మీకి - ఓత త్సామయిక వృత్తాంతే, రవీంద్రనాథ ఠాగూర్ విరచిత మగు వాల్మీకి ప్రతిభ, మైకేల్ మధుసూదనదత్తు మేఘనాథ వధ్, ద్వారకానాథరాయ్ సీతాపహరణ్, కృత్తివాస ఓఝూ విరచితములగు సీతా రబారమాన్య,లక్షణేక శక్తి శేల, రామతావ, అద్భుత రామాయణ-అనునవియు ప్రాముఖ్యమును పొందియున్నవి.

పంజాబీ సాహిత్యములో - 'రామ లీల' నాటకము ప్రశస్తమైనది.

మహారాష్ట్రీ భాషలో - నరహరి సోమనార్ కవి రచిత మగు రసాళ రామాయణము, సమర్థ రామదాసస్వామి విరచితము లగు సుందరకాండము, యుద్ధ కాండము, జయరామస్వామి వడగాంకర్ కవి విరచిత మగు సీతా స్వయంవర్, మోరోపంత్ రచన లగు లవకుశాఖ్యానము, పద్మ రామాయణము, రామ రామాయణము, సీతా గీతము, మంతర రామాయణము - ఇత్యాదులు ప్రశస్తము లైనవి.

హిందీలో - తులసీదాస కృత మగు రామచరిత మానసము సుప్రసిద్ధ మైనది.

ఇట్లే - భారతీయ భాష లన్నింటి యందును - రామ చరితము వివిధ ప్రక్రియలలో రచింపబడి, ప్రశస్తి గాంచియున్నది.

# 15. రామాయణ ప్రభావము

" రామాయణ మహాకావ్యం - కృతం వాల్మీకినా స్వయమ్
తత్ర రామ చరిత్రస్య - వ్యపదేశేన సర్వశః
సర్వే ధర్మాః సముద్దిష్టాః - వర్ణాశ్రమ విభాగశః
నానాదేశ చరిత్రాణి - శత్రు మిత్ర కథాని చ
ఇతిహాస స్వరూపేణ - సర్వే ధర్మాః నిరూపితాః. "

రామాయణ మహాకావ్యము వాల్మీకి మహర్షి చే రచింప బడినది. ఈ రామాయణమునందు - కేవలము రాముని చరితమే గాక, వర్ణాశ్రమ ధర్మములు, అనేక దేశములకు సంబంధించిన వృత్తాంతములు, శత్రువుల యొక్కయు - మిత్రుల యొక్కయు ఇతి వృత్తములును - ఇతిహాస స్వరూపముగా - సర్వ ధర్మములును - నిరూపింపబడినవి.

ఇతిహాస మనగా -

" ధర్మార్థ కామ మోక్షాణాం - ఉపదేశ సమన్వితమ్
పూర్వ వృత్త కథా యుక్తం - ఇతిహాసం ప్రచక్షతే. "

ధర్మార్థ కామ మోక్షము లనబడు చతుర్విధ పురుషార్థముల వైశిష్ట్యమును బోధించునదియు, పూర్వ గాథలు గల్గినట్టిదియు నగు గ్రంథము - ఇతిహాస మని చెప్పబడును.

" వేద వేద్యే పరే పుంసి - జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ - సాక్షాత్ రామాయణాత్మనా. "

అట్టి లక్షణములు గల రామాయణమునందు - వేదవేద్యు డగు పరమ పురుషుడు దశరథాత్మజుడైన రాముడు కాగా, వాల్మీకి వలన - వేదము రామాయణ మయ్యెను. కావుననే-రామాయణము ఒక ధర్మ శాస్త్రముగా, ఒక మంత్ర శాస్త్రముగా, ఒక శరణాగతి శాస్త్రముగా విశ్వ విఖ్యాతి నార్జించి, విలసిల్లగల్గెను.

" ఇదం రామాయణం కృత్స్నం - గాయత్రీ బీజ సంయుతమ్
త్రిసంధ్యం యో పఠే న్నిత్యం - సర్వ పాపైః ప్రముచ్యతే
ఐశ్వర్యం పుత్ర లాభ శ్చ - భవిష్యతి న సంశయః
రామాయణ మిదం కృత్స్నం శృణ్వతః పఠత స్సదా. "

గాయత్రీ మంత్ర బీజముతో గూడినట్టియు, పవిత్రమైనట్టియు నగు ఇట్టి యీ రామాయణమును - మూడు వేళలందును నిత్యము ఎవడు పఠించునో, అతడు - సర్వ పాపములనుండి విముక్తు డగును. అదియునుగాక, ఈ రామాయణ పఠనము వలనను, శ్రవణము వలనను - ఐశ్వర్యము, పుత్ర లాభము కూడ తప్పక కలుగును. సంశయము లేదు.

" ఇదం పవిత్రం పాపఘ్నం - పుణ్యం వేదై శ్చ సమ్మితమ్
యః పఠే ద్రామ చరితం - సర్వ పాపైః ప్రముచ్యతే. "

పవిత్రులను చేయునట్టియు, పాపములను హరించు నట్టియు, పుణ్య ఫల మొసంగునట్టియు, వేదములతో సమతుల్యమైనట్టియును అగు రామాయణమును ఎవడు పఠించునో, అతడు - సర్వ పాపముల నుండి విముక్తు డగును.

" యావత్ స్థాస్యంతి గిరయః - సరిత శ్చ మహీతలే
తావ ద్రామాయణ కథా - లోకేషు ప్రచలిష్యతి. "

ఈ భూమండలము నందు - పర్వతములు, సముద్రములు - ఎంత కాల ముండునో - అంత కాలము వఱకు రామాయణ వృత్తాంతము లోకమున వ్యాపించి యుండ గలదు.

## 16. మహా భారత వైశిష్ట్యము

" అలంకృత శ్శుభై శ్శబ్దైః సమయై ర్దివ్య మానవైః
ఛందోవృత్తై శ్చ వివిధై రన్వితం విదుషాం ప్రియమ్. "
— (ఆది పర్వము : 1 - 27)

శుభ శబ్దములతో - దేవతల యొక్కయు, మానవుల యొక్కయు సమయములతో అలంకృతమై, వివిధములైన వృత్తములతో రచింపబడిన మహాభారతము - విద్వాంసులకు ప్రీతికరమైనది. '

అట్టి లక్షణములు గల మహాభారతములో - 1) ఆది పర్వము 2) సభా పర్వమ 3) అరణ్య పర్వము 4) విరాట పర్వము 5) ఉద్యోగ పర్వము 6) భీష్మ పర్వము 7) ద్రోణ పర్వము 8) కర్ణ పర్వము 9) శల్య పర్వము 10) సౌప్తిక పర్వము 11) స్త్రీ పర్వము 12) శాంతి పర్వము 13) అనుశాసనిక పర్వము 14) అశ్వమేధ పర్వము 15) ఆశ్రమ వాస పర్వము 16) మౌసల పర్వము 17) మహాప్రస్థాన పర్వము 18) స్వర్గారోహణ పర్వము - అను పదునెనిమిది పర్వములు గలవు.

" ధర్మ శాస్త్రజ్ఞులు ధర్మ శాస్త్రం బని
అధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రం బని
కవి వృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహ మని
ఐతిహాసికులు ఇతిహాస మనియు
పరమ పౌరాణిక్ బహుపురాణ సముచ్చ
యం బని - మహి గొనియాడుచుండ

వివిధ తత్త్వవేది - వేదవ్యాసు
డాది ముని - పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగచుండ జేసె భారతంబు. "

అట్టి మహాభారతమును - వివిధ తత్త్వజ్ఞుడు, విష్ణుస్వరూపుడు నైన వేద వ్యాసుడు - ధర్మ శాస్త్రముగా, వేదాంత శాస్త్రముగా, నీతి శాస్త్రముగా,

మహా కావ్యముగా, సర్వ లక్షణ సంగ్రహముగా, ఇతిహాసముగా, బహు విధ పురాణ సముచ్చయముగా రచించెను.

## 17. వివిధ భాషలలో – మహా భారతములు

సంస్కృత భాషలో – వేదవ్యాసుడు రచించిన మహాభారతమే గాక, భాస మహాకవి రచితము లగు మధ్యమ వ్యాయోగము, పంచరాత్రము, దూత వాక్యము, దూత ఘటోత్కచము, కర్ణ భారము, ఊరు భంగము – అను నాటకములు ప్రశస్తములైనవి. అవియునుగాక, శకుంతలా దుష్యంతుల కమనీయ గాథను కాళిదాస మహాకవి – 'అభిజ్ఞాన శాకుంతలము' అను పేర – నాటక ప్రక్రియతో – రసవత్తరముగా రచించెను.

తెలుగులో – నన్నయ, తిక్కన, ఎఱ్ఱన – అను కవిత్రయముచే – సంస్కృతమునుండి అనువదింపబడిన ఆంధ్రమహాభారతము సుప్రసిద్ధము.

పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు – అను కవి - జైమినీ భారతము (అశ్వమేధ పర్వము)ను రచించెను.

తమిళములో – 1) భారత వెణ్బా 2) విల్లి భారతము 3) అరనిలై విశాఖ భారతము 4) శల్లా పిళ్ళై భారతము 5) ఆదిపర్వత అందాది 6) భారత మణిమాలై 7) భారత అమ్మానై 8) భారత సారమ్ 9) భారత సురిక్కమ్ 10) భారత తిరుప్పుగళ్ 11) భారత తాత్పర్య సంగ్రహమ్ 12) భారత నాటకమ్ 13) భారత విలాసమ్ 14) మహాభారత కీర్తనై 15) మహా భారత కుమ్మి 16) మహా భారత శతకమ్ 17) మహాభారత నచ్చుబొప్పియిగై విలాసమ్18)మహా భారతవచనమ్ 19)విల్లి భారతవచనమ్ 20) వ్యాసర్ విరుంచు 21) వచన మహాభారతమ్ 22) మహా భారతమ్

23) ఆంధ్ర మహా భారతమునకు తమిళానువాదము - మున్నగునవి అనేకములు వెలువడియున్నవి.

అట్టివానిలో 'విల్లిపుత్తూరర్' అను కవి శేఖరునిచే రచింపబడిన మహాభారతము - అగ్రగణ్యమైనదిగా సంభావింపబడుచున్నది. ఇందు-సంస్కృత శబ్దములు విరివిగా ప్రయోగింపబడుటయే ఇందులకు కారణము.

ఈ 'విల్లిపుత్తూరర్' మహాకవి - 'వీరరాఘవాచార్యులు' అను-వైష్ణవ పండితుని తనయుడు. ఆశుకవిగా, మహాభారత రచయితగా - తమిళ వాఙ్మయ క్షేత్రమున - అఖండ యశమును సముపార్జించిన మహామనీషి. ఈ మహాకవిని 'భారతియార్' అను మఱియొక తమిళ కవిశేఖరుడు - తన గ్రంథములలో - బహుధా ప్రశంసించియున్నాడు.

కన్నడమున - 'విక్రమార్జునీయ' మను పేర - ప్రాచీన భారతము వంటి భారతములు రెండు కలవు. తెలుగులో - కవిత్రయ భారతము వంటి భారతము - కన్నడ భాషలో మఱియొకటి కలదు. ఈ విధముగా - వివిధ భాషలలో గల మహాభారతములకు మూలాధారమైన వ్యాస భారతము నందలి భీష్మ పర్వమున - ముముక్షువులకు జ్ఞానోపదేశము గావించు 'భగవద్గీత' - భాసించుచున్నది.

" వేదేషు పౌరుషం సూక్తం - ధర్మశాస్త్రేషు మానవమ్
భారతే భగవద్గీతా - పురాణేషు చ వైష్ణవమ్. "

వేదములలో - పురుషసూక్తము, ధర్మశాస్త్రములలో - మను ధర్మశాస్త్రము, భారతములో - భగవద్గీత - పురాణములలో - విష్ణు పురాణము - ప్రముఖములై యున్నవి.

విష్ణు భగవానుడే వ్యాసుడను పేర్షనవతరించెను. గీత నుపదేశించిన కృష్ణుడు విష్ణువే. కృష్ణుని వదనారవిందము నుండి వెలువడిన భగవద్గీతను మహాభారతములో జేర్చి రచించిన వ్యాసుడును విష్ణువే. ఇందువలన. విష్ణు భగవానుని మహిమను జాటుటకు - అతడే అవతరించెననుట - స్పష్టము.

# 18. గీతోపదేశము

శ్రీకృష్ణ భగవానుడు శ్రీమద్భగవద్గీతా శాస్త్రమునకు ఉపదేష్ట. పాండు పుత్రు డగు అర్జునుడు ఉపదేశమును పొందు శిష్యుడు. గీతలో పదునెనిమిది అధ్యాయము లున్నవి. ఒక్కొక్క అధ్యాయమునకు ఒక్కొక్క యోగ మని పేరు. 1) విషాద యోగము 2) సాంఖ్యయోగము 3) కర్మ యోగము 4) జ్ఞాన యోగము 5) కర్మ సన్యాస యోగము 6) ఆత్మ సంయమ యోగము 7) విజ్ఞాన యోగము 8) అక్షర పరబ్రహ్మ యోగము 9) రాజవిద్యా రాజగుహ్య యోగము 10) విభూతి యోగము 11) విశ్వరూప సందర్శన యోగము 12) భక్తి యోగము 13) క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము 14) గుణత్రయ విభాగ యోగము 15) పురుషోత్తమ ప్రాప్తి యోగము 16) దైవాసుర సంప ద్విభాగ యోగము 17) శ్రద్ధాత్రయ విభాగ యోగము 18) మోక్ష సన్యాస యోగము - అను నవియే అష్టాదశ 18) యోగములు.

" సర్వోపనిషదో గావో - దోగ్ధా గోపాల నందనః
పార్థో వత్సః సుధీ ర్భోక్తా - దుగ్ధం గీతామృతమ్ మహత్. "

ఉపనిషత్తులు (108) అన్నియు ఒక గోవుగను, కృష్ణుని గోపాలుని గను. అర్జునుడు వత్సగను, ఆ వత్సకొఱ కేర్పడిన క్షీరమే గీతామృతము గను గ్రహించి, ఆ యమృతమును నాస్వాదించి, ఆనంద స్వరూపుడగు ఆ భగవానుని యనుగ్రహభాగ్యమును పొందుటయే ముముక్షువునికర్తవ్యము.

మోక్ష సామ్రాజ్య ప్రాప్తికి భక్తియే ప్రధాన సాధనము. కనుక,అట్టి మార్గమునే భగవద్గీత బోధించుచున్నది. అయ్యది సదాచారము, సత్కర్మాచరణము, జ్ఞాన సముపార్జనము, త్యాగ గుణము - మున్నగువాని వలన లభించును. ఈ యంశమును - యామునాచార్యులవారు ఇట్లు ధృవీకరించుచున్నారు :-

" స్వధర్మ జ్ఞాన వైరాగ్య - సాధ్య భక్త్యేక గోచరః
నారాయణ పరంబ్రహ్మ - గీతా శాస్త్రే సమీరితః. "

నారాయణుడే పరమాత్మ. ఆ పరమాత్మను జేరుటకు భక్తియే సాధనము. అట్టి భక్తి-స్వధర్మమునందు బుద్ధి యేర్పడుటకు-జ్ఞాన వైరాగ్యము లావశ్యకములు. ఇదియే ఆళవందారులు తమ గీతార్థ సంగ్రహమునందు గావించిన మహోపదేశము.

ఇక - భగవద్రామానుజులు - తమ గీతా భాష్యారంభమునందు గావించిన ప్రబోధము - ముముక్షువు లెల్లఱకును అవశ్య గ్రహణీయమై యున్నది.

" శ్రియః పతియై, నిఖిల హేయ ప్రత్యనీకుడై, అనంత కల్యాణ గుణ నిధియై, అపరిమిత జ్ఞానానంద స్వరూపుడై, తనకు ప్రియమును, అనురూపమైనట్టిదియు, ఎల్లప్పుడు ఏక రూపమై, చింతించుటకు సాధనము కాని దివ్యాద్భుతమైనదియు, ఎప్పుడును దోషము లేనిదియు, సౌందర్యము, లావణ్యము, యౌవనము - మొదలగు అనంత గుణములకు నిధియును, దివ్యమంగళ విగ్రహము గలవాడును, తనకు శేషత్వమునందే ఆసక్తి కలిగి, అనవధిక జ్ఞానైశ్వర్యాది గుణయుక్తు లగు అనేక సూరులచే నిరంతరము స్తుతింపబడిన చరణారవిందములు గలవాడును, వాక్కునకు - మనస్సుకును అందని స్వరూప స్వభావములు గలవాడును, నిత్య విభూతి నిలయుడును, సకల లోక సృష్టి స్థితి సంహారములు తనకు లీలగా గల పరబ్రహ్మయైన పురుషోత్తము డగు నారాయణుడు — లోకమును సృజించి, తన స్వరూపము దేవతలకు - మనుష్యులకు - ధ్యానారాధనాదులకు విషయము కా తగ దని ఆలోచించి, దయాతిశయముచేతను, ప్రేమాతిశయము చేతను - తన స్వరూపమునే దేవ మనుష్యాది శరీరములకు సదృశముగ పరిణమింపజేసి, తన స్వభావమును విడువకయే - ఆ యా లోకములలో అవతరించి, వారి వారిచే ఆరాధింపబడి, వారి కోరికలకు తగినట్లు - ధర్మార్థ కామ మోక్షము లనబడు ఫలముల నిచ్చుచు. 'భూ భారమును తొలగించుట' - అను నెపముచేత - అస్మదాదులు

సేవించుటకు భూతలమున - వసుదేవ నందనుడై యవతరించి, జను లందఱకును సృష్టి విషయుడై ఆశ్చర్యకరములైనట్టియు, లోకోత్తరములులైనట్టియు - కార్యములను జేయుచు, పూతనా శకట యమళార్జునారిష్ట ప్రలంబ ధేనుక కాళియ కేశి కువలయాపీడ చాణూర ముష్టిక తోసల కంసాదులను వధియించి, ప్రేమతో గూడిన అమృతము వంటి కటాక్షముల చేతను, మాటల చేతను తోకమును వృద్ధి గావించుచు, తన సౌందర్యాది గుణాతిశయములను వెలువరించి, క్రూరుడు - మాలాకారుడు - మొదలగువానిని పరమ భాగవతులను జేసి, 'అర్జునునకు యుద్ధోత్సాహమును కలుగజేయుట యను నెపముచేత - పరమ పురుషార్థమును, మోక్షమునకు సాధన మగు వేదాంత ప్రతిపాదితమైన భక్తియోగమును ప్రకటింపజేసెను. అచట-పాండవులకు, కౌరవులకును సంబంధించిన యుద్ధ భూమిలో - ఆరంభమునందే - సర్వేశ్వరు డగు తాను - లోకోపకారార్థముగ - మనుష్యాకారమును ధరించిన పురుషోత్తముడు - ఆశ్రిత వాత్సల్య పరవశుడై, అర్జునుడు రథిగా, తాను రథ సారధిగను - జను లందఱు చూచుచుండగా జేసెను."

ఇత్యాదియే - శ్రీమద్రామానుజ యతిసార్వభౌములు భగవద్గీతా భాష్యారంభమునందు గావించిన మహోపదేశము. దీనివలన, గీతావతరణ కారణము సులభ గ్రాహ్యము.

## 19. గీతార్థ సారము

భగవద్గీతలో - ముఖ్యముగా-కర్మ, జ్ఞాన, భక్తి, ప్రపత్తులు బోధింపబడినవి :-

**కర్మ యోగము :-**

మానవుడు చేయు ఏ కర్మయేని - తనకు,ప్రపంచమునకును, తనకు, పరమాత్మకును - సర్వ విధముల తగినదియై, తనకు కించిన్మాత్రమేని కీడు కలిగించక, ఇతరులకును హానికరము గాక, పరమాత్మకు ప్రీతిని కలిగించునదియై యుండవలెను. దేహధారి యగు జీవుడు - తా నొక బంధములో

మున్నట్లును, తా నా బంధమును వీడి,తన నాథు డగు పరమాత్మను జేరుటకు తగిన సత్కార్మలనే ఆచరింపవలె ననియు తెలియవలెను. అట్టి ఆచరణ మునే కర్మయోగ మని భగవద్గీత నిర్వచించుచున్నది.

**జ్ఞాన యోగము :—**

" మోక్ష సాధన సామగ్ర్యాం - భక్తి రేవ గరీయసీ. "

అనునట్లు - మోక్ష సామ్రాజ్య ప్రాప్తికి — భక్తియే ప్రధాన సాధనము.అట్టి భక్తి కలవాడు - తత్త్వ త్రయ జ్ఞానము కలిగియుండవలెను.

తత్త్వ త్రయ మనగా - 1) చిత్తు (జీవాత్మ) 2)అచిత్తు (ప్రకృతి), ఈశ్వరుడు (పరమాత్మ) - అనునవి.

ఇట్టి తత్త్వ త్రయమునకు సంబంధించిన పరిజ్ఞానము - ప్రతి మాన వునకు ఆవశ్యకము.

నే నెవరు ? ప్రకృతి యేమి ? పరమాత్మ యనగా నేమి—ఈ మూడు ప్రశ్నలకును - తగిన సమాధానముల నెఱుంగుటయే తత్త్వత్రయజ్ఞానము.

**భక్తి యోగము :—**

భగవంతుని భజించుటయే భక్తి.భజించుట యనగా—'భజ సేవాయాం' అను ధాతువును బట్టి, భగవంతుని సేవించుటయే భక్తి. ఇట్టి భక్తి కలవారు భక్తులు.

ఈ భక్తులు - ఆర్తుడనియు, జిజ్ఞాసువనియు, అర్థార్థి యనియు, జ్ఞాని యనియు నాలుగు విధములుగా నుందురు.

1) అనారోగ్యము వలన గాని, ధన నష్టము వలనగాని, ప్రాణాయా మము వలన గాని - విపత్కర పరిస్థితిలో నుండువాడు ఆర్తుడు.

2) జ్ఞానమును పొందువాడు జిజ్ఞాసువు.

3) ఏదియో యొక వస్తువును గాని, ద్రవ్యమును గాని అపేక్షించు వాడు - అర్థార్థి.

ఎట్టి ప్రయోజనమును అపేక్షింపక, బ్రహ్మజ్ఞానము గలవాడు జ్ఞాని.

ఈ నలుగురిలో - 'జ్ఞాని' యగు వాడు శ్రేష్ఠుడు. అట్టి జ్ఞాని - భగవంతునితో నిత్య సంబంధము గల్గి, భక్తి యోగము ననుష్ఠించుచుండును. ఇట్టి వాడే ఉత్తముడు.

ప్రపత్తి యోగము :-

భగవంతుడుడు కల డన్న బుద్ధి కలవాడై, ఆ భగవంతునకు భక్తుడై, ఆ స్వామిని ఆరాధించుచు, అయనకు నమస్కరించువాడు - ఆ భగవానుని యనుగ్రహమునకు పాత్రుడు కాగలడు.

ధర్మాధర్మములను విడచి, పరమాత్మను శరణు పొందవలెను, సర్వ పాపములను హరించును. అపుడె మోక్ష సామ్రాజ్య ప్రాప్తి.

ఇదియే గీతార్థ సారము.

## 20. ఫల శ్రుతి

రామాయణ-మహాభారతములు రెండును - మానవాళికి రెండు పెన్నిధుల వంటివి. ఇయ్యవి - ఇహపర సాధకములైన ధర్మసూక్ష్మము లనేకములను బోధించుచుండుటయే ఇందులకు కారణము.

" రామో విగ్రహవాన్ ధర్మః. "

అనునట్లు - ధర్మ స్వరూపుడగు శ్రీరాముని రామాయణము మనకు దర్శింపజేయుగా -

" కృష్ణస్తు భగవాన్ స్వయమ్. "

అనునట్లు - ప్రేమ స్వరూపుడైన శ్రీకృష్ణ పరమాత్మను మనకు మహా భారతము దర్శింపజేయుచున్నది.

అట్లే, రామాయణము మనకు మానవ ధర్మముల నుపదేశించుచు - ఆదర్శ దంపతులను, ఆదర్శ సోదరులను, ఆదర్శ భక్తులను, ఆదర్శ రాజ్యమును (రామ రాజ్యమును) చూపగా, మహా భారతము మనకు - సంసార సముత్తారక మగు శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమును ప్రసాదించుచున్నది. కావున, ఇట్టి రామ కృష్ణావతారముల వైశిష్ట్యము - వర్ణనాతీత మని, ఆస్తిక మహాశయులెల్లరును గ్రహింప గలరు గావుత !



ఒక గమనిక :-

'వాసు దాసు' అను నామాంతరము గల వావిలికొలను సుబ్బారావు - ఈ 20 - వ శతాబ్దమునందే - సంస్కృత భాషలో గల వాల్మీకి రామాయణమును ఛందో బద్ధమైన పద్య కావ్యముగ ఆంధ్ర భాషలోనికి అనువదింప, అది - 'ఆంధ్ర వాల్మీకి రామాయణము' అను పేర ప్రసిద్ధమై, ఈ మహాకవికి 'ఆంధ్ర వాల్మీకి' యను బిరుదమును చేకూర్చెను. అదియును గాక, ఈ మహనీయుడు వాల్మీకి రామాయణమునకు - 'మందరము' అను పేర ఒక విపుల వ్యాఖ్యానమును సైతము రచించి, విఖ్యాతి గాంచెను. — వ్యాసకర్త.

# శ్రీమద్రామానుజులు - శ్రీభాష్యము

## (చతుర్థాధ్యాయ - ఉత్తరార్థము)

న్యాయ విద్వాన్ - వేదాంత విద్వాన్
సాహిత్య విద్యా ప్రవీణ - సాహిత్య రత్న
ప్రవచన వాచస్పతి - మహోపన్యాసక - విశిష్టా శిష్టామణి - పౌరాణిక కేసరి
**శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు,** ఎం. ఏ; బి. ఓ. యల్.



## (చతుర్థాధ్యాయ - తృతీయ పాదము)

## 1. అర్చిరా ద్యధికరణము

శ్రీభాష్య చతుర్థాధ్యాయ తృతీయ పాదమునకు - 'గతి పాద' మని వ్యవహారము. రెండవ పాదమున ఇంతవఱకును ఉపాసకుని ఉత్క్రాంతి చర్చింపబడినది. 'ఉత్క్రాంతి' యనగా - ప్రయాణ ప్రారంభము. మూర్ధన్య నాడీ నిష్క్రమణానంతరము జరుగునది ప్రయాణము. ఈ ప్రయాణమే ఇక ఈ పాదమున చర్చించబడును. ఈ నాల్గవ అధ్యాయము మొత్తము బ్రహ్మ విద్యానిష్ఠుని ఫలమును నిరూపించునది కదా! దానిలో - మొదటి రెండు పాదములలో విద్యా నిష్ఠునకు స్థూల శరీర సంబంధమున్నపుడు కలుగు ఫలితము నిరూపించబడినది. అందునను - మొదటి పాదమున - పూర్వ కర్మ క్షయము, ఉత్తర కర్మల అశ్లేషము వివరింపబడినవి. రెండవ పాదమున - మూర్ధన్యనాడీనిష్క్రమణము, సూర్యకిరణ సంబంధము విశదీకరింపబడినవి. ఇక సూక్ష్మ శరీర సంబంధమున కలుగు ఫలితము నిరూపింపబడును. అందునను - ఈ గతి పాదమున విద్యా నిష్ఠునకు అర్చిరాది అతివాహికుల ద్వారా కలుగు బ్రహ్మలోక ప్రాప్తియు, చివరిపాదమున తత్ప్రాప్తిఫలభూత మగు పునరావృత్తి రహిత భోగము - నిరూపింపబడును.

కరణ్మైమదాద్యాధికరణమున విద్యా నిష్ఠునకు నాడీనిష్క్రమణానంత రము సూర్యకిరణ సంబంధము చెప్పబడినది. తరువాతి రెండు అధికరణ ములు - ప్రాసంగికములు. కనుక, గత్యుపక్రమము అత్యపూర్వము నిరూ పితము. ఇక, అవశ్య వక్తవ్యాంశము గతి. కనుక, అవసర సంగతితో ఈ పాదము, ఈ యధికరణము కూడ ఆరంభింపబడవచ్చును. అర్చిరాది మార్గ విశేషమే ఈ యధికరణమునకు విషయము. ఛాందోగ్యములో-"అథ యదు చాస్మిం చ్ఛవ్యం కుర్వంతి యది దనార్చిషమే వాభిసంభవతి " అని, బ్రహ్మ విద్యానిష్ఠునకు అర్చిరాది మార్గగతి ఉపదేశింపబడినది. దీనినే - 'దేవ పథ' మనియు, 'బ్రహ్మ పథ' మనియు ఈ ఉపనిషత్తు నిర్దేశించినది. బృహదా రణ్యకము - "య ఏవ మేతద్విదుః యే చే మే అనన్యే శ్రద్ధాతప ఇత్యుపా సతే" అని ఆరంభించి, సంవత్సరమునకు బదులుగా - దేవలోకమునుచేర్చి, అర్చిరాది మార్గము నుపదేశించినది. ఇట్లు ఈ యధికరణమునకు విషయ మగు అర్చిరాది మార్గమును అనేకము లగు ఉపనిషత్తులు అనేక రీతులుగా ఉపదేశించినవి. వీని యన్నింటియందును ఉపదేశింపబడిన అర్చిరాదిమార్గ మొక్కటియే యనియు, అ మార్గ ద్వారముననే ముక్తుడు పయనించు నను నియమమును చెప్పనగునా ? లేక, ఇవి వేర్వేరు మార్గములే యని పేర్కొని, ముక్తుడు ఏ మార్గ ద్వారముననైనను పయనింపవచ్చునను నియమమును చెప్పనగునా ? అని సంశయ మేర్పడును. పరస్పర నిరపేక్షముగ అనేకము లగు ఉపనిషత్తులు అనేక విధములుగా జెప్పుచున్నందున, ముక్తుడు ఈ మార్గము ద్వారముననే పయనింపవలసి యుండు నను నియమ మేమియు చేయ నవసరలే దనుచున్నాడు పూర్వపక్షి.

ఉపనిషత్తు లన్నింటియందును ఉపదేశింపబడిన అర్చిరాది మార్గ మొక్కటియే. కనుక, ముక్తుడు అర్చిరాది మార్గ ద్వారముననేపరమాత్మను పొందగల డను నియమమును చెప్పవచ్చునని సూత్రకారుడువక్కాణించును. ఏదియో కొంత మార్పు కానవచ్చినను, అర్చిరాది మార్గమే ఉపనిషత్తు

లన్నింటి యందుచు నిరూపింపబడిన దని గురుతుపట్టవచ్చును కదా! కొన్ని తావులలో కానవచ్చిన విశేషములను - అవి కానరాని తావులలో ఉపసంహరించుకొనవచ్చును. ఛాందోగ్యమునకు, పంచాగ్ని విద్యయందును, ఉపకోసల విద్యయందును అర్చిరాది - ఒకే విధముగా నున్నది. బృహదారణ్యకమునందును, పంచాగ్ని విద్యయందును-కొలది మార్పుతో కానవచ్చుచున్నది. కనుక, ఇవియు-అర్చిరాది మార్గ మనియే తప్పక గుర్తించ వచ్చును. ఇందువలన, అర్చిరాది మార్గము ఒక్కటియే యనియు, ముక్తుడు ఆ మార్గద్వారముననే బ్రహ్మప్రాప్తిని నిర్ణయించవచ్చు ననియు సిద్ధాంతి తాత్పర్యము.

## 2. వాయ్వధికరణము

అవసర సంగతి తోడనే ఈ యధికరణము ఆరంభింపబడుచున్నది. ముక్తుడు అర్చిరాది మార్గములో-ఛాందోగ్యము మాసానంతరము సంవత్సరమును పేర్కొనుచున్నది. బృహదారణ్యకము-దేవ లోకమును పేర్కొనుచున్నది. ఐనచో - మాసానంతరము సహజముగ సంవత్సరమునకే ఉపస్థితి యుండును. కనుక, సంవత్సరానంతరము దేవలోకము చేరు నని చెప్పవలసియుండును. ఐనచో - ఈ బృహదారణ్యకమే మఱి యొక తావున - ఆదిత్య లోకమున కంటెను పూర్వము వాయువును పేర్కొనియున్నది. వాయువునకు పిమ్మట ఆదిత్యుని చేరునని అపుడు చెప్పవలసి యుండును. ఇట్లు సంవత్సరమునకు పిమ్మట, ఆదిత్యునకు పూర్వము దేవ లోకమును, వాయు లోకమును చేరవలసి యున్నది. కౌషీతకిలో నైనచో - అగ్నిలోకముగా నిర్దిష్టమైన అర్చిషీకి తరువాత, వాయువు పేర్కొనబడినది. కనుక, ఆదిత్యుని పూర్వవర్తిత్వము వాయువునకు చెప్పుటలో వైరుధ్య ముండదు. ఇక, ప్రకృతములో ఏర్పడిన సంవత్సరానంతరము ఆదిత్యునకు పూర్వము నిర్దేశింపబడిన దేవలోక వాయువులను చేరుటలో - పౌర్వాపర్య మున్నదా? యథేష్టముగ చేరవచ్చును. వాస్తవమునకు దేవలోక వాయువులు వేర్వేరా? లేక - ఒకటియే యగునా ? అని సంశయ మేర్పడవచ్చును. ప్రసిద్ధిని బట్టి,

వాయువు వేరు, దేవలోకము వేరు. దేనిని మొదట చేరవలెనో నిర్దేశింప లేదు. కనుక, యథేష్టముగ దేనినైనను ఒకదానిని ముందును, మఱియొకదానిని తరువాతను చేరవచ్చును – అని పూర్వపక్షము.

దేవలోకము, వాయువు వేర్వేరు కావని బాదరాయణుని సిద్ధాంతము. దేవలోక శబ్దము సామీప్య రూపమున వాయువును చెప్పుచున్నది. దేవలోక మనగా - దేవతల నివాస స్థానము. "యో ఽ యం పవతే ఏష దేవానాం గృహాః" అని శ్రుతి యొక తావున – వాయువు దేవతల గృహ మని చెప్పు చున్నది. అందువలన, దేవలోకము వాయువే సుమా ! కౌషీతకి ఉపని షత్తులో – వాయులోక మనియే నిర్దేశము కలదు. వాయులోక మనగా – వాయు రూప మగు లోక మని యర్థము. అందువలన, సంవత్సరమునకు పిమ్మట-ముక్తుడు వాయులోకము చేరి, అటనుండి – ఆదిత్యుని వద్దకు చేరు ననియే చెప్పవలె నని బాదరాయణుని సిద్ధాంతము.

## 3. వరుణాధికరణము

అర్చిరాది గతి చింతనమే ప్రకృతము కనుక, అధికరణము కూడ అంతర సంగతి తోడనే ఆరంభింపబడుచున్నది. అర్చిరాది గతి క్రమము – అర్చిష, దిన, పూర్వపక్ష, మాస, సంవత్సర వాయువుల వఱకు నిర్ణయింప బడినది. కౌషీతకి ఉపనిషత్తులో – వాయువు తరువాత, వరుణాదిత్య ఇంద్ర ప్రజాపతి బ్రహ్మ లోకములు వరుసగా వర్ణింపబడియున్నవి. వీనిలో – వాయువు – సంవత్సరమునకు పిమ్మట,ఆదిత్యునకు పూర్వము చేరవలయు నని చెప్పబడినది. ఇక, ఆదిత్యు డీ యుపనిషత్తులో-వరుణునకు తరువాత, ఇంద్రునకు పూర్వము – పరిచయము చేయబడియున్నాడు. కాని, "దేవ లోకావాదిత్యాది ఆదిత్యా ద్వైద్యుతమ్ " అని, బృహదారణ్యకోపనిషత్తు – ఆదిత్య స్థానము వాయువునకు తర్వాతిగను, విద్యుత్తుకు పూర్వపుదిగను బోధించుచున్నది. కౌషీతకిలో – కేవలము పాఠము మాత్రమే ఉన్నది.

కూడ ప్రబలములు కదా ! అందువలన, వాయువునకు పిమ్మట - ఆదిత్య స్థానమే పేర్కొన వలసి యున్నది.

ఇక, వరుణ - ఇంద్ర - ప్రజాపతుల పౌర్వాపర్యమే ఈ యధికరణములో నిర్ణయింపవలసిన యంశము. ఈ వరుణాదులు పాఠక్రమముననుసరించియే పౌర్వాపర్యమును కలిగియుండవలెనా? లేక, వాయువు ఆదిత్యవిద్యుత్తులకు క్రమము శ్రుతిపాదితమై యున్నందున ప్రతి విద్యుత్తునకు తర్వాతి స్థానము కలిగియుండవలెనా ? అని సంశయ మేర్పడును. "అర్చిషోహః" ఇత్యాదిగా విద్యుత్తు వఱకును-శ్రౌతక్రమము కానవచ్చుచున్నది. విద్యుత్తునకు పిమ్మట అమానవ పురుషుని ద్వారా బ్రహ్మప్రాప్తి ఉపదేశింపబడి కనుక, వరుణాదులకు ఎచ్చటేని స్థానమును కల్పించు నవకాశము కానరాదు. మఱి శ్రుతి చెప్పినందున, ఎచ్చటేని స్థానమును వీనికి కల్పింపవలెకదా ! అందువలన, పాఠక్రమము ననుసరించి, వాయువునకు తరువాతనే వరుణునకు స్థానమును ఏర్పరచవలసియున్నది. అనంతరము, ఆదిత్య-చంద్ర - విద్యుత్తులకు స్థాన మేర్పడును. ఇట్లు పూర్వపక్షి - తన యభిప్రాయమును వ్యక్తము గావింపవచ్చును. కాని, ఈ యభిప్రాయము సరియైనది కా దని విమర్శించును సూత్రకారుడు. వరుణునకు విద్యుత్తునకు పిమ్మటనే స్థాన మిచ్చుట న్యాయము. పాఠక్రమమున కంటెను అర్థక్రమము ప్రబలము కదా ! మేఘోదకములో పుట్టిన విద్యుత్తు-వెలుపలయే ప్రసరించును. కనుక, మొదట విద్యుత్తును, అటు పిమ్మట మేఘములోని జలమునకు అధిదేవత యగు వరుణుని చేరుటయు సముచితము. అందువలన, విద్యుత్తునకు పిమ్మటనే వరుణునకు స్థానమును కల్పించుటలో ఔచిత్యము కన్పట్టును. ఇటుల విద్యుత్తునకు అమానవ పురుషుడు బ్రహ్మను చేర్చుటకై నడుమ - వరుణునితో వ్యవధానమును సహింపవలసి వచ్చినది. కావున, వరుణుని యనంతరము పేర్కొనబడిన ఇంద్ర - ప్రజాపతులను నైతము స్వీకరించుట సమంజసము. కనుక, ముక్తుడు బ్రహ్మను చేరు

మార్గము ఈ రీతిగా నిర్ణయింపబడినది. ఎట్లనగా – అర్చిష, దిన, శుక్ల పక్ష, ఉత్తరాయణ, సంవత్సర, వాయు, సూర్య, చంద్ర, విద్యుత్, వరుణ, ఇంద్ర, ప్రజాపతులను చేరి, అమానవుని ద్వారా బ్రహ్మను పొందవలెనని. ఇదియే ఈ యధికరణ సిద్ధాంతము.

## 4. ఆదివాహికాధికరణము

అర్చిరాది విచారమే ప్రకృతము కావున, ఈ యధికరణము అవసర సంగతితోనే ఆరంభించబడుచున్నది. ఇందు – అర్చిరాదులే విషయము. ఈ అర్చిరాది మున్నగునవి మార్గ చిహ్నములా ? భోగ భూములా ? లేక, ముక్తుని – ముందు ముందుకు తీసుకొని పోవు దేవతలా ? అనునది సంశయము. ఇయ్యది – చిహ్నముల వలెనే కన్పట్టుచున్నవి – అని ఒక పూర్వ పక్షము, ఏల ననగా, ఉపదేశించిన పద్ధతి – అట్లు కన్పట్టు చున్నది. లోకములో కూడ, మార్గమును స్తుతించునప్పుడు, చెప్పునప్పుడు – 'ఆ పర్వతము వద్ద కేగి, అటనుండి ఆ నదిని దాటి, అట నుండి ఆ ఊరికి చేరవలెను' అని చెప్పుట పరిపాటి. అట్లే, ఈ అర్చిరాదులు కూడ చెప్పబడినందున, 'ఇవి మార్గ చిహ్నములే' అనునది ఒక పూర్వ పక్షము. లేక, వీనిని – 'భోగ భూములు' అని భావించుటలో ఔచిత్య ముండును. ఏల ననగా, అహరాదుల కాలములు కదా ! కనుక, వీనిని మార్గ చిహ్నము లనుట – సముచితముగా గన్పట్టును. అహరాదులను లోకములనుగా నిర్దేశించుట – శ్రుతులలో అట నట కానవచ్చుచున్నది. " ఏత ఏవ లోకా య దహోరాత్రాణి " ఇత్యాది శ్రుతివాక్యములే ఇందులకు ప్రమాణము. " అగ్ని మాగచ్ఛతి " అతి కౌషీతకి ఉపనిషత్తు – అగ్నిని లోక మనియే నిర్దేశించినది. కావున, అర్చిరాదులు-ముక్తుడు బ్రహ్మను చేరుటకు ముందు, విహరించు భోగ భూములు కావచ్చును – అని పూర్వ పక్షము.

దీనికి సమాధానముగ – " ఆతివాహకా స్తల్లింగాత్ " అని సూత్రీకరించినాడు బాదరాయణుడు. భగవంతునిచే నియుక్తులై, ముక్తుడగు వానిని

ముందు ముందుకు గొనిపోవు దేవతా స్వరూపు లగు అతివాహికులే అర్చి రాదులు. అంత్యమున, అమానవ పురుషుడు ముక్తులను బ్రహ్మ కడకు చేర్చునని కదా శ్రుతు లుపదేశించుచున్నవి ! అట్టి 'చేర్చుట' అను కృత్యమే అర్చిరాదులకును వర్తించును. ఉత్తరోత్తర ప్రాపణమే అర్చిరాది పురుషుల పని యనవచ్చును. అర్చిరాది శబ్దములు - తత్తదధిష్ఠాన దేవతలను గుఱించి చెప్పవచ్చును. ఐనచో - వైద్యుత పురుషుడే కదా బ్రహ్మను పోషించువాడు ! మఱి - తరువాతి వాడగు వరుణేంద్ర ప్రజాపతులకు అతి వాహికత్వ మెట్లు సాధ్య మగును ? అని సంశయింపవలసిన యవసరము లేదు. ఏల ననగా - వైద్యుత పురుషుడే బ్రహ్మప్రాపకుడు. అయినచో - వరుణాదులు కూడ సహకరింతురు - అని భావింపవచ్చునుగదా! అందువలన, అర్చిరాదులు ఆతివాహిక పురుషులే యని సిద్ధాంతము.

## 5. కార్యాధికరణము

ఈ పాదములో - ఈ కార్యాధికరణము పెద్దది. పది సూత్రము లీ యధికరణమున గలవు. జైమిని, బాదరాయణుడు మున్నగువారి అభిప్రాయ ములును ఇందు వివరింపబడినవి. అర్చిరాది ఆతివాహికులు బ్రహ్మవద్దకు ఉపాసకుని చేర్చు నని ఇందు నిర్ణయింపబడినది. ఎట్టి ఉపాసకుని చేర్చునో ఆ యా వివరములను ఇందు పొందుపరుపబడినది. కనుక, ఈ యధికర ణము కూడ అర్చిరాదులకు గల బ్రహ్మ ప్రాపకత్వమును పరీక్షించునట్టిదే యైనందునను, ఇయ్యది అవసర సంగతితోడనే ఆరాధింపబడుచున్న దన వచ్చును. అర్చిరాది ఆతివాహితుల బ్రహ్మప్రాపకత్వమే విషయము. ఈ అర్చిరాదులు - కార్యభూతు డగు హిరణ్యగర్భు డనబడు బ్రహ్మను ఉపా సించి, వారిని - వానివద్దకు చేర్చగలడా ? లేక, పరమాత్మను ఉపాసించిన మాత్రమే కూడ చేర్చగలడా ? అట్లే, ఆత్మను పరమాత్మయే యని భావించి ఉపాసించినవానిని సైతము చేర్చగలడా ? అని, ఈ విషయమునం దేర్పడు

సంశయముగా పేర్కొనవలసియున్నది. ఈ యంశమును గుఱించి బాదరాయణుని యభిమత మిది :–

హిరణ్య గర్భోపాసనుల ననియే కదా అతని లోకమునకు పయనింప వలసియుండును ! పరమాత్మ నుపాసించినవానికి ఎచ్చటకును పయనింపవల సిన పని లేదు. పరమాత్మ అంతటను వ్యాపించియున్నాడు కదా ! అతనిని చేరు టేమి ? చేర్చుటకు ఆతివాహికుల యవసర మేమి ? వీరికి ఉపాసన వలన కేవలము అవిద్యా నివృత్తి జరిగినచో చాలును గదా! హిరణ్యగర్భుని ఉపాసించువారికి – ఆతని లోకమునకు పయనింపవలసియుండి చేర్చునట్టి అర్చిరాదుల యవసర ముండును. " అమానవ ఏత్య బ్రహ్మలోకాన్ గమ యతి " అను బృహదారణ్యకోపనిష ద్వాక్యము – ఉపాసకుని అమానవ పురుషుడు – బ్రహ్మలోకమునకు చేర్చునని స్పష్టముగా చెప్పుచున్నది.ఇచట 'లోక' శబ్దమునకు – 'ప్రదేశ విశేష' మని యర్థము. కనుక, ప్రదేశ విశేష ములలో నుండు బ్రహ్మ యనగా – హిరణ్యగర్భు డనియేగదా తెలియు చున్నది ! పరబ్రహ్మ అంతటను వ్యాపించియుండువాడు కనుక, కొన్ని ప్రదేశ విశేషములలో నుండువాడుగా వ్యవహరింపబడదు. ఇట్లు అమానవ పురుషుడు చేర్చునది హిరణ్యగర్భుని సమీపమునకే అని. అంతియ కాదు. అచటకు చేరినవ్యక్తి – " ప్రజాపతేః సభావేదమ్ప్రపద్యే " అని, హిరణ్య గర్భుని సభను అనుసంధించుట గమనింపదగినది. పరబ్రహ్మమును చేరి నచో, విడిగా అనుసంధానము సాధ్యముకాదు కదా ! అని బాదరాయణుని అభిప్రాయము. కనుక, హిరణ్యగర్భుని ప్రతిపాదించు బ్రహ్మశబ్దమున – పరబ్రహ్మమునకు మఱింత సన్నిహితు డగుటచే " యో బ్రహ్మాణం విధ ధాతి పూర్వం " అని సాక్షాత్తుగా పరబ్రహ్మ చేతనే సృష్టింపబడినవాడు కనుక, ఆ హిరణ్యగర్భుని కూడ బ్రహ్మను చెప్పు నపుంసకముగ, బ్రహ్మ శబ్దముతో వ్యవహరింపబడినదని సమన్వయించుకొనవచ్చును.

ఐనచో – ఈ బాదరాయణుని అభిప్రాయముపై మఱియొక ఆక్షేపము రావచ్చును. అదేమనగా – ఈ అర్చిరాది మార్గమునేఉపనిషత్తు - 'దేవపథ'

మనియు, 'బ్రహ్మ పథ' మనియు పేర్కొనుచు, ఈ మార్గము ద్వారా వెడలిన వారు - తిరిగి మానవ లోకమునకు రారు' అని ఉపదేశించుచున్నది. ఇట్లే, శతాధిక నాడులద్వారా పై లోకమునకు బోయిన వారు - తత్త్వమును చెందుదు రనియు చెప్పుచున్నది. మఱి - ఈ అర్చిరాది మార్గము హిరణ్యగర్భుని చేర్చునని తలంచినచో - ఈ అపునరావృత్తి కాని, అమృతము కాని కుదురదు. ఏ మనగా:- హిరణ్యగర్భుని చేరినవారు పునరావృత్తిని చెందెదరు కదా ! బ్రహ్మలోకము కూడ ఈ బ్రహ్మదేవుని ఆయుర్దాయము ద్విపదార్ధ కాలము ముగిసినంతనే నశించు నని శాస్త్రములు పలుకుచున్నవి. కనుక, అర్చిరాది మార్గము పరబ్రహ్మప్రాపకమే కాని, హిరణ్యగర్భుని చేర్చునను బాదరాయణుని అభిప్రాయము సమంజసము కాదు' అని - ఆక్షేప సారము.

ఈ అక్షేపమునకు బాదరాయణుని సమాధాన మే మనగా :- అర్చిరాది మార్గమున ఉపాసకుడు మొదట హిరణ్యగర్భునే చేరును. అచటి లోకము నశించునపుడు - ఈ ఉపాసకుడేకాదు - ఆ లోకములోనివా రందఱును, ఆ లోకాధిపతి యగు హిరణ్యగర్భుడు కూడ - పరబ్రహ్మను చేరగలడు. ఈ విషయము - " తే బ్రహ్మ లోకేతు పరాంతకాలే పరామృతాత్ పరిమృత్యంతి సర్వే " అను తైత్తిరీయ నారాయణోపనిష ద్వాక్యము వలన తెలియుచున్నది. ఈ విషయమునే కూర్మ పురాణములోని - " బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతి సంచరే, పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరం పదమ్ " అను ప్రమాణము కూడ వివరించుచున్నది. కనుక, అర్చిరాది మార్గము హిరణ్యగర్భుని చేర్చు ననుటలో - ఆక్షేపము లేదు' - అని.

ఇట్లు బాదరాయణ మహర్షి తన అభిప్రాయమును వెలువరింప, జైమిని మహర్షి మాత్రము - అర్చిరాది మార్గము పరబ్రహ్మను చేర్చు

ననియే అంగీకరించను. మిగిలిన యంశములను గుఱించి తన అభిప్రాయ మును ఈ రీతిగా వెల్లడించుచున్నాడు - ఎట్లనగా -

" స ఏనాన్ బ్రహ్మ గమయతి " అని కదా వాక్యము ! ఐనచో - పరబ్రహ్మ అంతటను వ్యాపించియున్నను, ఒకానొక దేశ విశేషమందున్న పరమాత్మను చేరినపుడే అవిద్యా నివృత్తి యగునని శాస్త్రము వక్కాణించు చున్నది. "బ్రహ్మ లోకాన్ గమయతి " అను చోటను - బ్రహ్మ యొక్క లోకము లని యర్థము. బహు వచనమున కచట తాత్పర్యము లేదు. లేక, పరబ్రహ్మము కూడ స్వేచ్ఛా పరికల్పితము లగు అప్రాకృత లోకము లనేకము లున్నవని అన్వయించినను - దోషము లేదు. కావున, " స ఏష సంప్రసాదః అస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య" ఇత్యాది ఉపనిష ద్వాక్య ముపదేశించుచున్నందున, అర్చిరాది మార్గము పరబ్రహ్మను ఉపాసించువానికి పరబ్రహ్మ చేర్చునని చెప్పవలె ననుటయే సముచితము. అదియునుగాక, " ప్రజాపతే స్సభాం వేశ్మ ప్రపద్యే " అను తావునందును పరబ్రహ్మనే ప్రజాపతి శబ్దము చెప్పుచున్నందున, హిరణ్యగర్భుని లోక మును చేర్చు నని భావించుట యుక్తము కాదు. ఏలన, " భూత్వా శరీరం అకృతం కృతాత్మా బ్రహ్మలోక మభి సంభవామి " అను శ్రుతి ప్రమాణ మునుబట్టి, ఆ ప్రజాపతి లోకము - 'అకృత' మని తెలియుచున్నదికదా ! కనుక, పరబ్రహ్మ నుపాసించువారిని, ఆ పరబ్రహ్మయే అర్చిరాది మార్గము నకు చేర్చు నని చెప్పుట యుక్తము' అని - జైమిని మతము.

" అప్రతీకాలంబనా న్నయతీతి బాదరాయణ ఉభయథాచ దోషాత్ త త్క్రతు శ్చ " ఇది సిద్ధాంత సూత్రము. బాదరాయణుడు తన సిద్ధాంత మును ఇట్లు స్పష్టీకరించుచున్నాడు. ఎట్లనగా :- ప్రతీకోపాసనపరులను, వ్యతిరిక్తోపాసనపరులను అర్చిరాదిమార్గము పరబ్రహ్మను చేర్చును. బ్రహ్మ కాని నామాదులయందు - బ్రహ్మదృష్టినుండి చేయు ఉపాసనకు - ప్రతీకో పాసన మని పేరు. త ద్వ్యతిరిక్త మగు ఉపాసనము రెండు విధములు.

ఒకటి :- పరబ్రహ్మను పరబ్రహ్మగా ఉపాసించుట మఱి యొకటి :- పరిశుద్ధాత్మను పరబ్రహ్మాత్మకముగా నుపాసించుట. ఈ రెండు విధములగు ఉపాసకులను అర్చిరాది మార్గము తీసికొని పోగలదని బాదరాయణ సిద్ధాంతము.-" తస్య ఇత్థం విదుః యే చేమే చన్యే శ్రద్ధా తప ఇత్యు చ్యతే" అను శ్రుతివాక్యానుసారము – ప్రతీకోపాసకులకు అర్చిరాది గతి ఉపదేశింపబడలేదు. అందువలన, హిరణ్యగర్భోపాసకునకు అర్చిరాది గతి ప్రసక్తియే లేదు. కావున, బాదరాయణుని మతము అనుపపన్న మని జైమిని మహర్షి యాక్షేపము. ఒక పరబ్రహ్మోపాసకునకు మాత్రమే - అర్చిరాది గతి కలదని చెప్పుచున్నాడు జైమిని. అదియును యుక్తము కాదు. ఏల ననగా, పరమాత్మ ఆత్మగా గలవానినిగా శుద్ధాత్మను ఉపాసించువానికి సైతము అర్చిరాది గతి యున్నది కదా! కనుక – " తస్య ఇత్థం విదుః " అని, శ్రుతి ఉపదేశించుచున్నందున, ఆ చిన్మాత్రుతు డగు జీవునియందె కాని - బ్రహ్మ సృష్టినుండియు ఉపాసన చేయువానికి అర్చిరాది గతి ఉండదు. పరబ్రహ్మోపాసకులను శుద్ధాత్మను భగవంతుడే అర్చిరాదిగతి - ముక్తిస్థానమును చేర్చునని కార్యాధికరణ సిద్ధాంతము.

( చతుర్థాధ్యాయ - చతుర్థ పాదము )

## 1. సంపద్యావిర్భావాధికరణము

శ్రీభాష్య చతుర్థాధ్యాయ చతుర్థ పాదమునకు – 'ముక్తి పాద' మని వ్యవహారము. పూర్వపాదమున బ్రహ్మవిద్యానిష్ఠుడు ముక్తిధామమునుచేరు విధానము వివరింపబడినది. కావున, పూర్వ పాదముతో ఈ పాదమునకు కార్యకారణ భావమును సూచించు 'హేతుతా' అనెడు సంగతి కలదని తెలియ నగును. ఈ సంగతిని బట్టి, ఈ యధికరణమున ముక్తునకు కలుగు ఫలము నిరూపింపబడుచున్నది. ఈ యధికరణ విషయ వాక్యము-ఛాందోగ్యమునకు సంబంధించిన, " ఏష మేవైష సంప్రసాదః .... .... స్వేన రూపేణాభినిష్పద్యతే" అనునది బ్రహ్మ విద్యానిష్ఠుడు ఈ శరీరమునుండి లేచి, పరమా

త్మను చేరి, స్వస్వరూపముతో ఆవిర్భవించు' నని ఈ వాక్యార్థము. ఇచట స్వరూపావిర్భావ మనగా - బ్రహ్మ విద్యతో తానుసాధించుకొనిన ఏదియో యొక నూతన రూపమును పొందుటయా ? లేక, సహజముగా గల స్వాభావిక రూపము కలిగియుండుటయా ? అనునది సంశయము. స్వరూపాభినివృత్తి యని ఇచట పేర్కొనబడినది. బ్రహ్మవిద్యాసాధ్యమైనది ఆగంతుకమైనదియు అగు ఒక నూతన రూప మనియే అంగీకరింపవలెనని పూర్వపక్షము. స్వాభావిక స్వరూపమే యైనచో - అది యొక సాధించుకొనదగిన పురుషార్థమని తలంపరాదుకదా ! ఐనచో, కేవలము ఆత్మస్వరూపము పురుషార్థము కాకున్నను, దుఃఖ నివృత్తి యనునది సంసారమును దాటి, పరమాత్మను పొందినవారికి కలుగుచున్నది కావున, వానినే పురుషార్థ మని భావింపవచ్చును. కాని, కేవల దుఃఖ నివృత్తియు పురుషార్థము కాదు. " రస గ్గ్ హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి " ఇత్యాది ఉపనిష ద్వాక్యానుసారము - ఆనందమే పురుషార్థ మని స్పష్ట మగుచున్నది. ఆత్మ చైతన్య స్వరూపమే ఆనంద రూపము. అయ్యది - సంసార దశలో - తిరోహితమై, ముక్తిదశలో ఆవిర్భవించునని భావింపరాదు. ఏల ననగా, అదియే ఆత్మ యొక్క స్వరూప మందురుకదా ! దానికి తిరోధాన మనగా - నశించుటయే యగును. మఱి ఆత్మ స్వరూపమునకు నాశ మంగీకరింతురా! ఉన్న స్వరూపముతో అభినిష్పత్తియే ముక్తి యైనచో - స్వరూపము ఆదినుండియు ఉన్నదియే కనుక, ఇపుడు క్రొత్తగా అభినిష్పత్తి యేమి ? ముక్తి యేమి ? అందువలన, ఆగంతుక మగు ఒకానొక ఆనందమయ మగు క్రొత్త రూప మేర్పడుటయే స్వస్వరూపావిర్భావ మని - పూర్వపక్షము.

పరమాత్మను జెందిన ముక్తుడు-స్వస్వరూపముతో ఆవిర్భవించునని ఉపనిషత్తు ఉపదేశించుచున్నది. తన స్వరూపము అనగా - క్రొత్తగా సాధించుకొనినది - అనుటకు వీలులేదుకదా ! కనుక, మొదటినుండియు ఉన్న రూపముతో ఆవిర్భవించుటయే ముక్తి యనవలెను. ఆగంతుకరూప

ముతో అవిర్భవించునని భావించుట - "స్వేన రూపేణ " అను శ్రుతి వాక్యమునకు సంపూర్ణముగ విరుద్ధము కదా ! అందువలన, స్వస్వరూపావిర్భావమే ముక్తి కాని, అపూర్వ మగు - ఆగంతుక మగు మఱి యొక రూపముతో కలుగు ఫలము నిరూపింపబడుచున్నది. ఈ యధికరణ విషయ వాక్యము ఛాందోగ్యమునకు సంబంధించిన " ఏవమే వైష సంప్రసాదః.... స్వేన రూపేణాభినిష్పద్యతే " అనునది.

" బ్రహ్మవిద్యానిష్ఠుడు ఈ శరీరమునుండి లేచి, పరమాత్మను చేరి, స్వస్వరూపముతో ఆవిర్భవించును " అని ఈ వాక్యార్థము. ఇచట స్వరూపావిర్భావ మనగా, బ్రహ్మవిద్యతో తాను సాధించుకొనిన ఏదియో యొక క్రొత్త రూపమును పొందుటయా ? లేక, సహజముగా గల స్వాభావిక రూపము కలిగియుండుటయా ? అనునది సంశయము. స్వరూపాభినిష్పత్తి యని ఇచట పేర్కొనబడినది. బ్రహ్మవిద్యాసాధ్యమైనది, ఆగంతుకమైనదనియు అగు ఒక క్రొత్త రూప మనియే అంగీకరింపవలెనని పూర్వపక్షము.

స్వాభావిక స్వరూపమే యైనచో - అది యొక సాధించుకొనదగిన పురుషార్థ మని తలంపరాదు కదా ! ఐనచో, కేవలము ఆత్మస్వరూపము పురుషార్థము కాకున్నను, దుఃఖ నివృత్తి యనునది సంసారము దాటి, పరమాత్మను పొందినవారికి కలుగుచున్నది కనుక, దానినే పురుషార్థముగ భావించవచ్చునే యను శంక ఏర్పడవచ్చును. కాని, కేవల దుఃఖనివృత్తియు పురుషార్థము కాదు. " రస గ్గుహ్యేవాయం లబ్ధ్వానందీ భవతి " ఇత్యాది ఉపనిషద్వాక్యానుసారము ఆనందమే పురుషార్థ మని స్పష్ట మగుచున్నది. ఆత్మ చైతన్య స్వరూపమే ఆనంద రూపము. అయ్యది - సంసార దశలో తిరోహితమైనది. ముక్తి దశలో ఆవిర్భవించుననియు అనరాదు. ఏ మనగా, స్వయం ప్రకాశస్వరూపమనునది జ్ఞానము. అదియే ఆత్మయొక్క స్వరూప మందురు గదా ! దానికి తిరోధాన మనగా, నశించుటయే యగును. మఱి ఆత్మస్వరూపమునకు నాశ మంగీకరింతురా ? ఉన్న స్వరూపముతో అభి

నిష్పత్తియే ముక్తియైనచో, స్వరూపము ఆదినుండియు ఉన్నదే గనుక, క్రొత్తగా అభినిష్పత్తి యేమి ? ముక్తియేమి ? అందువలన, ఆగంతుకమగు ఒకానొక ఆనందమయ మగు క్రొత్తరూప మేర్పడుటయే స్వస్వరూపావిర్భావము - అని పూర్వపక్షము.

పరమాత్మను చెందిన ముక్తుడు స్వస్వరూపముతో ఆవిర్భవించునని ఉపనిషత్తు ఉపదేశించుచున్నది. తన స్వరూపము అనగా - క్రొత్తగా సాధించుకొనినది - అనుటకు వీలు లేదు కదా ! కనుక మొదటి నుండియు ఉన్న రూపముతో ఆవిర్భవించుటయే ముక్తి యనవలెను. ఆగంతుక రూపముతో అవిర్భవించునని భావించుట - "స్వేన రూపేణ" అను శ్రుతి వాక్యమునకు సంపూర్ణముగా విరుద్ధము కదా ! అందువలన, స్వస్వరూపావిర్భావమే ముక్తి కాని, అపూర్వ మగు - ఆగంతుక మగు మఱియొక రూముతో ఆవిర్భవించుట ముక్తి యనరాదని పై పూర్వపక్షమునకు ప్రత్యుత్తరము. ఐనచో, తన రూప మెప్పుడును ఉన్నదే యైనపుడు - పరమాత్మనుపొందిన తరువాత అవిర్భవించుట ముక్తి యనరాదని పై పూర్వపక్షమునకు ప్రత్యుత్తరము. ఐనాచో, తన రూప మెప్పుడును ఉన్నదే యైనపుడు, పరమాత్మను పొందిన తరువాత ఆవిర్భావ మేమి ? అని సంశయము వచ్చును. ఈ స్వరూప మెపుడును ఉన్నదేయైనను, అనాది కర్మ కృతమైన బంధమున చిక్కుకొని ప్రకాశింపదు. పరమాత్మను జెంది బంధ నివృత్తి యేర్పడినందున, స్వాభావిక రూపము ప్రకాశించును. ఆత్మజ్ఞాన స్వరూపుడు మాత్రమే కాదు. ధర్మభూత జ్ఞానము కూడ కలవాడు. ఈ జ్ఞానము - బంధ దశలో సంకోచించి, ముక్తి దశలో వికసించును కనుక, సర్వజ్ఞత్వ - సత్యసంకల్పత్వాది స్వరూపములు ముక్తి దశ యందే భాసించును. ఈ విషయములను ఛాందోగ్యము - చివరిలోని ప్రజాపతి విద్యలో - ప్రజాపతి ఇంద్రునకు చెప్పియున్నాడు. ఇచట అభినిష్పత్తి యనగా - అప్రకారముగా గల స్వరూపము ప్రకాశ దశను పొందుటయనియే తాత్పర్యము. ఐనచో, ఉన్న స్వరూపమే యైనచో, మొదటి నుండియు ఉన్నదే కదా ! బ్రహ్మ

విద్యతో సాధించిన దేమి? ఉన్న స్వరూపమే యైనచో - పురుషార్థమెట్లు? అను సంశయమున కిక ఏమాత్రము అవకాశము లేదు. " యథావక్రియతే జ్యోత్స్నా మలప్రక్షాణా న్మణేః" ఇత్యాది శ్లోకముల ద్వారా - విష్ణు ధర్మోత్తర పురాణము కూడ ఈ విషయమును వివరించుచున్నది. శుద్ధి చేసినపుడు మణావాదులలో ఏర్పడిన కాంతి - స్వాభావిక రూపమే కాని, ఆగంతుకము కాదు గదా! అట్లే, ముక్తిదశయందును స్వరూపావిర్భావమేకాని, నూతనము కాదని సిద్ధాంతము.

## 2. అవిభాగేన దృష్టత్వాధికరణము

స్వరూపావిర్భావమే ముక్తి.అది ఆత్మానుభవరూపము.పరమాత్మానుభవరూపము - అని రెండు విధము లగు అనుభవములతో పెనవేసికొనవలసియున్నది. ఆత్మానుభవ రూప మగు ముక్తిని కైవల్య మనియు, పరమాత్మానుభవ ముక్తిని మోక్ష మనియు సాధారణముగ వ్యవహరించుచుందురు. ఆత్మానుభవ మనగా - తాను శుద్ధ స్వరూపముతో ప్రకాశించుచుండుట. కనుక, ఇచట చర్చించి నిర్ణయింపవలసిన పని లేదు. ఇక, భగవదనుభవ రూప మగు మోక్షమున బ్రహ్మానుభవ ముండును కదా! అట్టి బ్రహ్మానందానుభవ విధానమును నిర్ణయించుటకు ఈ యధికరణము కారణనిరూపణమై, తత్కార్య నిరూపణ పరముగా నున్నది. ఈ కారణము వలన, ఇచటను - 'హేయతా' అను సంగతియే కలదని చెప్పవచ్చును. బ్రహ్మానుభవ మందలి విషయము. ముక్తుడు - పరమాత్మను అనుభవించును కదా! అట్టిదశలో - "సామ్య ముపైతి" ఇత్యాది శ్రుతివాక్యమును బట్టి, తనను పరమాత్మసామ్యముని తెలియుచున్నందున,పరమాత్మకంటెను తనకు విభక్తుని వలెనే,వేరుగా నున్నవానివలెనే భావించునని పూర్వపక్షము

ఇందులకు బాదరాయణుని సిద్ధాంత సూత్రము - "అవి భాగేన దృష్టత్వాత్ " అనునది. అంతర్యామి బ్రాహ్మణాదులలో గాని, వాక్యాన్వయాధి

కరణములలో గాని-పరమాత్మ ఈ చేతనా చేతనముల నన్నింటికిని ఆత్మ యనియు, ఇవ్వది భగవంతునకు శరీరము లనిగవా ప్రతిపాదించవలసి యున్నది. ఇట్టి శరీరాత్మభావమును పురస్కరించుకొనియే - "అయమాత్మా బ్రహ్మ," సర్వం ఖ ల్విదం బ్రహ్మ, "త త్త్వమసి" మొదలగు ప్రయోగ ములు చేయబడియున్నవి ఆత్మను విడచి, శరీరము విడిగా నుండజాలదు. శరీరమునకు, ఆత్మకంటెను పృథక్ స త్తయే ఉండదు కదా! అట్లే, జీవుడు పరమాత్మను విడచి, వేరుగా విభ క్తుడై యుండుట - అసంభవము. కనుక, ము క్తుడు ము క్తి దశలో - తనను పరమాత్మ శరీరముగా, పరమాత్మ కంటెను అభిన్నుడుగా, విడిగా నుండజాలనివానివలెనే అనుభవించునని పై బ్రహ్మసూత్ర తాత్పర్యము. కనుక, "అహం బ్రహ్మాస్మి" నేను బ్రహ్మను ఆత్మగా గలవాడను - అని, శరీరాత్మభావ పూర్వక మగు సామానాధికర ణ్యము స్ఫురింపజేయునట్లే, అనుభవించునని గమనింపవలెను. ఇపుడు పర మాత్మతో సామ్యము కూడ ము క్తునకు బాధితము కాదు. అదియునుగాక, "అధికం తు భేద నిర్దేశాత్," "అధికోపదేశాత్" ఇత్యాది సూత్రములలో ప్రతిపాదింపబడిన జీవ బ్రహ్మ భేదము కూడ రక్షింపబడును.

## 3. బ్రహ్మాధికరణము

ము క్తి దశలో జీవుడు పరమాత్మను చెంది స్వరూపావిర్భావమును పొందగలడని వెనుకటి యధికరణమున నిరూపింపబడినది. ఇక ము క్తి కార్యములుగా రెండు విషములు ప్రతిపాదింపవలసినవి ఉన్నవి. 1) ము క్తుని స్వరూప మెట్టిది ? 2) అత డనుభవించు విధాన మెయ్యది ? - అని ఈ రెండు విషయములను మొదటి అధికరణమునకు కార్యరూపములు. వీని యందును పరమాత్మను అనుభవించు విధానము కేవలము ఒకసూత్రముతో వివరింపదగిన చిన్న విషయము కావున, వాని పై యధికరణమున నిరూ పింపబడినది. ఇక, 'ము క్తుని స్వరూప మెట్టిది ?" అను విషయము కొంత మత భేదము కలిగి, అనేక సూత్రములతో నిరూపింపవలసియుండుటచే,

దానిని ఈ యధికరణమున నిరూపించుచున్నారు. కనుక, ఇదియును - 'హేతుతా' సంగతితోనే ఆరంభింపబడినది. రెండు విషయములను నిరూపింపవలసివచ్చినపుడు - చిన్న దానిని మొదటను; పెద్దదానిని తరువాతను చెప్పుట కూడ - 'కటాహ న్యాయము' సమర్థించును. ప్రకృతము అనుభవ ప్రకారము మొదటిది వర్ణింపబడినది. ఇక ఇందు స్వరూప మెట్టిదో చర్చింప బడుచున్నది.

ఇట్లు యీ యధికరణమున విచారింపబడు విషయము - ముక్తిదశలో ఆవిర్భవించు జీవుని స్వస్వరూపము. "య ఆత్మా అపహతపాప్మా ...... " సత్యకామ స్సత్య సంకల్పః " ఇత్యాది వాక్యములలో - జీవుని స్వరూపము కూడ బ్రహ్మస్వరూపము వలె, అపహత పాప్మత్వాది గుణ విశిష్టమవి ప్రతిపాదింపబడినది. దీనిని - 'బ్రహ్మస్వరూపము' అని యందురు. మఱికొన్ని తావులలో - "ప్రజ్ఞాన ఘన ఏవ", "విజ్ఞాన ఘన ఏవ" అని, విజ్ఞానము మాత్రమే జీవస్వరూప మని ప్రతిపాదింపబడినది. కనుక, ముక్తి దశలో ఆవిర్భవించు స్వరూపము బ్రహ్మస్వరూపమా ? లేక, ముక్తిదశలో ఆవిర్భవించు స్వరూపము బ్రహ్మస్వరూపమా ? అని సంశయ మేర్పడును. ముక్తిదశలో ఆవిర్భవించునది బ్రహ్మస్వరూపమే యనియు, అపహత పాప్మత్వాదులే కాక, ఆ గుణముల వలన గలుగు జక్షత్ క్రీడాది వ్యాపారములు కూడ ముక్తిదశలో కలవని - "స తత్ర పర్యేతి జక్షత్ క్రీడన్ క్రమమాణః " అను శ్రుతి ప్రమాణము వలన తెలియుచున్నదని, జైమిని మహర్షి వక్కాణ.

కాని, బాదరాయణ మహర్షి మాత్రము - విజ్ఞాన ఘన ఏవ " మొదలగు శ్రుతులు - 'జీవ స్వరూపము విజ్ఞానమే' అని చెప్పుచున్నందున ముక్తిదశలో - బ్రహ్మస్వరూపముతో గాక, కేవల విజ్ఞాన స్వరూపుడుగా జీవు డుండునని భావించెను. అపహత పాప్మత్వాదులు జీవునకు చెప్పబడు

చున్నమాట సత్యమే. ఐనచో - ఆ అవిద్యాత్మక వికాసములు జీవునకు లేవని చెప్పుటకొఱకేగాని, వాస్తవముగా ఈ గుణములు కొన్ని జీవునకు గలవని చెప్పుటకు కాదని ఔడులోమి మహర్షి అభిప్రాయము. ఇక, బాదరాయణుడు - ఈ యిరువురి నిర్ణయములను కలుపుకొని, సిద్ధాంతముచేయును. జీవుడు విజ్ఞాన స్వరూపు డనియు, అపహతపాప్మత్వాది గుణవిశిష్టుడనియు- శ్రుతి వాక్యములు వక్కాణించుచున్నవి. స్వరూపము విజ్ఞానమై, అపహత పాప్మత్వాది గుణములు కలిగియుండుటలో ఆక్షేపము లేదు కదా! "విజ్ఞాన ఘన ఏవ" అన్న ఏవకారము ఇతరులను నివర్తింపజేయును గదా! 'అప హత పాప్మత్వాదులు ఎట్లు కుదురగలవు? అని సంశయింపవలసిన యవ సరము లేదు. ఏలననగా - ఈ 'ఏవ'కారము జీవుని స్వరూపములో ఎట్టి చిన్న యంశమైనను విజ్ఞానరూపము కానిది లేదని చెప్పునే కాని, జీవుని యందలి గుణములను నివర్తింపజేయదు. దీనికి దృష్టాంతముగా జెప్పిన ఉప్పుగడ్డ స్వరూపము మొత్తము లవణరసము గలది యనగా - లవణము కంటెను ఇతర రసము లేదని అర్థమేకాని, ఈక్లాది రూపకఠినాది స్పర్శయు లేనిదని తాత్పర్యము కాదు కదా! కనుక, "విజ్ఞాన ఘన ఏవ" అను తావు లోని ఏవకారమునకును ఎట్టి విరోధము ఉండదు. ఇట్లు ముక్తి దశలో - జీవుడు విజ్ఞాన స్వరూపుడుగా ఉండి, తాను భగవంతునకు శరీరముగా, యథేష్ట వినియోగార్హముగా, పృథక్ స్థిత్యనర్హముగా వ్యవహరించుచు, భగవంతుని అనుభవింపగలడని బాదరాయణుని సిద్ధాంతము.

## 4. సంకల్పాధికరణము

ముక్తిదశకు సంబంధించిన మఱి యొక అంశము కూడ ఆవశ్య వక్తవ్యత్వరూప మగు అవసర సంగతిని బట్టి, ఇందు నిరూపింపబడు చున్నది. ముక్తునకు సర్వలోప కామచారము జక్షరీ క్రీడన ప్రభృతి వ్యవ హారములుగ శ్రుతిబోధకములై యున్నవి. "తస్య సర్వేషు లోకేషు కామ చారో భవతి" మొదలగునవి ఆ శ్రుతివాక్యములు. సంకల్పించిన లోకము

లకు పోవుటయు, అభీష్టమైనవానిని చేరుటయు మొదలగు ఈ విషయములు ముక్తునకు ఇతరులకు వలె ప్రయత్నముచే సిద్ధించునా? అనునవి సంశయము.

తలంచినవానికి సాధించుకొనువారుగా ప్రసిద్ధులగు రాజాదులకును లోకములో సంకల్పమాత్రమున కాక, ఇతర ప్రయత్నములతోనే సిద్ధి యేర్పడుచున్నట్లు చూచుచున్నాము కదా! కనుక, ముక్తునకు ప్రయత్నాంతరము చేతనే పై విషయములు సిద్ధించునని పూర్వ పక్షము.

"సంకల్పా దేవ త చ్ఛ్రుతేః" అనునది సిద్ధాంత సూత్రము. ప్రయత్నాంతరాపేక్ష అవసరము లేదు. కేవల సంకల్పమాత్రము చేతనే ముక్తునకు సర్వము సిద్ధించును. " స యది పితృలోక కామో భవతి, సంకల్పాదేవాస్య పితర స్సముత్తిష్ఠన్తి" అను శ్రుతి వాక్యముచే, ముక్తునకు సంకల్పమాత్రముగా సిద్ధియేర్పడునని స్పష్ట మగుచున్నది. ఇట్లు సంకల్పమాత్రము చేతనే సర్వాభీష్టములు సిద్ధించును కనుకనే, ముక్తుని-"స స్వరాట్ భవతి." అతడు-'తనకు తానే రాజు కాగలడు' అను శ్రుతి-వ్యక్తము చేయుచున్నది. 'తనకు తానే రాజు' అనగా, 'అట్టి ముక్తుడు - మఱి యొకని విధి నిషేధములకు లోబడువాడు కాడు' అని తాత్పర్యము. ఇట్టి స్వాతంత్ర్యము గల ముక్తునిపై పరమాత్మకు అధిపత్యము ఉండదని కాదు. తన వర్గమునకు జెందిన మఱియొకని ఆధిపత్య ముండదని తాత్పర్యము. అతని కంటెను భిన్ను డనినపుడు, ఆతని వర్గమునకు జెందినవానినే గదా స్వీకరించుట పరిపాటి! కావున, శబ్ద స్వభావమును బట్టి ఇచట, ముక్తుడగువానిపై - ఆతని కంటెను భిన్నుడగువాని ఆధిపత్య ముండదని తాత్పర్యము.

## 5. అభావాధికరణము

ముక్తునకు సంబంధించిన యంశములే ఈ పాదమున మఱికొన్ని వివరింపబడుచున్నవి. అందువలన. అవశ్య కర్తవ్యత్వ రూపమగు అవసర సంగతి ననుసరించియే ఈ యధికరణ మారంభింపబడుచున్నది.

ముక్తునకు ఈ శరీరేంద్రియాదు లుండునా ? ఉండవా ? లేక, ఆ ముక్తుని సంకల్పానుసారము అతనికి శరీరాదు లుంకుట, ఉండకుండుట - సంభవించునా ? అనునది సంశయము. ఇచట బాదరాయణ మహర్షి - ముక్తునకు శరీరేంద్రియాదు లుండునని భావించెను. శరీరసంబంధమున్నంత వఱకును-దుఃఖము అనివార్య మని -"సహ వై శరీరస్య స తః " ఇత్యాది శ్రుతి వాక్యములు తెలియజేయుచున్నవి. అట్లే, " అస్మా చ్ఛరీరా త్సము త్థాయ" ఇత్యాది శ్రుతులు-శరీరము వీడిన పిమ్మటనే స్వస్వరూపావిర్భావ రూప మగు ముక్తిని సూచించుచున్నవి. కనుక, ముక్తునకు శరీరాదులు ఉండవని బాదరాయణుని అభిప్రాయము కాని, జైమిని మహర్షి మాత్రము ముక్తునకు శరీర ముండుననియే తలంచెను. "స ఏకధా భవతి త్రిధాభవతి" ఇత్యాది శ్రుతులు - ముక్తుడు అనేక శరీరములు ధరించునని బోధించు చున్నందున, శరీరము లేదనెడి శ్రుతికి - కర్మ కృత మగు శరీర ముండ దని మాత్రమే తాత్పర్యమని అభిప్రయించుచున్నాడు. తన సంకల్పము ననుసరించి ముక్తునకు శరీర ముండవచ్చును, ఉండకపోవచ్చును.ఆక్షేపము లేదని బాదరాయణుడు తన అభిప్రాయమును వ్యక్తీకరించుచు, జీవుడు విజ్ఞాన స్వరూపము, గుణాష్టకము కూడ కలిసి, సర్వదా ఉన్నట్లు, సశరీర త్వము, అశరీరత్వము అనునవియును కలసి యుండునవి కావు కాని, ముక్తుని సంకల్పమును బట్టి, ఒకపుడు శరీరాదు లుండవచ్చును, లేకను పోవచ్చును - అని అంగీకరించినచో - ఇక ఈ యంశము పరిష్కరింపబడి నట్లే కదా ! అని బాదరాయణుని సిద్ధాంతము.

ఐనచో, ముక్తుడు తాను శరీరేంద్రియాదులను సృష్టించుకొనినపుడు కేవలము ఆత్మస్థితిని మాత్రమే అంగీకరింపవలెకదా ! అయ్యది కైవల్య ముత్తో సమానమే. ఏల నన్న, కేవలాత్మకు ఎట్టి భోగములను అనుభ వించుట కవకాశము లేదు కదా !' అను ఆక్షేపమును పరిహరించుటకై సూత్రకారుడు ఈ యధికరణమునందే మఱికొన్ని సూత్రములనుల్లేఖించి

యున్నాడు. కాని, అట్టి సూత్రములలో ముఖ్యములైనకొన్నింటినిమాత్రము మన మిట చర్చించి, వాని సారాంశమును గ్రహింతము.

జీవుడు అణుస్వరూపుడే యయ్యును - దీపము ఒకే తావున ముద్ద గట్టి యున్నను, తన కాంతిచే ఆ ప్రదేశము నంతటిని ప్రకాశింపిజేయు నట్లు, బద్ధుడు శరీరమున ఏక దేశముగ నున్నను, పాదాది కేశాంతము సర్వావయవములను ఆత్మభూతజ్ఞానము ద్వారా వ్యాపించియుండును. జ్ఞానము ద్వారా ప్రవేశించు శక్తిగల ముక్తుడు - " పంచధా భవతి, సప్తధా భవతి " అనునట్లు, జ్ఞానముద్వారా వ్యాపించు శక్తి గలిగియుండును. కావున, ముక్తుడు పరమపదమునందును అనేక శరీరములతో భగవంతుని అనుభ వించుచు, ఈ ప్రకృతిమండలమునందును స్వామి వెంటనంటియుండి, స్వామిని అనుభవింపగలడు. బద్ధుని శరీరము కర్మకృతము. ముక్తుని శరీ రము స్వేచ్ఛా సంపాదితము. ఇది మాత్రము గ్రహింపవలెను.

"ప్రాజ్ఞే నాత్మనా పరిష్వక్తో న బాహ్యం కించ న వేదనాంతరమ్" అను బృహదారణ్యకోపనిషద్వాక్యము వలన, భగవంతుని చేరిన వానికి ఏ విధ మైన జ్ఞానము ఉండదని తెలియుచున్నది కదా ! అట్టిచో - ముక్తునకు నిరంతర భగవదనుభూతి యనునది ఎట్లు పొసగును? అని సంశయ మేర్పడ వచ్చును. ఈ సంశయమునకు బాదరాయణుడు సూత్రాంతమున సమా ధానము చెప్పుచున్నాడు. అదే మనగా - 'ఈ శ్రుతివాక్యము ముక్తిదశను చెప్పునది కాదు. సుషుప్తి దశను గాని, మరణదశను గాని, చెప్పున దన వచ్చును. అని. "స్వం ప్యాపీతో భవతి" అని, సుషుప్తిదశయందును, "తేజః పరస్యాం దేవతాయాం" అని, మరణ దశయందును జీవునకు పరమాత్మ ప్రాప్తి చెప్పబడినది. అట్టి మరణ దశలో జీవునకు ఏవిధమైన జ్ఞానము ఉండదు. ఇక, ముక్తి దశలో మాత్రము జ్ఞాన ముండునని, "ఏతాన్ కామాన్ పశ్యన్ రమతే య ఏతే బ్రహ్మలోకే " ఇత్యాది శ్రుతు లుపదేశించుచున్నవి గదా ! కావున, "ప్రాజ్ఞే నాత్మేన" అని, పైన పేర్కొనబడిన వాక్యము

ముక్తిని చెప్పునది కాదు కనుక, ముక్తునకు నిరంతర భోగానుభవము సంభవమని తాత్పర్యము.

## 2. జగద్వ్యాపార వర్జాధికరణము

ముక్తునకు సంబంధించిన మఱియొక విషయము చర్చింపబడుచున్నందున, ఈ యధికరణము కూడ అవసర సంగతితో ఆరంభింపబడుచున్నదన వచ్చును. ముక్తి యనునది - కేవల స్వరూపమాత్రస్థితి కాదనియు, సత్య సంకల్పత్వాది గుణ విశిష్టస్థితి యనియు, ఆ దశలో - సంకల్పించినంత భోగము ననుభవింపవచ్చు ననియు నిర్ణయింపబడినది. ఐనచో - ముక్తునకు జగత్తుయొక్క సృష్టి స్థితి క్రియాది కర్తృత్వము కూడ లోక సంకల్పముతో సాధ్యమా ? కాదా ? అనునది సంశయము. ముక్తైశ్వర్యమే విషయము. ముక్తునకును సత్య సంకల్పాదులతో పరమాత్మ సాన్నిధ్యము చెప్పబడియున్నందున, జగత్ సృష్టి మొదలగు జగద్వ్యాపారముల నంగీకరింపవలసియుండునని పూర్వపక్షము. నిఖిల చేతనాచేతన నియమన రూపమగు ఈ జగద్వ్యాపారము ముక్తునకు అంగీకరింపబడలేదనియు, ఈ జగద్వాపారము తప్ప, తక్కిన విషయములందే జీవునకు పరమాత్మతో సామ్య మనియు సిద్ధాంతము. ఏల ననగా — " యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తీతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి " ఇత్యాది శ్రుతులు - జగన్నియమనము బ్రహ్మ లక్షణమని ఉపదేశించుచున్నవి. లక్ష్యము అవధారణముగా నుండవలెగదా ! జగన్నియమనమును గుఱించిన సందర్భలము లెచ్చటను ముక్తుని ప్రసక్తి లేదు కావున, జగన్నియమన వర్జ్యమే ముక్తైశ్వర్య మని సిద్ధాంతము.

" స స్వరాట్ భవతి", "తస్య సర్వేషు లోకేషు కామాచారో భవతి " ఇత్యాది శ్రుతులు-ముక్తునకు కర్మవశ్యకత ఉండదనియు, బ్రహ్మలోకము లన్నింటియందును అతడు స్వేచ్ఛగా పర్యటింపవచ్చుననియు, అచటి లోక

ములననుభవింపవచ్చునవియు తెలియజేయుచున్నవేకాని, జగ న్నియమన వ్యాపారమును చెప్పుటలేదు. జగ న్నియమన వ్యాపారము కేవలము పర మాత్మకు మాత్రమే కలదనియు - " భీషాస్మా ద్వాతః పవతే, భీషోదేతి సూర్యః, భీషాస్మా దగ్ని శ్చేంద్ర శ్చ ", "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి " ఇత్యాది శ్రుతులను, "మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరా చరమ్ " ఇత్యాది స్మృతులును స్పష్టీకరించుచున్నవి. ముక్తునకు గల సత్య సంకల్పాదులను, పరమపురుషుని సంకల్పామత్తములే యనియు, జీవసామా న్యమునకు గలవి పరమపురుషుని నిత్య సంకల్పమే కారణ మనియు - అందువలన, ముక్తుని సత్య సంకల్పాది రూప మగు ఐశ్వర్యము - జగ ద్వ్యాపార వర్జ్యముగా తెలియవలెనని సిద్ధాంతము.

ముక్తునకు చెప్పబడు పరమ సామ్యము అనుభవమందేకదా శ్రూయ మాణ మగుచున్నది ! " సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా " అని. కనుక, ముక్తునకు జగన్నియమనము లేదని విశదముగా తెలియుచున్నది. ఐనచో - ముక్తుని యైశ్వర్య మంతయు పరమపురుషా యత్తమే యైనపుడు - ఆ పరమ పురుషుడు స్వతంత్రుడు కావున. ఈ ముక్తు నకు పునరావృత్తియు ఆతని సంకల్పము వలననే సంభవించుటకు అవ కాశము కలదుకదా ! అను సంశయమును నిరాకరించుచు, బాదరాయణుడు ఈ శాస్త్రమును ముగించుచున్నాడు.

## శాస్త్ర సారము

నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణ గుణాకరుడు, జగజ్జన్మాది కారణ భూతుడు, సమస్త వస్తు విలక్షణ లక్షణుడు, సర్వజ్ఞుడు, సత్యసంకల్పుడు, ఆశ్రిత వాత్సల్య సాగరుడు, పరమపురుషుడు కలడని, శబ్ద ప్రమాణమును బట్టి, ప్రథమ - ద్వితీయాధ్యాయములలో బాదరాయణ మహర్షి మతమును శ్రీభాష్యకారులు వివరించియున్నారు కదా ! అట్లే, ప్రతి నిత్యము అనుష్ఠింప బడు వర్ణాశ్రమ ధర్మములతో నిష్పన్న మగు భగవ దుపాసన రూప మగు

భగవ దారాధనముతో ప్రసన్ను డగు పరమాత్మ - తన ఉపాసకులకు అవిద్యను తొలగించి, తన గుణానుభవ రూప మగు ఆనందాతిశయను కలిగించి, ఆ స్థితినుండి నివర్తింపజేయుననియు, శబ్ద ప్రమాణమును బట్టియే మూడు - నాలుగు అధ్యాయములలో ప్రతిపాదించియున్నారు. పరమాత్మ కలడని చెప్పు ప్రమాణమే పరమాత్మ - తన ఉపాసకులకు పునరావృత్తిని కలుగ నీయడనియు చెప్పుచున్నదని శ్రీభాష్యకారులు ప్రవచించియున్నారు. ఛాందోగ్యములో చిట్ట చివర — "న చ పునరావర్తతే న చ పునావర్తతే" యనియు, "మా ముపేత్యతు కౌంతేయ, పున ర్జన్మ న విద్యతే" అని భగవద్గీతయు బోధించుచున్నందున, ఇట్టి శ్రుతి స్మతిరూప మగు శబ్దప్రమాణమే పునరావృత్తి లేదనుటకు ప్రమాణము. కర్మకృత మగు బంధము నశించినవానికిని, జ్ఞాన సంకోచము నుండి ముక్తులైనవానికిని, పరమాత్మనుమాత్రమే అనుభవించుట స్వభావమైనవానికిని, పరమాత్మయందు మాత్రమే ప్రీతిగలవానికిని, అనవధికాతిశయానంద స్వరూపు డగు పరమాత్మను అనుభవించువానికిని - మఱియొకటి అనుభవింపవలెనను అపేక్షగాని, దాని ననుభవించుటకై ప్రయత్నించుట మొదలగునవికాని అసంభావితములు కదా ! అట్టిచో - పునరావృత్తిశంకావకాశవేశమును లేదు. ఇంతటి పరమప్రీతి సంపన్ను డగు ఉపాసకుడు, విజ్ఞాని, పరమైకాంతి మహాత్ముడు - తనకు మహాదుర్లభుడు "— — స మహాత్మా సు దుర్లభః" అని యా పరమ భక్తుని పొంది, వానిని స్వామి తిరిగి తనకు దూరము చేసికొనునని తలంచుటయు ఏ మాత్రము సముచితముకాదు. కావున, ఎటువైపునుండి ఆలోచించినను - 'ముక్తునకు పునరావృత్తి కలుగవచ్చునేమో ? ' అను సంశయమునకు అవకాశము లేదు. ఇట్లు ముక్తుడు నిరవధికాతిశయానంద స్వరూపమగు బ్రహ్మానందమునే నిరంతరము అనుభవించుచు, అమృత సాగరాంత ర్నిమగ్న సర్వావయవుడై సర్వదా సుఖించుచునే యుండు నని శాస్త్ర సారము.

ప్రపద్యే ప్రణవాకారం భాష్యం రంగమి వాపరమ్
పరస్య బ్రహ్మణో యత్ర శేషత్వం స్ఫుట మీక్ష్యతే.

( ఇతి సర్వం సమంజసమ్ )

# శ్రీ వేదాంతదేశిక వైభవము

' సహజకవి - విద్యారత్న '

**శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు,** బి. ఎ.,



## దేశికోదయము

వడగల సంప్రదాయమునకు సంబంధించిన శ్రీ వేదాంత దేశికుల జన్మస్థానము - కాంచీపురమునకు సమీపమున గల 'తూప్పుల్' గ్రామము. తండ్రి - అనంతసూరి. తల్లి-తోతారమ్మ. మేనమామ -ఆత్రేయ రామానుజులు. జననము - క్రీ. శ. 1283. ఈ దేశికులు - తిరుపతి వేంకటేశ్వరస్వామి వారి ఘంటావతారము. ఈ దేశికులకు - వేంకటనాథులు, వేంకటాచార్యులు, వేదాంతాచార్యులు, నిగమాంత దేశికులు - అను నామాంతరములు కలవు.

## వంశ గౌరవము

వేదాంత దేశికులు విశ్వామిత్ర గోత్రికులు. తమ పితృపాదు లగు అనంతసూరి - మహా పండితులు. తమ పితామహు లగు పుండరీకాక్షులు - సుప్రసిద్ధ విద్వాంసులేగాక, యాగ దీక్షా పరులును. శ్రీ విశిష్టాద్వైత వేదాంత విశారదులు, "న్యాయకులిశ" గ్రంథకర్తలు నగు రామానుజాచార్యుల వారిచే స్థాపింపబడిన భాష్య ప్రబంధ సింహాసనాధిపతులు నగు ఆత్రేయ రామానుజుల సోదరి - తోతారమ్మ. ఆయమయు - ఒక విఖ్యాతమైన ఒక వైష్ణవ కుటుంబమునకు జెందిన మహిళామణి. ఈ రీతిగా వేదాంతదేశికులవంశము - సుప్రసిద్ధమైనది.

## బాల్య దశ

బాలుడైన వేదాంత దేశికుని -యాంతరంగిక పరిపాకమునకు-వన్నెను, వాసిని చేకూర్చిన భగవద్భక్తి విశేషము - ఆతని బాల్యదశ నుండియే తీర్చి దిద్దెను. ఆ బాలుడు - ఈడుకు మించిన మేధాశక్తి గలవా డగుటయే గాక, ఆతని మేనమామ యగు ఆత్రేయ రామానుజుల ప్రేమాదరములకు పాత్రు డయ్యెను.

## విద్యాభ్యాసము

విద్యార్థిగా వేదాంతదేశికుల జీవిత - క్రీ. శ : 1277లో-ఆరంభమై, 1289 లో-ముగిసెను. దేశికుల విద్యాభ్యాసము చాలవఱకు వారి మేనమామ యగు ఆత్రేయ రామానుజుల యొద్దనే జరిగెను. ఇరువది సంవత్సరముల వయస్సు వచ్చుసరికే - దేశికులు సర్వవిద్యాపారంగతులైరి. " వింశత్యబ్దే విశ్రుత నానావిధ విద్యః " అని, ఈ విషయమును వారే స్వయముగా - వారు రచించిన 'సంకల్ప సూర్యోదయ' మను నాటక గ్రంథములో వ్యక్తీక రించియున్నారు.

దేశికుల మేనమామ యగు ఆత్రేయ రామానుజులు - దేశికులకు విద్యా గురువే గాక, మంత్ర దీక్షా పరులు కూడ. గరుడ మంత్రసిద్ధు లగు తాము - తమ గారుడ మంత్రమును తమ మేనల్లున కుపదేశించిరి. అనంత రము, దేశికులకు - హయగ్రీవ మంత్రము కూడ లభ్య మయ్యెను. ఈ రెండు మంత్రములను నియమ నిష్ఠలతో అనుసంధించిన ఫలితముగా - దేశికులు అచిరకాలముననే - 'సర్వ తంత్ర స్వతంత్రులు' కాగల్గిరి.

ఇది యిట్లుండ, అపుడు కాంచీపుర సింహాసనాధిపతులుగా వ్యవహ రించుచున్న ఆత్రేయ రామానుజులు - తమకు వృద్ధాప్య దశ సంభవించు టచే, తమ యనంతరము, తమ మేనల్లుని ఆ సింహాసనాధిష్ఠితుని గావింప వలె నని సంకల్పించిరి.

తమ జీవితకాల మంతయు విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకే వెచ్చింపవలె ననియు, అందులకు ఆదర్శముగా - భగవద్రామానుజులనే గైకొనవలె ననియు, సాటివారిలో తమ ప్రజ్ఞా పాటవములను ప్రదర్శింప వలె ననియు - దేశికుల మహా సంకల్పము.

## వైవాహిక జీవితము

విద్యాభ్యాసము పూర్తియైనంతనే వేదాంత దేశికులు - వైవాహిక జీవితములో ప్రవేశించిరి. 'తిరుమంగై' అను కన్యామణిని వారు వివాహమాడిరి. ఇంతలో కొంతకాలమునకు దేశికుల మేనమామ యగు ఆత్రేయ రామానుజు లస్తమించిరి. అందువలన, వివాహమైనఆఱుమాసములకు - అనగా, క్రీ.శ. 1295లో - తమ మేనమామ పరమపదించిన కారణమున, వారి స్థానమున దేశికులు - ఆ కాంచీపురాచార్య సింహాసన మధిష్ఠింప వలసి వచ్చెను. ఆ సమయమందే - శ్రీరంగమున గల ఆచార్య పీఠమును - సుప్రసిద్ధు లగు శ్రుతప్రకాశికాచార్య లధిష్ఠించిరి.

వేదాంత దేశికుల వైవాహిక జీవితము - అదర్శప్రాయమైనది. వారు తమ గృహిణితో-సుఖమయ జీవితమునే గడిపిరి. వారికి-1317 లో - ఒక కుమార రత్న ముదయించెను. వా రా బాలునకు - 'కుమార వేదాంత దేశికులు' అని నామకరణము చేసిరి. ఆ సమయమునకు వేదాంత దేశికుల వయస్సు 46 సంవత్సరములు.

## తిరువహీంద్రపుర నివాసము

క్రీ. శ : 1295 సంవత్సరముల ప్రాంతమున ఆత్రేయ రామానుజులు పరమపదించిననాటినుండి - కాంచీపుర వైష్ణవాచార్య సింహాసనాధీశులైన వేదాంతదేశికులు - భక్త ప్రపన్నులకు శ్రీభాష్యోపదేశములను, శ్రీవైష్ణవ ధర్మప్రబోధములను చేయసాగిరి. ఇట్టి ధార్మిక కార్యక్రమ

నిర్వహణ కారణము వలన, తిరువహీంద్రపుర ప్రజలలో-నానాటికి వేదాంత దేశికుల యెడ - భక్తి ప్రపత్తులు ఇనుమడింపబడసాగెను.

తిరువహీంద్ర పురమునకు సమీపమున గల 'తూప్పుల్' నగము, దానిపై నున్న దేవనాయకాలయము, హయగ్రీవాలయము ఇవి రెండును - వేదాంత దేశికులను విశేషముగ ఆకర్షించెను. అందువలన గరుడ మంత్రమును వారు అచటనే జపించిరి. ఆ మంత్రమును సాధించుటలో - గరుడావతారు డగు తమ గురువును సేవించుచున్నట్లే దేశికులు భావించిరి.

తాము నివసించుచున్న తిరువహీంద్రపురమందే గాక, ఆ పరిసర ప్రాంతములందును దేశికులు - విద్యార్థుల శ్రేయస్సుకై, ఆచార్యవిధులను నిర్వహించుచు, ఆస్తిక ధర్మ ప్రబోధము చేయసాగిరి. తిరువహీంద్ర పురములో - కేవల బోధన ప్రవచనములే గాక, శ్రీవైష్ణవ సంప్రదాయ బోధకములైన కొన్ని భక్తి కవితలను కూడ దేశికులు వెలయించిరి. 'దేవనాయక పంచాశత్', 'హయగ్రీవ స్తోత్రమ్', 'అచ్యుత శతకమ్', 'గోపాల వింశతి', 'గరుడ పంచాశత్' మున్నగు సంస్కృత రచనలు కొన్ని-ఆ తిరువహీంద్రపురమునందే దేశికులు రచించియుందు రని తలంపబడుచున్నది.

శ్రీభాష్య ప్రవచన సమావేశములను మొత్తము ముప్పదింటిని దేశికులు నిర్వహించినట్లు - వారి సంకల్ప సూర్యోదయములో నిర్దేశింపబడియున్నందున, తిరువహీంద్ర పురమున వానిలో కొన్ని శ్రీభాష్య సమావేశములు జరిగియుండవచ్చునని మనము భావింపవచ్చును. ఈ రీతిగా దేశికులు తిరువహీంద్రపురములో - 15 సంవత్సరములు గడిపి, అనంతరము కాంచీపురమునకు జేరిరి.

## కాంచీపుర నివాసము

కాళిదాసునకు 'ఉజ్జయిని' ఎట్టిదో - వేదాంత దేశికులకు కాంచీపురము అట్టిది. ఉజ్జయినీ చిత్రణములలో కాళిదాసుని పరిస్ఫుటములైన కవితా

ఛాయలతో తుల్యముగా - వేదాంతదేశికుల కాంచీపుర వర్ణనము లున్నవి. వేదాంతదేశికులకు జన్మస్థాన మగుటచే, కాంచీపురమునకు అంతటి ప్రసిద్ధి యేర్పడిన దని, వారి యనంతరము - ప్రముఖ కవిగా ప్రసిద్ధిగాంచిన 'వేంకటాధ్వరి' అభిప్రాయము. కాంచీపురము వేదాంతదేశికులకు కేవలము జన్మస్థానమే గాక, వారి జీవితము సర్వతోముఖముగ వికసించిన దివ్య స్థలము. తిరువహీంద్రపురము వారి ప్రశాంత ధ్యానోపేతము కాగా, కాంచీపురము - వారి సాహిత్య, మత, వేదాంత వైశారద్య ప్రదర్శనమునకు ఆకరమైనది. తత్త్వ ముక్తా కలాపము, శతదూషణి - ఇత్యాది గ్రంథములను దేశికులు కాంచీపురమునందే రచించిరి. 'చిన్న కంచి' అనబడు విష్ణు కంచిలో వేంచేసియున్న శ్రీ వరదరాజస్వామివారి దేవాలయ వైభవము, అచ్చట వ్యాపించి యున్న వైష్ణవ మత వాతావరణము-వేదాంతదేశికులను మిక్కిలి ఆకర్షించెను. అష్టభుజాష్టకము, న్యాయ దశకము, వరదరాజ పంచాశత్, వేగాసేతు స్తోత్రమ్, పరమార్థ స్తుతి - మున్నగు గ్రంథములను చదివినవారికి-వారి కాంచీపుర చిరకాలాంతరంగిక సంసర్గము స్పష్ట మగును. శరణాగతి దీపికలో - వారి దిన చర్య, అనగా - వేగానదీ తట సంచారము, దీపప్రకాశ దేవాలయ సందర్శనము, భక్తులైన ఆ ప్రాంత శ్రీవైష్ణవుల సాంగత్యము - తమ జన్మస్థానముపై భక్తియు - బాగుగావిశదీకరింపబడి నది. ఆనాడు శిథిలమైయున్న అష్టభుజస్వామి దేవాలయమును - అష్టభుజాష్టక మను దేశికుల రచన - దర్శింజేయుదు. కాంచీపుర శ్రీకృష్ణుని విగ్రహమును దేశికులు ప్రతి దినము పూజించుచుందు రనుటకు - వారి 'న్యాస హృదయము' సాక్షీభూతమై యున్నది. విగ్రహ రూపమున నున్న దేవ దేవుని భజింపవలెనని విధించు వేదాంత దేశికుల శ్రీవైష్ణవ మతాభిమానమును వారి - 'వేగాసేతు స్తోత్రము' సూచించును. కాంచీపురమునకు ఏడు మైళ్ళ దూరములో నిలిచియున్న 'విజయ రాఘవ' తిరుప్పకుళ మందిరము' - వేదాంతదేశికుల మానసముపై ఎట్టి ముద్ర వైచెనో - వారి 'పరమార్థ స్తుతి' ధ్రువీకరించును. అదియును గాక, పిళ్ళ లోకాచార్యుల

వారిచే రచింపబడిన 'అర్థపంచకము' అను రహస్య గ్రంథములోని యంశ ములను దేశికులు - కాంచీపురమున నిత్యము బోధించుచు, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారము చేయసాగిరి.

వేదాంతదేశికులు - 'సర్వ తంత్ర స్వతంత్రులు' అని వ్యవహరింప బడిరి గదా ! అట్టి స్థితిలో - ఒకనాడు ఒక మంత్రగాడు - వేదాంత దేశికుల మంత్ర శక్తిని పరీక్షింప నెంచి, ఒక తటాకమున ప్రవేశించి, ఆ నీటిని త్రావి, త న్మూలమున - దేశికుల కడు పుబ్బి, బాధ కలుగునట్లు చేసెను. కాని, దేశికులు ఆ మంత్రవాది చమత్కారమును తెలిసికొని, తమగోటితో - సమీపమున నున్న స్తంభమును గీచి, తన ఉదరములోని నీ రంతయు ఆ స్తంభము ద్వారా వెలుపలకు ప్రవహించునట్లొనర్చిరి. అపుడు ఆ మాంత్రి కుడు - తనకంటెను ఈ వైష్ణవుడే గట్టి మాంత్రికు డని గ్రహించి, పరా భవ మొంది, అటనుండి మరలిపోయెను.

ఒకప్పు డొక పాము మంత్రగాడు-ఈ మంత్రము నీకు తెలియునా ? అని, దేశికుల నధిక్షేపించుచు, అనేక విష సర్పములను దేశికుల మీదికి పురి కొల్పెను. కాని, అవి యేవియు దేశికుల గీచిన గీటును దాటలేకపోయెను. కడసారి, మిగుల గరళము (విషము) గల్గిన ఒక కోడెత్రాచును వారి మీదికి వదలెను. ఆ విష సర్పము బుస కొట్టెను కాని, దేశికులకు ఏ మాత్రము కూడ హాని చేయజాలకపోయెను. వారు సర్వ తంత్ర స్వతంత్రులు కావున, ఆ విష త్సమయమయమున గరుడుని ప్రార్థింపగా, ఆ గరుత్మంతుడు వచ్చి, వెంటనే ఆ విష సర్పమును మ్రింగివేసెను.

## తిరుపతి దివ్యదేశ యాత్ర

వేదాంతదేశికులు ఒకపుడు తిరుపతి యాత్ర కేతెంచిరి. అచట శేషా చలముపై వారు శ్రీనివాస భగవానుని సేవించి, ఆ స్వామిని స్తుతించుచు - 'దయా శతకము'ను రచించిరి. 'హంస సందేశ' కావ్యమును గూడ వారు -

తిరుపతి పరిసర ప్రాంతములలోనే రచించినట్లు తెలియుచున్నది. వారి 'యాదవాభ్యుదయ' మహా కావ్యమునందలి 6-వసర్గలోని గోవర్ధన వర్ణన - వేంకటేశ్వరస్వామిచే పావన మొనర్చబడిన తిరుమల-తిరుపతి శైలపంక్తి వర్ణన మనియే భావింపవచ్చును. దివ్యసూరియైన నమ్మాళ్వారులకు గూఢముగ ప్రేరేపణ గావించుటకు ఆధారభూతములైన - తిరుమల పర్వత పంక్తులే వేదాంతదేశికులను వారి జీవిత వికాస హేతుభూతములయ్యెను. తిరువహీంద్రపుర మెట్లు వారి మేధస్సుకు వికసింపజేసెనో - అట్లే, తిరుపతి దివ్యదేశ యాత్రయు - వారి ఆధ్యాత్మిక చైతన్యమును ఉద్బుద్ధము గావించెను.

## ఉత్తర భారత యాత్ర

వేదాంత దేశికులు ఉత్తర భారత యాత్రకు పయనమై, మార్గ మధ్యమున - తుంగభద్రా నదీ తీరములో గల విజయనగర సామ్రాజ్యమున అమాత్యుడుగా నున్న బాల్యమిత్రుడును-సహాధ్యాయుడు నగు విద్యారణ్యుని గలిసికొని, అచటనుండి బయలుదేరి ఉత్తరభారతమును జేరి, అట - ద్వారక, మధుర, అయోధ్య, ప్రయాగ, అలహాబాదు, బదరికాశ్రమము, గయా క్షేత్రము, నైమిశారణ్యము, సాలగ్రామము, వారణాసి - మొదలగు క్షేత్రములను దర్శించి, అటనుండి స్వస్థానమునకు మరలిరి. మధ్యమున- పూరి, శ్రీకూర్మము, అహోబిలము, తిరుపతి, తిరువళ్ళూరు - మున్నగు క్షేత్రములను కూడ దర్శించి, తుదకు కాంచీ పురము జేరిరి. దేశికుల ఈ ఉత్తర దేశ పర్యటనకు - క్రీ. శ. 1325 - 1335 నడుమ జరిగియుండ వచ్చునని తలంపబడుచున్నది.

## దక్షిణ భారత యాత్ర

కాంచీపురము, తిరువహీంద్రపురము, తిరుపతి, శ్రీరంగము - అను ఈ నాలుగు తావులలో దేశికులు చాల కాలమును గడుపుటయే గాక, దక్షిణ

భారతమునందలి ఇతరములైన శ్రీవైష్ణవ క్షేత్రములను కూడ కొన్నింటిని దర్శించిరి. ఆ సమయమునందే, కర్ణాటక రాష్ట్రమున ప్రసిద్ధ మగు 'మేలు కోట' అనబడు 'తిరునారాయణ పురము' అను దివ్య క్షేత్రమును కూడ దేశికులు దర్శించి, ఆక్షేత్రమును వారు-దక్షిణ బదరికాశ్రమ మని బహుధా ప్రస్తుతించిరి. అచటనుండి బయలుదేరి, తిరువళ్ళూరుకు పదిమైళ్ళ దూర ములో గల 'శ్రీపెరుంబూదూరు' క్షేత్రమును చేరి, అట అర్చామూర్తిగా వేంచేసి యున్న భగవద్రామానుజులను సేవించి, వారిని గురించి తమకు గల భక్తి ప్రపత్తులను వెలువరించుచు - "యతిరాజ సప్తతి" యను నొక స్తోత్రమును రచించుటయేగాక, ఆక్షేత్రమును పరమ పవిత్ర స్థానముగా భావించి, అట కొంత కాలము గడపి, అట నుండి తిరువాన్కూరునకు బోయి, అనంత పద్మనాభ స్వామిని సేవించి, అంతట స్వస్థానము జేరిరి.

## స్వస్థానాగమనము

వేదాంతదేశికులు స్వస్థాన మగు కాంచీపురమునకు చేరి, సాహిత్య వ్యాసంగమును కొనసాగించుచు, కుమారుడైన వరదనాథునకును, శిష్యుడైన బ్రహ్మతంత్ర పరకాలునకును - విద్యలను బోధించుచుండిరి.

## శ్రీ రంగ క్షేత్ర నివాసము

కాంచీపురమును వీడి, శ్రీరంగము జేరవలెనని దేశికుల సంకల్పము. కేవల సంకల్ప మాత్రమే కాదు. ఆ శ్రీరంగము నందలి శ్రీవైష్ణవ ప్రముఖుల వద్దనుండి ఆహ్వానము కూడ వచ్చెను. ఈ కారణముల వలన, వారు శ్రీరంగమునకు జేరి, శ్రీవైష్ణవ ధర్మ ప్రచారము గావించుచు, అద్వైతు లను వాదమున నోడించి, విశిష్టాద్వైత సిద్ధాంతమును ప్రతిష్ఠాపించుచుండిరి. ఆ సమయమునందే - శ్రీరంగము నందలి వైష్ణవాచార్య పీఠమును గూడ వేదాంత దేశికులు అధిష్ఠింపవలసివచ్చెను. ఆ తరుణమునందే వారు - శత

భూషణి, అధికరణ సారావళి, తత్త్వ టీక, తాత్పర్య చంద్రిక - మున్నగు గ్రంథములను రచించిరి. ఒకనాటి రాత్రి-రంగనాథుని వర్ణించుచు ఒక కవి - ఆశువుగా అయిదు వందల శ్లోకములు చెప్పగా, వేదాంత దేశికులు శ్రీరంగ నాథుని పాదారవిందములను వర్ణించుచు - ఆశువుగా ఒక రాత్రిలో వేయి శ్లోకములు చెప్పి రట ! ఆ వేయి శ్లోకము లిపుడు - 'పాదుకా సహస్రము' అను పేర సుప్రసిద్ధములై యున్నవి

వేదాంతదేశికులు శ్రీరంగములో నివాస మున్న తరుణముననందే - వారి పాండిత్య ప్రకర్ష ను, ప్రతిభా విశేషములను విని సర్వజ్ఞసింగ భూపాలుడు - దేశికుల నాహ్వానించెను. అపుడు దేశికు లా యాహ్వానము నందుకొని, సర్వజ్ఞసింగ భూపాలుని యాస్థానమున కేగి, అట - 'సుభాషిత నీవి' అను శీర్షికతో కొన్ని శ్లోకములను ఆశువుగా జెప్పి రట ! అపుడు సర్వజ్ఞ సింగ భూపాలుడు సంతుష్టాంతరంగుడై, దేశికులను ఘనముగా సన్మానించెనని ప్రతీతి యున్నది. ఇట్లే, సర్వజ్ఞసింగ భూపాలుడు విద్యా పోషకు డగుటచే, భాగవతము నాంధ్రీకరించిన శ్రీనాథునికూడ - ఘనముగా సన్మానించె ననియు ప్రతీతి యున్నది.

వేదాంత దేశికు లట నుండి-మైసూరు రాష్ట్రమున గల 'సత్యమంగళ' మను క్షేత్రమునకు బోయి, అట-'పరకాల మతము' నొకదానిని స్థాపించి, తమ యాంతరంగిక శిష్యులగు 'బహ్మ తంత్ర స్వతంత్రు' లనువారిని ఆ పీఠాధిపతుల గావించిరి.

ఒకప్పుడు-ద్వైతాచార్యు డగు అక్షోభ్య మునికిని, అద్వైత వేదాంతి యగు విద్యారణ్యునకును - 'తత్త్వ మసి' అను వాక్యార్థమును గురించి తీవ్ర వివాదము సంభవించెను. ఉభయ పక్షముల అంత ర్వాదములకును, వేదాంత దేశికులకును - మధ్యవర్తిత్వమునకై తెలియజేయబడెను. ఇరు

వురి వాదోపవాదములు విని దేశికులు - అక్షోభ్యముని వాదమును సమర్థించిరి. అంతట విద్యారణ్యుడు - వేదాంత దేశికుల దోషము లెన్నబూని, వారి ప్రయోగములలో - చ కార మొకటి అధికముగా నున్నదని యాక్షేపించెనట ! అపుడు దేశికులు-'చకార సమర్థ' మను గ్రంథమును రచించిరి.

## అస్తమయము

ఈ రీతిగా-వేదాంత దేశికులు-విద్వణ్మణులై కవితార్కిక కేసరులై, భగవద్రామానుజ సిద్ధాంత ప్రచార పరిదృఢులై, బహు గ్రంథ కర్తలై, చిర యశస్కులై - క్రీ. శ. 1309 - వ సంవత్సరమున పరమపదించిరి.



# దేశికుల రచనలు - తద్విశేషములు

'విద్యా భూషణ - కవితా విశారద'

## శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు.



## ఆరంభ వాక్యము

వడగల సంప్రదాయమునకు ఆద్యు లగు శ్రీ వేదాంత దేశికులు - దక్షిణ భారతమున - తమిళనాడులో - కాంచీపు సమీపమున గల' తూప్పుల్' గ్రామమున - అనంతసూరి, తోతారమ్మ దంపతులకు - క్రీ. శ. 1268 - వ సంవత్సరమున జన్మించిరి. మేన మామ యగు ' అప్పులార్ ' అనబడు ఆత్రేయ రామానుజులు యొద్దను, మఱి కొందఱు ప్రముఖ పండితుల యొద్దను శాస్త్రాధ్యయనము గావించిరి. జీవితములో విశేషకాలము కాంచీ పురము నందును, శ్రీరంగము నందును, తిరువహీంద్ర పురమునందును గడిపిరి. కాంచీపురమున వేంచేసియున్న శ్రీ వరదరాజస్వామి - వీరి ఆరాధ్య దైవము. నిరాడంబర జీవులు, అనేక వేదాంత ప్రసంగములు గావించిన ప్రతిభావంతులు. శ్రీ వరదరాజస్వామి పైనను, శ్రీ రంగనాథస్వామి పైనను, శ్రీనివాస భగవానుని పైనను అనేక స్తోత్రములను రచించిన భక్త కవి శేఖరులు. భగవద్రామానుజుల యందు గల భక్తి భావముతో - 'యతి రాజ సప్తతి' యను స్తోత్రమును రచించి, వారి చరణారవిందములయందు సమర్పించిన పరమ భాగవతోత్తములు. ఏవంగుణ విశేషణ విశిష్టులైన వేదాంత దేశికులు - వివిధ విషయములపై - సంస్కృత భాష యందును, తమిళ భాషయందును, ఈ రెండును కలిసిన మణిప్రవాళ భాషయందును -

శతాధికముగా గ్రంథములను రచించియున్నారు.ఆ వికతములు - ఈ క్రింద పేర్కొనబడుచున్నవి.

## సంస్కృత రచనలు

1. అధికరణ దర్పణమ్ – భగవద్రామానుజుల శ్రీభాష్యము నందు వివరింపబడిన బ్రహ్మసూత్రములు. (ఈగ్రంథమిపు డలభ్యము)
2. అధికరణ సారావళీ – శ్రీభాష్యముపై వ్యాఖ్యానము.
3. అధికార సంగ్రహ శ్లోకమ్ – మత – వేదాంత విషయములు 32 అధ్యాయములలో గలవు.
4. ఈశోదనిష ద్భాష్యమ్ – తత్త్వ - హిత - పురుషార్థములపై వ్యాఖ్య.
5. గద్య త్రయ భాష్యమ్ – భగవ ద్రామానుజులచే రచింపబడిన గద్య త్రయముపై వ్యాఖ్యానము.
6. తత్త్వ ముక్తా కలాపమ్. – జడద్రవ్య-జీవ – నాయక - బుద్ధి – అద్రవ్యముల వివరణము.
7. ద్రమిదోపనిష త్తాత్పర్య రత్నావళీ. – నమ్మాళ్వారుల తిరువాయి మొళికి సంగ్రహ రూప వివరణము.
8. ద్రమిడోపనిష త్సారమ్ – తిరువాయి మొళిలోని 20 పాశురము లకు సంస్కృతానువాదము.
9. నిక్షేప రక్షా – ప్రపత్తి వివరము.
10. న్యాయ పరిశుద్ధిః – బ్రహ్మసూత్ర వివరణము.
11. స్వరూపానుప్రత్యూత్పావనమ్ – విధి సమర్థనము, నిషేధ సమర్థనము.

సాంప్రదాయ విరోధ భంగము-అను విషయములను గురించిన వివరణము.

12. న్యాయ సిద్ధాంజనమ్ – యామునాచార్యుల 'ఆగమ ప్రామాణ్యము', భగవద్రామానుజులు 'గీతా భాష్యము', పరాశర భట్టరు 'తత్త్వ రత్నాకరము', వాత్స్య వరదాచార్యుల 'తత్త్వ సారము', నారాయణాచార్యుల 'నీతిమాల', వరద నారాయణుల 'ప్రజ్ఞా పరిత్రాణము', శ్రీరామ మిశ్రుల 'షడర్థ సంక్షేపము' అను గ్రంథముల నుండి గ్రహింప బడిన తాత్త్విక సంకసంకలనము.

13. పాంచరాత్ర రక్షా – శ్రీ పాంచరాత్రాగమ వాఙ్మయ సంబంధము లగు సంహితలను గురించిన వివరణము.

14. భగవదారాధన విధిః – విష్ణ్వారాధన విధానము

15. భగవద్గీతా భాష్య వ్యాఖ్యా తాత్పర్య చంద్రికా – ప్రపత్తి చరమ శ్లోకములను గూర్చిన – వివరణము.

16. మీమాంసా పాదుకా – శాస్త్రానుసారము – జరుగ వలసిన ధర్మాచరణ వివరణ

17. యజ్ఞోపవీత ప్రతిష్ఠా విధిః – యజ్ఞోపవీత ధారణ క్రమము.

18. శత దూషిణీ – శంకర, భాస్కర, యాదవ ప్రకాశాది వాదముల ఖండనము.

19. శ్రీభాష్య వ్యాఖ్యా తత్త్వటీకా – భగవద్రామానుజుల శ్రీభాష్యమును

గురించి - పూర్వ లగు ప్రముఖుల అభిప్రాయములు.

20. సచ్చరిత్ర రక్షా - శ్రీవైష్ణవ మతాచార వివరణము.

21. తప్త ముద్రా ధారణ విధిః - పంచ సంస్కార ధారణ విధిః

22. శేషవర మీమాంసా - జైమినీ మహర్షి చేరచింపబడినపూర్వ మీమాంసా సూత్రములకు, వ్యాస మహర్షి చేరచింపబడిన బ్రహ్మసూత్ర ములకునుగల తారతమ్య వివరణము.

23. హరి దిన తిలకః - ఏకాదశీ వ్రతఉపవాసఫల వివరణము.

24. గీతార్థ సంగ్రహ రక్షా యామునాచార్యుల గీతార్థ సంగ్రహ సమీక్ష.

25. శ్రీరంగనాథపాదుకా సహస్రమ్ - శ్రీరంగనాథుని పాదారవిందముల ప్రభావమును గురించిన ప్రశంస.

26. యాదవాభ్యుదయమ్ - శ్రీకృష్ణుని చరిత్ర

27. సంకల్ప సూర్యోదయమ్ - వేదాంత సిద్ధాంత వివరణము.

28. హంస సందేశమ్ - కాళిదాస మహా కవి రచించిన మేఘ సందేశ మహా కావ్యము వంటిది. లంకలో నున్న సీతాదేవికి - హంస ద్వారా శ్రీరాముడు సందేశ మంపుట ఇందు వర్ణింపబడినది.

29. సుభాషిత వాణీ. - భర్తృహరి సుభాషితము వంటి నీతి బోధక గ్రంథము.

30. అచ్యుత శతకమ్ - ఇయ్యది - ప్రాకృత భాషలో రచింప బడిన స్తోత్ర గ్రంథము.

31. లభీతి స్తవమ్ – శ్రీరంగనాథ స్తోత్రము
32. అష్టభుజాష్టకమ్ – భక్త రక్షణార్థమై-భగవంతుడు పొందు ఆవేదనము ఇందు వర్ణితము.
33. కామాసికాష్టకమ్ – శ్రీ లక్ష్మీ నృసింహ స్తోత్రము
34. గరుడ దండకమ్ – గరుడ మంత్ర వివరణము.
35. గోదా స్తుతిః – గోదా దేవిని గురించిన స్తోత్రము.
36. శోణాధి రేపీ – శోణా, సరస్వతీ, విరజా, నర్మదా, గోమతీ – అనునట్టి నదుల యొక్క పుట్టు పూర్వోత్తరములు.
37. గోపాల వింశతిః – శ్రీకృష్ణుని బాల్య వర్ణనము.
38. దయా శతకమ్ – శ్రీనివాస భగవానుని కృపా విశేష వర్ణనము.
39. దశావతార స్తోత్రమ్ – రామకృష్ణాది దశావతార వర్ణనము.
40. దివ్య దేశ మంగళాశాసనమ్ – శ్రీరంగము, తిరుపతి, కాంచీపురము, తిరునారాయణ పురము (మేల్కోట) – అనబడు నాల్గు దివ్య క్షేత్రములపై భవ వర్ణనము.
41. దేవ నాయక పంచాశత్ – దేవనాథ స్తుతి.
42. దేహళీశ స్తుతిః – త్రివిక్రమ స్తుతి.
43. న్యాస తిలకః – ప్రపత్తి మార్గ వివరణము.
44. న్యాస దశకమ్ – శరణాగతి వైశిష్ట్యము.
45. న్యాస వింశతిః – శరణాగతి వైభవము.

46. భగవద్ధ్యాన సోపానమ్ - శ్రీరంగనాథుని దివ్య మంగళ విగ్రహ స్వరూప వర్ణనము.
47. పరమార్థ స్తుతిః - విజయరాఘవ స్తుతి.
48. భూస్తుతిః - భూదేవీ సహన ప్రశంస.
49. మహావీర వైభవమ్ - సంక్షిప్త రామాయణము.
50. యతిరాజ సప్తతిః - శ్రీరామానుజ ప్రశంస.
51. యథోక్తకారి స్తోత్రమ్ - వేగా సేతు స్వామి ప్రశంస.
52. వరదరాజ పంచాశత్. - శ్రీ వరదరాజ స్తవము.
53. వైరాగ్య పంచకమ్ - ఐహిక సుఖములయెడ వైరాగ్య వర్ణనము.
54. శరణాగతి దీపికా - శరణాగతిని గుఱించిన వివరణము.
55. శ్రీ స్తుతిః - మహాలక్ష్మి స్తవము.
56. షోడశాయుధ స్తోత్రమ్ - శ్రియః పతికి గల - శంఖ చక్రాది షోడశ (16) ఆయుధముల వర్ణనము
57. సుదర్శనాష్టకమ్ - సుదర్శన మహిమా వర్ణనము.
58. హయగ్రీవ స్తోత్రమ్ - విద్యాధిదేవత యగు శ్రీ హయగ్రీవుని గుఱించిన స్తోత్రము.
59. ముక్తశ్లోకీ. - అట నట సేకరింపబడిన 8 ప్రాస్తావిక శ్లోకముల సంకలనము.

## తమిళ రచనలు

60. ప్రపత్తి దశకమ్ - వరదరాజ స్తవము.
61. గాథా - రహస్యత్రయ సారమునకు తమిళాను వాదము.

62. అమ్మాై రయ్యెప్పా - 'నవ మణి మాలై' లోని - చివరి పాశురభావము.

63. అమృతాస్వాదినే - 'స్తార సారము' మొదలు - 'మధుర కవి హృదయము' వఱకు వివరణ.

64. అర్థ పంచకమ్ - పరమాత్మను చేరుటకై, జీవాత్మ చేయువలసిన విధులు.

65. ఆహార నియమమ్ - సాత్త్వికాహార నిర్ణయము.

66. గీతార్థ సంగ్రహమ్ - భగవద్గీతార్థ వివరణము.

67. చరమ శ్లోకమ్ - ప్రపత్తి వివరణము.

68. తిరు చ్చిన్న మాలై - వరదరాజ స్తుతి.

69. తిరుమంత్ర చ్చురుక్కు - అష్టాక్షరీ మంత్ర వివరణము.

70. ద్వయ చ్చురుక్కు - ద్వయ మంత్ర వివరణము.

71. నవ మణి మాలై - దేవ నాథ స్తుతి.

72. పర మత భంగమ్ - ఇతర మతముల ఖండనము, ప్రసన్నత్వ వివరణము.

73. పన్నిరు నామమ్ - ద్వాదశోర్ధ్వపుండ్ర ధారణ వివరణము.

74. ప్రబంధ సారమ్ - పన్నిద్ధరాళ్వారుల ప్రశంస.

76. మున్మణి కోవై - దేవనాథ ప్రశంస.

76. హస్తిగిరి మాహాత్మ్యమ్ - వరదరాజ క్షేత్ర ప్రశస్తి.

77. శ్రీవైష్ణవ దిన చర్యా - శ్రీవైష్ణవుల నిత్యానుష్ఠాన క్రమము.

78. పరమపద సోపానమ్ - ప్రపన్నుడు పరమపదమునకు సోపాన వివరణము.

# మణవాళ మాముని రచనలు

79. అమృతాస్వాదినీ రహస్యంగళ్ – పదునొకండు (11) రహస్య విశేషములు.
80. అంజలి వైభవమ్ – యామునాచార్య విరచిత మగు 'స్తోత్ర రత్న' వైశిష్ట్యము.
81. అభయ ప్రదానమ్ - ప్రపత్తి మార్గ వివరణము. విభీషణ శరణాగతి వివరణము.
82. ఉపకార సంగ్రహమ్ – పరతత్త్వ మీమాంస.
83. తత్త్వత్రయ చుళుకమ్ – చిదచిదీశ్వరులనుగురించినవివరణము
84. తత్త్వ నవనీతమ్ – జీవాత్మ వివరణము
85. తత్త్వ పదవీ - శుద్ధ తత్త్వము, ధర్మభూత జ్ఞానము, భక్తి, ప్రపత్తి-అను వాని వివరణము.
86. తత్త్వ మాతృకా – సత్త్వ, రజ, స్తమో గుణ వర్ణనము.
87. తత్త్వ రత్నావళీ – తత్త్వత్రయ వివరణము.
88. తత్త్వ రత్నావళీ సంగ్రహమ్ – తత్త్వ రత్నావళీ వివరణము.
89. తత్త్వ సందేశః – స్వాధీన త్రివిధ చేతనాచేతన ప్రవృత్తి భేద వివరణము.
90. పర మత భంగమ్ – బౌద్ధ,క్రైస్తవ,అద్వైత మతఖండన.
91. పరమ పద సోపానమ్ – ప్రపన్నులు పయనింపదగు మార్గ వివరణము.
92. ప్రధాన శతకమ్ – తత్త్వత్రయ వివరణము, ప్రపన్నుల విధులు, యుగ ధర్మములు.
93. మధురకవి హృదయమ్ – మధుర కవి ప్రశంస.

94. మునివాహన భోగమ్ - తిరుప్పాణాళ్వారులు రచించిన 'అమల నాది పిరాన్' దివ్య ప్రబంధమును గురించిన వ్యాఖ్యానము.

95. రహస్య త్రయ చులుకమ్ - తిరుమంత్రార్థ వివరణము.

96. రహస్య త్రయ సారమ్ - తత్త్వత్రయ - రహస్య త్రయ వివరణము.

97. రహస్య నవనీతమ్ - రామాయణములోని 'సకృదేవ ప్రపన్నాయ' అను చరమ శ్లోకమునకు అర్థ వివరణము.

98. రహస్య పదవీ - తిరుమంత్రార్థ వివరణము.

99. రహస్య మాతృకా - రహస్య త్రయ వివరణము.

100. రహస్య రత్నావళీ - శ్రీవైష్ణవ సంప్రదాయ వివరణము.

101. అమృత రంజని - 'సంప్రదాయ పరిశుద్ధి' మొదలు, 'సారదీపము' వఱకు గల గ్రంథముల లోని శ్లోకములకు విశేషార్థములు.

## ముగింపు

ఈ రీతిగా వేదాంత దేశికులు - వివిధ విషయములపై శతాధిక గ్రంథములను రచించి, 'కవి తార్కిక కేసరి - సర్వతంత్ర స్వతంత్ర' అను బిరుదములను పొంది, శాశ్వత యశము నార్జించి, శతాధిక వయస్కులై అస్తమించిరి.



# న్యాస వింశతి

—: సంస్కృత మూలము :—

'సర్వతంత్ర స్వతంత్ర - కవితార్కిక కేసరి'

## శ్రీ వేదాంత దేశికులు

—: ఆంధ్ర పద్యానువాదము :—

' గానకళా ప్రపూర్ణ – సంగీత సాహిత్య కళానిధి '

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు



సిద్ధం సత్సంప్రదాయే స్థిరధియ మనఘం శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం
సత్వస్థం సత్యవాచం సమయ నియతయా సాధువృత్యా సమేతమ్
దంబాసూయాదిముక్తం జిత విషయ గణం దీర్ఘ బంధుం దయాళుం
స్ఖాలిత్యే శాసితారం స్వప రహితవరం దేశికం భూష్ణు రప్సేత్.

సత్సంప్రదాయపు సంసిద్ధి గలవాని –
స్థిరమైన బుద్ధితో బరగువాని –
అఘము లంటని వాని, – ఆగమాంతజ్ఞాన
మడగిన బ్రహ్మనిష్ఠు డగువాని, –
సత్త్వ గుణము, సత్య సంభాషణము, శాస్త్ర
నిపిత సాధువర్తి గలవాని, –
డంబ, మసూయయు, డగ్గరించినవాని –
ఇంద్రియమ్ములను జయించువాని –

బంధు భావము, కరుణా స్వభావ మమరి
తనదు హితమును, పరుల హితమ్ముఁ గోరి
తీర్చి దిద్దెడువానిని - దేశికునిగ
నందగావలె కాగల యట్టివాడు.

2

అజ్ఞాన ధ్వాంత రోధా దఘ పరిహరణా
దాత్మ సామ్యా వహత్వాత్
జన్మ ప్రధ్వంసి జన్మ ప్రద గరిమతయా
దివ్య దృష్టి ప్రభావాత్
నిష్ప్రత్యూహానృశంస్యా న్నియత రసతయా
నిత్య శేషిత్వ యోగాత్
ఆచార్య స్సద్భిరప్రత్యుపకరణధియా
దేవవత్ స్యాదుపాస్యః.

అజ్ఞానం బను చీకటిం దునిమి, పాపౌఘంబులన్ గూల్చి, ది
వ్య జ్ఞానాకరమైన జన్మ మిడి, దివ్యంబైన చూ పిచ్చి ని
త్యాజ్ఞావత్సలు డౌట ప్రత్యుపకృతి వ్యాజంబు బోనాడుచున్
విజ్ఞుల్ దేశికు దేవ భావమున సేవింపన్‌వలె న్నిచ్చలున్.

3

సద్బుద్ధిః స్సాధుసేవీ సముచిత చరిత స్తత్త్వబోధాభిలాషీ
శుశ్రూషు స్త్యక్తమానః ప్రణిపతనపరః ప్రశ్నకాలప్రతీక్షః
శాంతో దాంతోఽనసూయుః శరణ ముపగత శ్శాస్త్ర విశ్వాస శాలీ
శిష్యః ప్రాప్తః పరీక్షాం కృతవి దభిమతం తత్త్వతః శిక్షణీయః.

సుమతియు - సాధు సేవకుడు - శుద్ధ చరిత్రుడు - తత్త్వబోధిమం
దమరిన కోర్కెవాడు - నిరహంకృతి - వందనశీలి, ప్రశ్నకున్
సమయు నిరీక్షకుండు - శరణాగతు డీర్ష్యయు లేనివాడు, శా
స్త్రములను నమ్మువాడు - కడు శాంతుడు దాంతుడు శిష్యుడైన యు
త్తముగ బరీక్ష జేసి, నిజ తత్త్వము శిక్షణ మీయగావలెన్.

4

స్వాధీనాశేష సత్తా స్థితి యతన ఫలం విద్ధి లక్ష్మీశ మేకం
ప్రాప్యం నాన్యం ప్రతీయా న చ శరణతయా కంచి దన్యం వృణీయాః
ఏతస్మా దేవ పుంసాం భయ మితర దపి ప్రేక్ష్య మోక్షీ స్తదాజ్ఞాం
ఇ త్యేకాంతోపదేశః ప్రథమ మిహ గురో రేకం చిత్తేన ధార్యః.

సకల జగ న్నియామకుడు - సర్వఫలప్రదు డా రమావరుం
డొకరుడె యం చెఱుంగుము, మరొక్కని జేరకు, వేద కాశ్రయిం
పకుము, తదాజ్ఞ మీరకుము - వాడె భయాపహుడంచు తెల్పు దే
శికు నుపదేశముం దొలుత శీర్షమునన్ ధరియింపగావలెన్

5

మోక్షోపాయార్థ మేవం భవతి భవభృతాం కస్యచిత్ క్వాఽపి కాలే
తద్వత్ భక్తి ప్రవత్త్యో రధికృతి నియమ స్తాదృశా స్యాన్నియత్యా
శక్తాశక్తాది తత్తత్పురుష విషయతః స్థాప్యతే తద్వ్యవస్థా
యచ్ఛాహాస్త ద్వికల్పః సమ ఇతి కతిచిత్ తత్ఫలస్యావిశేషాత్.

ఒకరుం డొక్కెడ నొక్క కాలమున మోక్షోపాయ మిట్టిం దనీ
ప్రకృతిం జిక్కినవారితోన నట్టులే భక్తి ప్రపత్తుల్ తదం
గకముల్ త న్నియమంబు లందును శక్తాశక్త భేదమ్ముచే
నొక పక్షమ్మన రెండు నొందే ఫలమం దొప్పారుటన్ సామ్యమే.

## 6

సానుక్రోశేఽసమర్థే ప్రపదన మృషిభిః స్మర్యతేఽభీష్టసిద్ధ్యై
లోకేఽప్యప్రసిద్ధం న చ విమతి రిహ ప్రేక్ష్యతే క్వాఽపి తంత్రే
తస్మాత్ కైముత్యం సిద్ధం భగవతి తు భరన్యాస విద్యానుభావం
ధర్మస్థేయా శ్చ పూర్వం స్వకృతిషు బహుధా స్థాపయాంచక్రురేవమ్.

అరయ బ్రపత్తియోగ మసమర్థు డభీష్టము నందగా - ఋషీ
శ్వరులు స్మరించి రిందులకు శాస్త్ర విరోధము లేదు, శక్తుడే
సరళిని సిద్ధి గాంచు డని స్థాపన జేసిరి గ్రంథజాలమం
దిపుడుగ న్యాస విద్యను రమేశు పరమ్మగ బూర్వ సూరులున.

## 7

శాస్త్ర ప్రామాణ్య వేదీ నను విధి విషయయే నిర్వింశకోఽధికారీ
విశ్వాసస్యాంగభావే పున రిహ విదుషా కిం మహత్త్వం ప్రసాద్యమ్
మైవం ఘోరాపరాధైః నవది గురు ఫలే న్యాస మాత్రేణ లభ్యే
శంకా పార్ష్ణి గ్రహార్హా శమయితు ముచితా హేతుభి స్తత్తదర్హైః.

ధర శాస్త్రంపు ప్రమాణముం తెలిసి కర్తవ్యమ్మనన్ సంశయ
మ్మరి వర్తించిని ముక్తి కర్హుడై కదా ! ఆ శాస్త్ర విశ్వాసమున్
మరలన్ జేకొన నంగభావమున నా న్యాసంబుచే నేమి చే
కురు యోగ మ్మని యున్న, దాననె కదా ! ఘోరాపరాధార్హులౌదో
నరులం దేరు మహా ఫలమ్ము ద్రుటిలోనన్ శంక యింకేటికిన్ ?

## 8

నేహాభిక్రాంతినాశో న చ విమతి రిహ ప్రత్యవాయో భవే ది
త్యుక్తం కైముత్య నీత్యా ప్రపదనే విషయే యోజితం శాస్త్ర విద్భిః
తస్మాత్ క్షేత్రే త దర్హే సువిదిత నమయై ర్దేశికైః సమ్యగుప్తం
మంత్రాఖ్యం ముక్తి బీజం పరిణతి వశతః కల్పతే సత్ఫలాయ.

ఇందున గీడు లేదు - మరి హెచ్చిన తగ్గిన ప్రత్యవాయముల్
పొంద డటంచు పూర్వ గురువుల్ సమకూర్చిరి న్యాస యోగమున్
పొందికతో త ద ర్ధ మగు భూమిని మోక్షద మంత్ర బీజమున్
చంద మెఱింగి దేశికుడు నాటిన కాలవశాన పాకమున్
జెంది, మహాఫలమ్మె నరచేత నొసంగెడి కల్పవృక్షమౌ.

## 9

న్యాసః ప్రోక్తోఽతిరిక్తల తవ ఇతి కథితః స్వధ్వర శ్చాస్య కర్తా
అహిర్బుధ్న్యోఽప్యన్వవాదీ దగణి దివిషదా ముత్తమం గుహ్య మేతత్
సాక్షా న్మోక్షాయ చాసీ చ్ఛ్రుత ఇహ తు ముధా బాధశంకా గుణాఢ్యే
తన్నిష్ఠో హ్యన్య నిష్ఠాన్ ప్రభు రతిశయితుం కోటి కోట్యంశతోఽపి.

న్యాసమ్మె తపములం దతిశయించ నటంచు
సాధ్వరు వాక్యమం దలరె గాన
నిదియును గాక అహిర్బుధ్న్య సంహిత
వానికి ననువాద మౌను గాన
నిద్దియే త్రిదశుల ఇక్కయందును గూడ
ఉత్తమ గృహ్యమై యుండె గాన
నిదియె సాక్షాన్మోక్ష హేతువుగా లోక
విశ్రుతమై లెస్స వెలసె గాన

న్యాస నిష్ఠము, మరియు - గుణాఢ్యమయిన
ఇహమునన్ దాని బాధ శంకింపవలవ
దన్య నిష్ఠుల దన్నిష్ఠుడైన యాత
డతి శయించును కోటి కోట్యంశములను.

## 10

నానా శబ్దాని భేదా దితి తు కథయతా సూత్రకారేణ సమ్యక్
న్యాసోపాసే విభక్తే యజన హవనవ చ్ఛబ్దభేదా చభక్తాన్
ఆఖ్యా రూపాది భేదః శ్రుత ఇతర సమః కిం చ భిన్నోఽధికారః
శీఘ్ర ప్రాప్త్యాదిభి స్స్వో జ్జగు రితి చ మధూపాసనాదౌ వ్యవస్థామ్.

న్యాసంబున్, విడదీసి తా బలికె నానా శబ్దసూత్రంబు చే
వ్యాసుండున్, యజన మ్మనన్, హవ మనన్ వ్యావృత్తి శబ్దంబునన్
వేసం బందును గల్గియున్న నితరాభిన్నంబులై నట్టు లీ
న్యాసంబం దధికారిభేదమును సద్యఃప్రాప్తి భేదమ్మనున్,
వాసిన్ జెప్పి వ్యవస్థ జేసిరి మధూపాస్త్యాదులౌ విద్యలన్.

## 11

యత్కించి ద్రక్షణీయం తదవన నిపుణే న్యస్యతోఽకించనస్య
ప్రవస్యష్టం లోకదృష్ట్యోఽవ్యవగమిత ఇహ ప్రార్థనాద్యంగయోగః
తస్మాత్ కర్మాంగకత్వం వ్యపనయతి పరాపేక్షణాభావవాదః
సాంగే త్వష్టాంగయోగ వ్యవహృతినయతః షడ్విధత్వోపచారః.

అనచ యొకండు కావదగు నర్థము దక్షిని చెంత న్యాసమున్
బొనరుచువేళ ప్రార్థనము మున్నగు కార్యము లంగ మౌట ఇం
దనుభవ సిద్ధమౌ ప్రపదనాఖ్యము తా నితరా నపేక్షమం
చనెడి మతమ్మె కర్మమను తదంగ మనన్ నిరసించు నెట్లనన్
ఎనిమిది అంగముల్ గలిగి యేక ముఖమ్మగు యోగమ న్నటుల్
చను నుపచార భావమున షడ్విధ లంగము లౌచు నొంతగున్.

## 12

పంచాప్యంగా న్యభిజ్ఞాః ప్రణిజగు రవినాభావ భాంజి ప్రపత్తేః
కైశ్చిత్ సంభావితత్వం య దిహ నిగదితం తత్ప్ర వత్త్యుత్తరం స్యాత్
అంగే ష్వంగిత్వ వాదః ఫల కథన మిహ ద్వి త్రి మంత్రోక్తయ శ్చ
ప్రాశ స్త్యం తత్ర తత్ర ప్రణిదధతి తతః సర్వవాక్యైకకంఠ్యమ్.

అవినాభూతము లంచు జెప్పిరి బుధుల్ న్యాసమ్మునం దైదు నం
గ విధుల్, కొందరి పక్షమం దొనర సంకల్పంబు త త్పూర్వకం
బవు, నంగమ్మున నంగివాదము, ఫలాఖ్యానాదులున్, దాని పై
భవ వాక్యమ్ములు కొన్ని గూడి యుపలబ్ధం బేక వాక్యత్వమే.

## 13

రక్షాపేక్షా న్యసాహ్య ప్రణయవతీ భరన్యాస ఆజ్ఞాది దక్షే
దృష్టా నాఽత్ర ప్రపత్తి వ్యవహృతి రిహ తన్మేలనే లక్షణం స్యాత్
గేహాగత్యాది మాత్రే నిపతతు శరణాగత్యభిఖ్యోపచారాన్
యద్వాఽకార్థ భావా ద్భవతి హి వివిధః పాలనీయత్వహేతుః.

అవనిన్ సాయము గోరువాని యెడ రక్షాపేక్ష, ఆజ్ఞాది దా
న విధుల్ జేసెడు దక్షు చెంతను భరన్యాసంబు, శబ్దంబు లి
య్యవి వర్తింప ప్రపత్తియందు గనబో మా రెండిటన్ జేర్చి కూ
ర్చి విచారింప తదీయ లక్షణమునై చెన్నారు నా రీతిగన్
భువిలోనన్ శరణాగతిన్ బొసగు గీమున్ జేతు నర్థం బనే
క విధార్థంబులు గౌణ భావమున రక్షాహేతుభూతంబులౌ.

## 14

న్యాసాదేశేషు ధర్మత్యజన వచనతో౽కించనాధిక్రియోక్తా
కార్పణ్యం వాంగముక్తం భజనవ దితరాపేక్షణం వ్యపోఢమ్
దుస్సాధేచ్ఛేద్యమా వా క్వచి దుపశమితావన్య సమ్మేలనే వా
బ్రహ్మాస్త్ర న్యాయ ఉక్తస్త దిహ న విహతో ధర్మ ఆజ్ఞాది సిద్ధః.

న్యాసంబు విధియించు నాదేశములయందు
ధర్మ్మ పరిత్యాగ ధర్మ్మముంట
ఇతర మేమియు లేని యత దేత దధికారి
అనెడు నర్థ వినిర్ణయమ్ము గలిగె
కార్పణ్య మొకటి అంగముగ జెప్పబడి, వే
రొక్కదాని అపేక్ష నుజ్ఝగించె
సాధింపలేవి విషయముల నిచ్ఛా ప్ర
యత్నము లుండరాదని వచించె

నటులె వే రొక్కదాని సాహాయ్య విధిని
తొలఁచె బ్రహ్మాస్త్ర సామ్యంబుతోడ గాన
ప్రకటితాజ్ఞాది సిద్ధ ధర్మ్మ నిచయమున
కెట్టి హానియు లేదు గ్రహింప దీని.

## 15

ఆదేష్టుః స్వప్రవృత్తిం తదనుగుణ గణా ద్వ్యన్వితం స్వం ముకుందో
మా మిత్యేకైకశబ్దం వదతి తదుచితం తత్ర తాత్పర్యమూహ్యమ్
త త్ప్రాప్యత్వ ప్రాపకత్వైక్యం సకల ఫలదతాం న్యాసతో౽న్యా నపేక్షాం
ప్రాధాన్యాద్యం చ కించిత్ ప్రథయతి స పదం శ్రీసఖో ముక్త్యుపాయే.

తనదు ప్రపత్తి దెల్పుటకు దానిని బోలు గుణాది యోగమున్
మను దను గూర్చి మాధవుడు మాముని ఏక మటంచు బల్కె నం
దను వగు సర్థ మూహ్య మిట న్యాసఫలమ్మె వినేత యొక్కడే
అనునది తత్ఫల ప్రదత - అందున గల్గు పరా నపేక్ష, శ్రీ
శుని దగు ముక్త్యుపాయతయు జొప్పడ జెప్పెను తత్ప్రశస్తియున్.

## 16

స్వాభీష్ట ప్రాప్తి హేతుః స్వయ మిహ పురుషైః స్వీకృతస్స్యా దుపాయః
శాస్త్రై ర్లోకై చ సిద్ధః పున రుభయథా సిద్ధ సాధ్య ప్రభేదాత్
సిద్ధోపాయస్తు ముక్తౌ నిరవధిక దయః శ్రీమత స్సర్వ శక్తిః
సాధ్యోపాయస్తు భక్తి ర్న్యసన మితి పృథక్ తద్వశీకార సిద్ధ్యై.

తన యిష్టార్థము స్వీకరించు పని శాస్త్రంబందు లోకమ్మునం
దు నుపాయం బని సిద్ధసూక్తి మరి అందున్ సిద్ధమున్ సాధ్యమం
చను భేదమ్మున రెండు ముక్తి కయి అత్యంతానుకంపాగుణం
బొనరన్ సర్వబలుండు శ్రీసఖుడె, సిద్ధోపాయమౌ భక్తి వ
ర్జనమే సాధ్య ముపాయ మద్ది - అతడున్ రంజిల్లగా హేతువౌ.

## 17

అత్యంతాకించనోఽహం త్వదపచరణతః సన్నివృత్తో దయానాథ !
త్వ త్స్వైకాంతధీః స్యాం త్వమసి శరణ మిత్యధ్యవస్యామి గాఢమ్
త్వం మే గోపాయితా స్యాః త్వయి నిహితభరోఽస్మ్యేవ మిత్యర్పితాత్మా
యస్మై సన్యస్త భార స్సకృ దథతు సదా న ప్రయస్యేత్ తదర్థమ్.

ఇల నెది లేని దుర్బలుడ నిత్తరి నేయెడ దప్పు సేయుటల్
దలపున మాలతిన్ నిను దల చుటయందె మనంబు నిల్పెదన్
బలముగ నీవె నాదు శరణంబని నమ్మితి - నాదు భారమున్
నిలిపితి నీ పదాబ్జముల - నీవగు మేలిక నాకు నంచిటుల్
చెలువుగ నాత్మ నర్పణము జేసి, పరార్థముగాన నింకపై
సలుపగరాదు యత్న మొకసారియొ, నిత్యమొ దాని గూర్చియున్.

## 18

త్యక్తోపాయా నపాయా నపి పరమ జహ న్మధ్యమాం స్వార్థ వృత్తిం
ప్రాయశ్చిత్తం చ యోగ్యం విగద ఋణతతి ర్ద్వంద్వవాత్యాం తితిక్షుః
భక్తి జ్ఞానాది వృద్ధిం పరిచరణ గుణాన్ సత్సమృద్ధిం చ యుక్తాం
నిత్యం యాచే దనన్య స్తదపి భగవత స్తస్య యద్వాఽఽప్త వర్గాత్.

ఆ యాధ్యాత్మిక చింతనంబున నుపాయాపాయముల్ వీడి, ఆ
త్మీయంబై తగునట్టి వృత్తమున నెమ్మిన్ మధ్యమావస్థితిన్
ప్రాయశ్చిత్తము గల్గి, తీర్చి ఋణముల్, ద్వంద్వమ్ములన్ సైచుచున్
స్వాయ ద్భక్తిని జ్ఞాన వర్ధమున సత్సంపత్తి గైంకర్యమున్
దా యాచింపన్వలె నా రమేశు నథవా త త్పాద సేవాప్తులన్.

## 19

ఆజ్ఞా కైంకర్య వృత్తి ష్వనఘ గురుజన ప్రక్రియా నేమి వృత్తిః
స్వార్హానుజ్ఞాత సేవా విధిషు చ శకనే యావ దిష్టం ప్రవృత్తః
కర్మ ప్రారబ్ధ కార్యం ప్రపదన మహిమ ధ్వస్త శేషం ద్విరూపం
భుక్త్వా స్వాభీష్ట కాలే విశతి భగవతః పాదమూలం ప్రపన్నః.

అనఘులు దేశికోత్తముల ఆజ్ఞ మెయిన్ భగవత్ప్రియ క్రియా
దినిరతి చక్రసామ్యమున దిర్వచు శక్త్యనురూప సేవలన్
దనరుచు కర్మశేషము ద్వివిధా ప్రకృతమ్మె ప్రపత్తి యుక్తిచే
తునిగి నశింప స్వాభిమతితోన ప్రపన్నుడు జేరు శ్రీపతిన్.

## 20

శ్రుత్వా స్మృత్వాది శ్చ స్వయ మిహ భగవద్వాక్య వర్గైశ్చ సిద్ధం
స్వాతంత్ర్యే పారతంత్ర్యే వ్యనితర గతిభిః సద్భి రాస్థీయమానామ్
వేదాన్తాచార్య ఇత్థం వివిధ గురు జన గ్రంథ సంవాదవత్యా
వింశత్యా న్యాసవిద్యాం వ్యవృణుత సుధియాం శ్రేయసే వేంకటేశః

ఖాతిన్ విన్కిడి వాక్ప్రపాళి భగవ ద్వాక్యమ్మలన్ సిద్ధమై
స్వాతంత్ర్యమున, బారతంత్ర్యమ్మున విద్వత్సేవ్యమానంబునై
ఖ్యాతిన్ గాంచిన న్యాస విద్యను గురు గ్రంథౌఘ సంవాదనం
బౌ తీరొప్పగ వ్యాకరించె నిగమాచార్యుం డొగిన్, బండితుల్
ప్రీతిం జెందగ న్యాసవింశతి యనన్ శ్రీవేంకటేశుండు దాన్.

## సమర్పణ

సంసారావర్తవేగ ప్రశమన శుభదృగ్దేశిక ప్రేక్షితోఽహం
సంత్యక్తోఽన్యై రుపాయై రనుచిత చరితే ష్వద్య శాంతాభిసంధిః
నిశ్శంకస్తత్త్వ దృష్ట్యా నిరవధికదయం ప్రార్థ్య సంరక్షకం త్వాం
న్యస్య త్వత్పాదపద్మే వరద నిజభరం నిర్భరో నిర్భయోఽస్మి.

భవము నెడల్చు దేశికుల పావన దృష్టికి పాత్ర మైతి, బో
దవిలితి నన్యయోగముల, దప్పుడు త్రోవల ద్రొక్కనైతి, శం
క విడచి - తత్త్వ దృష్టి నొడికంబుగ నిన్ స్తుతియించితిన్ ప్రస
న్న వరద ! నాదు భారమును న్యాస మొనర్చితి నీ పదమ్ముపై
జవమున వీడితిన్ మమత - సత్కరుణానిధి ! భీతి ద్రోలితిన్.

* * *

లలిని శ్రీమ త్తిరుమల నల్లాను చక్ర
వర్తి సంపత్కుమారాన్వవాభవుదు
కృష్ణమాచార్యు డిట్టు లాంధ్రీకరించె
న్యాస వింశతి - వరమని యాజ్ఞ చేత.



# శ్రీ వేదాంత దేశికులు -

# సంస్కృత సాహిత్య సేవ

'వ్యాకరణ విద్యా ప్రవీణ-సాహిత్య విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ -

'వ్యాకరణాలంకార - సాహిత్యాలంకార'

**శ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మ,** ఎం. ఏ; పి. ఓ. యల్.



## ఉపక్రమము

" యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా
తత్త దేవాఽవ గచ్ఛత్వం మమ తేజోంశ సంభవమ్. "

— (శ్రీమ ద్భగవద్గీత : 10 - 41.)

అని భగవ ద్వచనము. అనగా - సృష్టిలోని అసాధారణ ప్రభావ సంపన్నము, శోభా సంవలితము, సురుచిర స్ఫూర్తికము నగు ప్రతి వస్తువు నందును భగవ దంశ యున్నదనియు, అయ్యది - సర్వ సమర్థము, సర్వ సుందరము, సర్వ వ్యాపకము నగు భగవ త్తత్త్వమునకు ప్రత్యక్ష ప్రతీక మనియు - ఈ శ్లోక తాత్పర్యము.

సామాన్య మానవునకు భగవ దనుభూతిని సులభము చేయుటకై ఆవిర్భవించిన సత్యవాణి అది. అట్లా భగవ దంశ సంభావితమైనవారే మహా పురుషులు, మహానుభావులు, కారణ జన్ములు, లోకోత్తరులు, మహా నాయకులు. మహా దేశికులు మొదలగు విశిష్ట విశేషములతో వ్యవహరింపబడు చుందురు. అట్టి వ్యక్తులు తరచుగా జనింపరు. ఎప్పుడో, ఎచ్చటనో, ఎట్లో వారి అవతారము సంభవించును. ధర్మ సంస్థాపనము, దీన జన సముద్ధర

ణము, సంఘ శ్రేయము, లోక కల్యాణము మొదలగునవి అట్టివారి ఆవి ర్భావమునకు ఆది కారణములై అలలారుచుండును. అట్టి మహా పురుషులు పుణ్య భారతమున ఎందరో వెలసి, తాము తరించి, పరులను తరింపజేసి యున్నారు. 'శ్రీ వేదాంత దేశికులు' అను అన్వర్థ బిరుదమును స్వీకరించిన శ్రీ వేంకటనాథాచార్యులు కూడ - మహానుభావ పరంపరలో ఒక దివ్య పీఠ మును సంపాదించుకొన్న మహా మనీషి. వీరి చరితమును పరిశోధకులు బహు ముఖములుగా, బహుళముగాను రచించి వెలయించినారు.

## పరిచయము

శ్రీ వేదాంతదేశికులు - తిరుపతి శ్రీనివాస భగవానుని ఘంటావతార మని ప్రతీతి. ఈ విషయమును తమ సంకల్ప సూర్యోదయ నాటక ప్రస్తా వన యందే - "ఉత్ప్రేక్ష్యతే బుధజనై రుపపత్తి భూమ్నా, ఘంటా హరేః సమజ నిష్ట యథాత్మ నేతి" అను మాటలలో - వారే సూచించుకొనిరి. తమ జీవిత మంతయు రామానుజ మతమును సమన్వయించుచు, ఏకైక మహా నాదముతో ఘంట వలెనే విష్ణు పారమ్యమును బోధించుచు గడపిన మహా నీయులు దేశికులు. వారి నాదము విశిష్టాద్వైత సిద్ధాంత మహాఘంటా నాదమై సుప్రతిష్ఠిత మయ్యెను.

వేదాంతదేశికుల విద్యాభ్యాసము చాలవరకు మేనమామ యగు ఆత్రేయ రామానుజుల యొద్దనే జరిగెను. ఇరువదవ వత్సరము వచ్చుసరికే దేశికులు సకల విద్యా పారంగతులై విలసిల్లిరి.

వేదాంతదేశికుల వాస్తవ నామము - వేంకటనాథాచార్యులు అనియే. కాని, వారు సాధించిన వైదుష్యమునకును, వేదాంతోపదేశమునకును

చిహ్నములుగా – 'వేదాంత దేశికులు', 'నిగమాంత దేశికులు', 'వేదాంతా చార్యులు' అను అన్వర్థ బిరుద నామములు వారికి లభించెను.

దేశికుల మేనమామ యగు ఆత్రేయ రామానుజులు – విద్యా గురువే కాక, మంత్రదీక్షా గురువు కూడ అయ్యెను. గరుడ, హయగ్రీవ మంత్రము లను ఆత్రేయ రామానుజులు – తమ మేనల్లు డగు వేదాంతదేశికుల కుపదే శించి, వారి ప్రతిభకు వన్నెను, వాసిని–చేకూర్చిరి.

క్రీ. శ. 1295 ప్రాంతమున – కాంచీపుర శ్రీవైష్ణవ సింహాసనాధి పతు లగు ఆత్రేయ రామానుజులు పరమ పదము నలంకరించిరి. అపుడు, ఆ సింహాసనాధిపత్యము వేంకటనాథులకు లభించెను. మఱి కొంత కాలము నకు శ్రీ వేదాంతాచార్యుల ప్రతిభా విశేషములను వినియు, వారి శక్తి సామ ర్థ్యముల నెరింగియు – శ్రీ సుదర్శన భట్టాచార్యులు శ్రీరంగ సింహాసనాధి పత్యమును శ్రీదేశికులను అభిషిక్తుల గావించిరి. ఇట్లు సింహాసన ద్వయాధి పతులై శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత వైశిష్ట్యమును దేశికులు – శిష్యులకు, భక్తులకు, పండితులకు, పామరులకు – అందరకును ప్రవచించుచు, తమ ప్రతిభా వైభవములను ప్రదర్శించుచుండిరి. అంతియు గాక, నిరుపమాన కవితా స్రోతస్వినీ ప్రవాహ పరిపూర్ణులై, నిశిత తర్క వచః పరాభూతసకల ప్రతిద్వంద్వులై, అనేకములగు సాహిత్య ప్రక్రియలను సంస్కృత–తమిళ భాషలలో సంతరించి, పరమత విధ్వంసన, స్వమత స్థాపనావహములు నయిన గ్రంథము లనేకములను రచించియు – 'కవితార్కిక కేసరి' అను బిరుదమును నైతము పొందగల్గిరి.

## తీర్థాటనము

వేంకటనాథులు కొంత కాలము తీర్థాటనము గూడ జరిపిరి. బృందా వనము, మధుర, అయోధ్య, ద్వారక – మొదలగు ఉత్తర క్షేత్రములను, తిరుపతి, మధుకాంతకము, తిరుక్కోయిలూరు – మొదలగు పెక్కు దక్షిణ

తీర్థములను వారు సేవించిరి. ఐనను, వారి వైదుష్యముతో విలసిల్లిన స్థలములు మూడు మాత్రమే యని చెప్పవలెను. అవి-కాంచీపురము,తిరువాహీంద్రపురము, ప్రస్తుతము మదరాసు రాష్ట్రములోని 'కడలూరు' పట్టణమునకు సమీప గ్రామ మగు 'శ్రీరంగము' అనునవి.

## స్తోత్ర గ్రంథ రచన

తిరువాహీంద్ర పురమున వేంకటనాథులు ఇంచుమించు పదునైదు వత్సరములు నివసించిరి. అచటనే వారనేక గ్రంథములను రచించిరి. అట్టి వానిలో - స్తోత్ర - గ్రంథములే అధికము. ఒకపుడు కంచి యందును, మరి యొకపుడు శ్రీరంగమునందును వసించుచు, గ్రంథములను రచించుచు, పీఠ ద్వయమును ఉపదేశ మణిప్రభా ప్లావితము గావించుచును - పవిత్ర జీవితమును గడపిరి.

## ప్రతిభా విశేషములు

ఈ వేదాంతాచార్యులను గురించి అద్భుత కథ లనేకములు వ్యాప్తిలో నున్నవి. అట్టివానిలో ముఖ్యమైన విశేషములు రెండు మాత్రమే మచ్చుకు పేర్కొనబడుచున్నవి. 1) అద్వైత కవులతో పోటీ పడి, 'పాదుకా సహస్రము' అను స్తోత్రమును ఒకే రాత్రిలో రచించిరి. 2) 'సంకల్ప సూర్యోదయము' అను నాటకమును మరియొక రాత్రిలో రచించిరి. ఈ వేంకట నాథులకు తెలియని విద్యకాని, శాస్త్రము కాని, కళకాని-లేదని ప్రతీతి. అందులకే వారు - 'సర్వ తంత్ర స్వతంత్ర' అను బిరుదమును పొందగల్గిరి.

## దేశిక రచనలు - సంక్షిప్త పరిచయము

స్వమత స్థాపకములు, పరమత భంగకములు, సిద్ధాంత ప్రతిష్ఠాపకములు, నీత్యుపదేశదాయకములు, శ్రీవైష్ణవాచార ప్రబోధకములు నగు గ్రంథములను వేంకట నాథులు శతాధికముగ రచించిరి. అట్టివానిలో - పరి

మాణమున కొన్ని లఘువులు, కొన్ని గురువులు నున్నవి కాని, గుణ సంపదను బట్టి చూచిన, అన్నియు గురువులే యనదగియున్నవి. ఈ గ్రంథములను ఇంచు మించు ఆరు ప్రథాన శాఖలుగ విభజింపవచ్చును. 1) శ్రీవైష్ణవాచారములను, మత రహస్యములను ప్రతిపాదించు రచనలు. 2) శ్రీవైష్ణవ మత రహస్యములను, అర్చనా విధానములను ప్రతిపాదించు రచనలు. 3) భక్త్యుపదేశ ప్రధానము లయిన గ్రంథములు, 4) కేవల సాహిత్య ప్రక్రియలు (కావ్య నాట కాదులు), 5) తాత్త్వికమైన పరిష్కార గ్రంథములు, 6) వ్యాఖ్యా గ్రంథములు - అనునవియే అ విభాగములు. ఆ యా విభాగములకు జెందిన గ్రంథములు ఈ క్రింద పేర్కొనబడుచున్నవి.

## 1. శ్రీవైష్ణవాచారములను మత రహస్యములను - ప్రతిపాదించు రచనలు :-

ఇవి సంస్కృతములోను, తమిళములోను, సంస్కృత తమిళభాషలు రెండును కలిసిన 'మణిప్రవాళ' యను నూతన శైలిలోను-రచింపబడినవి. న్యాస దశకము, న్యాస వింశతి, యజ్ఞోపవీత ప్రతిష్ఠ, ఆహార నియమము, శ్రీవైష్ణవ దినచర్య, తత్త్వనవనీతము, రహస్య నవనీతము-మొదలగునవి అరువది వరకు ఈవర్గమునందు చేరును. ప్రపత్తి మాహాత్మ్యము, వైరాగ్య ప్రశంస, ఏకాదశీ నియమ విశేషములు, వైష్ణవుల వివిధాచార సంప్రదాయ ప్రబోధము - మొదలగునవి వీనియందలి విషయములు. ఇవి గ్రంథ పరిమాణమునుబట్టి, చిన్న చిన్నవిగా నుండును.

## 2. శ్రీవైష్ణవ మత రహస్యములను, అర్చనాది విధానములను ప్రతిపాదించు రచనలు :-

ఇవి సంస్కృతములోను, మణిప్రవాళ శైలిలోను ఉన్నవి. నిక్షేప రక్ష, పాంచరాత్ర రక్ష, సచ్చరిత్ర రక్ష, రహస్యత్రయ సారము-మొదలగునవి ఎనిమిది గ్రంథములు ఈ వర్గమునందు చేరును. ఇవియును చాల వరకు లఘువులే.

### 3. భక్త్యుపదేశ ప్రధానము లయిన గ్రంథములు :-

ఇవి చాల వరకు-సంస్కృత మందును, ఒకటి రెండు ప్రాకృత భాష యందును కూర్చబడినవి. గద్య పద్యాత్మకము లయిన స్తోత్రములు - ఈ వర్గములో అధికముగా గలవు, హయగ్రీవ స్తోత్రము, గోపాల వింశతి, అభీతి స్తవము, అచ్యుత శతకము, గరుడ దండకము, సుభాషిత నీవి, పాదుకా సహస్రము - మొదలగునవి ఇరువది యారు కృతులను ఈ విభాగములో చేర్చవచ్చును. ఈ కృతులు-గురు లఘు సమ్మేళన మన నగును.

### 4. కేవల సాహిత్య ప్రక్రియలు :- (కావ్య నాటకాదులు)

ఇవి సంస్కృత మయములు. యాదవాభ్యుదయము - సంకల్ప సూర్యోదయము, హంస సందేశము, దయా శతకము, గోదా స్తుతి-అనునవి యైదును ఈ విభాగములో చేరును. ఈ యైదును-ఇందులో మున్ముందు విపులముగా చర్చింపబడగలవు.

### 5. తాత్త్వికమైన పరిష్కార గ్రంథములు :-

ఇవియు సంస్కృత మయములే. విశిష్టాద్వైత మతసిద్ధాంతములను-తర్కాన ప్రణాళికతో సమర్థించి స్థాపించుట - ఈ గ్రంథముల కృత్యము. వీనిలో - వేంకట నాథుల వాద పటిమ, తర్క చాతుర్యము, ప్రతి పదము నందును ఉట్టిపడుచుండును. న్యాయ పరిశుద్ధి. న్యాయ సిద్ధాంజనము, శత దూషణి, సేశ్వర మీమాంస, పర మత భంగము, వాదిత్రయ ఖండనము - మొదలగు పండ్రెండు గ్రంథములు ఈ కోవలో చేరును. ఇవి యన్నియు - అన్ని విధముల - గురు గ్రంథములే.

### 6. వ్యాఖ్యా గ్రంథములు :-

ఇం దొకటి తమిళము. తక్కినవి సంస్కృతమయములు. అన్నియు-శ్రీభాష్యాది మూల గ్రంథములకు విపుల వ్యాఖ్యా రూపకములు. తత్త్వ

టీక, తాత్పర్య చంద్రిక, చతుశ్శ్లోకీ భాష్యము, గద్యత్రయ భాష్యము-మొద లగు ఎనిమిది ఉద్గ్రంథములు ఈ శాఖకు చెందును.

పైని వివరించిన శతాధిక గ్రంథములలో-ఒండు రెండు ప్రకృతము లభ్యము కావు. ఇంకను మరి కొన్ని ప్రమాణముల వలన, దేశికులు నూట యేబది (150) వరకును రచనలు కావించినట్లు ఊహింపవచ్చును. కాని, అవేవియు నేడు ఉపలబ్ధములు కావు. వానిని గూర్చిన చర్చయు - ఇట అనా వశ్యకము.

## దేశికుల సంస్కృత సాహిత్యము - లఘు సమీక్ష

'హితము' అనగా రసము. సహృదయు లందరకును ఆనందమును కలిగించునది కావున, అది హితమైనది. హితముతో కూడినది "సహితము". "సహితస్య భావః - సాహిత్యమ్" అని వ్యుత్పత్తి. 'రసము - రసాస్వాద మును అందించునది - సాహిత్యము' అని-ఆలంకారిక శిరోమణులు,కవితా రహస్య వేదులు నగు పెద్దల తాత్పర్యము. వాగ్వికార మంతయు - సాహి త్యము కానేర దనియు, సరస వాగ్గుంఫనమే సాహిత్య పదార్థ మగుననియు సారాంశము. ఈ పద్ధతి ననుసరించి చూచినచో - శాస్త్ర గ్రంథములు మొదలగునవి సాహిత్య విభాగమున జేరవు. భావనా నిదానములై, చమ త్కార జనకములై, జీవద్వర్ణనా రూపములై యున్న గ్రంథములే ఈ విభా గమున జేరదగినవి. కాగా, వేదాంత దేశిక వాఙ్మయ సాగరములో - సాహిత్యామృత కలశములని చెప్పదగినవి సహృదయామర పేపీయ మానములైనవి, కవి మకుట జేగీయమానములైనవియు - అయిదారు గ్రంథములు, కొన్ని స్తోత్ర కావ్యములును - విలసిల్లుచున్నవి. 'హంస సందేశ' మను నొక లఘు మహా కావ్యము, 'యాదవాభ్యుదయ' మను నొక గురు మహాకావ్యము, 'సంకల్ప సూర్యోదయ' మను నొక మహానాట కము, 'దయా శతక' మను నొక స్తోత్ర కావ్యము, 'గోదాస్తుతి, యనునొక

స్తోత్ర కావ్యము, ప్రముఖములగుకొన్ని స్తోత్ర కావ్యములును-పై పట్టికలో చేరును. ఈ సంస్కృత సాహిత్య ఖండముల స్వరూప స్వభావములను, మాధుర్యమును గ్రహించి దేశికుల వైశద్యమును దర్శింతము గావుత !

1. హంస సందేశము :-

ఇది రెం డా శ్వాసముల కావ్యము. మొదటి యాశ్వాసమున అరువది, రెండవ యాశ్వాసమున ఏబదియు - మొత్తము నూట పది పద్యములతో కూర్చబడిన వాగ్దేవీ కంఠహారమై యిది యొప్పచున్నది. కాళిదాసుని మేఘ సందేశము జగత్ప్రసిద్ధము. అయ్యది ఒక నూతన సాహిత్వ ప్రక్రియ, సర్వాంగ సుందరము, రస పరిపూర్ణము నగు సాహిత్య మంజూష. అద్దాని అడుగు జాడలలో వెలసిన సందేశ కావ్యములు - సంస్కృత సాహిత్య భాండాగారములో పెక్కు లున్నవి. కాని, దాని ప్రమాణమును మాత్రము సాధింపలేకపోయినవి. కాళిదాసునందు గల గౌరవ భావముతో - అతని మేఘ సందేశము వలన భావావేశము నంది, అట్టి కావ్యమునే రచింప సమ కట్టి, ప్రమాణమునందు సైతము సమతను సాధించి,'హంస సందేశము'ను భావుక వర్గమున కందించి, 'సెబాస్' అనిపించుకొన్న వ్యక్తి వేంకటనాథు లొక్కరే. సందేశ కావ్యములో - గ్రంథ పరిమాణ మధికముగ నుండదు. ప్రకృతి దృశ్యములను మనోహరముగ కనులకు గట్టినట్లు వర్ణించుట, భావుక భావ తరంగములను ఉవ్వెత్తుగ లేవదీయుట, ప్రేమరహస్యములను వింగళించుట, ప్రేమికుల హృదయములను విప్పి చూపుట, రచన - లయ బద్ధమై, సంగీతానుగుణముగ వరలుటయు-సందేశకావ్యము యొక్క ముఖ్య లక్షణములు. మిగుల సున్నితమైన విప్రలంభ శృంగార మిందు సర్వా వయవ వ్యాపకముగ నుండును. అందుచేతనే - "బహు రత్నీయసీ దృశ్యతే గుణః " (చిన్న వస్తువునందు పెద్ద గుణ ముండుట) అను లోకోక్తి ననుస రించి, పరిమాణమున అల్పమైనను, ఇట్టి కావ్యమును - గుణ గౌరవమును బట్టి, మహా కావ్య మనుచుందురు.

వేదాంత దేశికులు హంస సందేశమునకు - మేఘ సందేశమునే మాతృకగా నుంచుకొనె ననుటలో నేమాత్రము సంశయము లేదు. అదియే కథా ప్రణాళి. అవియే వృత్తములు. ఇంచు మించు - అదియే గ్రంథ పరిమితి. అట్టిదే వర్ణనా ఫక్కిక. అట్టివియే లోకోక్తి పుంజములు. అయినను, హంస సందేశము - మేఘ సందేశమునకు కేవలము ప్రతికృతి మాత్రము కానేరదు.

శ్రీరాముడు హనుమంతుని వలన లంకలో నున్న సీత యొక్క వృత్తాంతమును విని, సీతానయనమును నిశ్చయించుకొనును. కాని, సీత యొక్క దయనీయ స్థితిని తలంచుకొనుటచే-అతనికి రాగోద్దీపనము జరిగి, విరహతాప మత్యధిక మగును. ఒక రాత్రియంతయుఅట్లు బాధపడి, మ్మసనా దుదయమున - సమీపమందున్న క్రీడా సరస్సులో నొక రాజ హంసను గని, దాని ద్వారమున సీత కొక ప్రణయ పూర్ణ మగు సందేశమును పంప సమకట్టి, హంస నర్థించును. దానికి లంకా మార్గమును, సందేశమును ఉపదేశించును. ఇది - హంస సందేశము యొక్క యితి వృత్తము.

సామాన్యముగా సందేశ కావ్యములు - నాయకుడు దూతకు సందేశమును చెప్పుటతోనే ముగించును. విరహ సంతప్తు డగు నాయకుని భావ రేఖలను చిత్రించుటయే సందేశ కావ్యము యొక్క ప్రముఖ లక్ష్యము. తరువాతి యంశ మంతయు-భావుకుని ఊహా ప్రపంచమునకు విడువబడును. హంస సందేశము కూడ నట్లే ముగిసినది. కాని, చివరిపద్యములో - శ్రీరాముడట్లు సందేశము నంపి, వెంటనే రావణుని జయించి, సీతతో కలిసి, అయోధ్యకు చేరినట్లు - నాయికా నాయకులను తుదకు కలుపుట-సందేశ కావ్య సామాన్య ప్రణాళికకు అనుకూలము కాదు. అయినను, వేంకటనాథు డిట్లు వర్ణించుట కొక తాత్పర్య మున్నదని యూహింపనగును. కాళిదాసుని సందేశకావ్యము, తదనుసారు లగు కావ్యాంతరములును-కేవలము మానవ ప్రేమను, విరహమును త త్స్వరూప స్వభావములను చిత్రించుటకు మాత్రమే యుద్యమించి

నవి. హంస సందేశ మట్లు గాక, దివ్య ప్రేమను వివరించుటకు పూను కొన్నది. విప్రలంబ శృంగారము మాత్రమే యిందు వ్యంగ్యమై యూరు కొనదు. దానితోపాటు-శ్రీవైష్ణవ తత్త్వ రహస్య మొకదానిని చూచాయగా భక్త శిఖామణుల కందిచ్చును. ఇట్లు కొంతవరకు సంకేతికార్థమును బోధించు రచనా పద్ధతిని – 'సాంకేతిక రచన' – యందురు. దేశికులు తమ రచన లన్నింటిని – శ్రీవైష్ణవ సిద్ధాంత బోధకములుగనే సాగించిరి. లౌకిక విషయముల కందు తావు లేనే లేదు. కొన్ని రచనలు వాచ్యముగ, మరి కొన్ని వ్యంగ్యముగ, ఇంకను కొన్ని సంకేత ప్రాయముగను విశిష్టాద్వైత తత్త్వమును వెల్లడించుచుండును. కావున, వాని నన్నింటిని - శ్రీవైష్ణవ సువర్ణ డిండిమము లని పేర్కొనవచ్చును. హంస సందేశము ఛాయా రూపముగా కనబరచు రహస్య మి ట్లుండును :–

'శ్రీరాముడు సకల కల్యాణ గుణ నిలయుడు, దయానిధి యగు పరాత్పరుడు. సీత–భగవ దంశము, భగవ ద్విరహ వేదనా సహిష్ణువు నగు జీవము. భగవంతుడు జీవుని విరహమును సహింపలేడు. ఇరువురను విడ దీసిన సంసారమే రావణుడు. శుద్ధ సత్త్వ స్వరూప మగు హంస - పరమ ప్రసన్ను డగు ఆచార్యుడు. ఆచార్య సందేశము వలన జీవుడు ముక్తుడై, పరమ పదము నందును. ఆ పరమ పదమే అయోధ్య.

ఈ తత్త్వమును స్ఫురింప జేయుటకే వేంకటనాథులు నాయికా నాయ కుల పున స్సమావేశమును ఉపవర్ణించిరి. ఇయ్యది – దివ్యప్రేమ లీలా విలాస ప్రపంచమున ఆవశ్యకము. ప్రపత్తి మార్గమునకు అవినాభూతము. శరణాగతికి శరణ్యము.

## 2. యాదవాభ్యుదయము :–

క్షీరసాగర మంతటి మహాకావ్య మిది. విబుధ వరేణ్యులు సతత మతమై మథించినచో – తత్త్వామృతమును సమగ్రముగ సమర్పింపగలదు.

అయితే, భావుక సందోహ సామాన్యముగ ఆ యమృతమును పంచిపెట్టుటకు మరొక మోహినీ స్వరూపమే సమర్థ మగు నేమో! సంస్కృత సాహిత్య మహా సాగరములో - అనర్ఘమైన మహా కావ్య రత్నములు కొలదిగనే యున్నవి. అందీ యాదవాభ్యుదయ మొకటి. మహాకావ్య బిరుదము దీని కన్ని విధముల అన్వర్థమై యొప్పుచున్నది. పరిమాణమును బట్టి, శబ్దాలంకార వైశిష్ట్యమును బట్టి, భావనా సౌందర్యమును బట్టి, శ్రీవైష్ణవ రహస్యామ్నాయమును బట్టి, విగళిత వేద్యాంతరమును బట్టి - ఇది యది యన నేల? మహాకావ్యతా సంపాదక మయిన ఏ గుణములను బట్టి పరిశీలించినను - యాదవాభ్యుదయము మహా కావ్యమే యగును.

ఇయ్యది యిరువది నాలుగు సర్గల కావ్యము. శ్రీకృష్ణుని యవతారము మొదలుకొని, మహాభారత భాగవతాది పురాణసముదాయములో నుపలబ్ధము లగు శ్రీకృష్ణ చరిత ఘట్టములను, లీలా విభూతులను - కూలంకషముగ నేకరించి, 'శ్రీకృష్ణ లీలా సర్వస్వ' మన దగినట్లు ఇతి వృత్తమును ప్రపంచించి, గోపీకృష్ణ దివ్య ప్రేమానుభవమును సంప్రదాయానుగుణముగ వ్యాఖ్యానించుటతో - దేశికులు కావ్యమును ముగింతురు.

యాదవాభ్యుదయములోని ముఖ్య తత్త్వము మాత్రము దివ్యప్రేమ విభూతియే. ఆళ్వారుల మధుర భక్తి సంప్రదాయమును సంపాదించి, తమకు శ్రీమన్నారాయణునియందు ప్రేమకు - అన్యాపదేశమున, లేక - ఆత్మాశ్రయ కవితా ధోరణిలో అభివ్యక్తము గావించినారు - భక్త పుంగవు లగు వేదాంత దేశికులు.

### 3. సంకల్ప సూర్యోదయము :-

విశిష్టాద్వైత తత్త్వమును విశిష్టముగ, పండిత - పామర మనోరంజకముగ ప్రసరింపజేయుటకు కృతనిశ్చయులైన కృతకృత్య మూర్ధన్యులు వేదాంతదేశికులు. ఘంటావతారు లగు వారు - సంకల్ప సూర్యోదయమును

రచించి, విష్ణుసారమ్య ఘంటా నాదమును శ్రీవైష్ణవ శ్రోత్రకుహరములలో శాశ్వతముగ ప్రతిష్ఠించినాడు.

సంకల్ప సూర్యోదయము పది యంకముల రూపకము. వివేకము, సుమతి, సిద్ధాంతము, తర్కము, వాదము, సంకల్పము, శ్రద్ధ, విష్ణుభక్తి, మహా మోహము, దుర్మతి - మొదలగునవి పాత్రములు. శాంతముప్రధాన రసము. 'భక్తి ప్రపత్తుల వలననే పరమ పదమును పొందవచ్చును' 'శ్రీమన్నారాయణుడే పరతత్త్వము', 'మతాంతరము లుపాదేయములుకావు' అను సంశములు సూత్రప్రాయముగా నిందు ప్రతిపాదింపబడినవి. శాస్త్ర సిద్ధమై, పటిష్ఠమైన వాక్య విన్యాసము అడుగడుగునను, మహా భావ పరిపూర్ణ ము లగు పద్యములు. అయ్యవి బహు శత సమిమ్మిశితములు, సుదీర్ఘ సంభాషణములు, యుక్తి ప్రతియుక్తులు. కొల్లలుగ లోకోక్తులు. మొత్తముపై యాదవాభ్యుదయము వలెనే యిదియును ఒక మహా ప్రబంధమై యలరారుచున్నది

శ్రీరామానుజ మత తత్త్వమును, ఆళ్వారుల ద్రావిడామ్నాయరహస్యములను, తర్క కర్కశము లగు సంభాషణములతో నిందు వెల్లడించుట దేశికుల యభిప్రాయము. కావున, ఈ సంకల్ప సూర్యోదయమును కేవల రూపకముగా గాక, శ్రీవైష్ణవ సిద్ధాంత లఘు సర్వస్వముగా భావించుకొనుటయే సముచితము.

ఈ నాటక మందలి ప్రధాన ప్రతిపాద్యము మాత్రము ప్రపత్తి-లేక శరణాగతి. భక్తి యొక్క పరాకాష్ఠయే ప్రపత్తి. భక్తి - మూల సదృశమైనచో, ప్రపత్తి-భాష్య సమిమ్మితము. భక్తి-వేద సంహిత అనుకొన్నచో, ప్రపత్తి-ఉపనిషత్తు. "సర్వధర్మాన్ పరిత్యజ్య, మా మేకం శరణం వ్రజ" అన్న భగవానుని యుపదేశము ననుసరించి, మహా విశ్వాసముతో జీవుడు శ్రీమన్నారాయణుని శరణు జొచ్చుటయే ప్రపత్తి. ఇయ్యది-రామానుజాగమ సారము. ఆళ్వారుల ఆమ్నాయ సాగరమును మథించి సంపాదించిన

అమృతము. ఈ యంశమునే దేశికు లీ నాటకమున బహు ముఖములుగా ప్రవచించినారు.

**4. దయా శతకము :-**

తిరుమల ప్రభు వగు శ్రీనివాసుని పాదారవిందములందు శరణాగతులైన వేదాంతాచార్యులు - అనన్య భావనతో సమర్పించిన అష్టోత్తర శత పద్య కుసుమాంజలి యీ శతకము. ఇట్టి శతకములు, స్తోత్రములును - ఎన్నియో యీ కవిసింహుని ధీర గంభీర స్వరములుగ వెలువడియున్నవి. అయినను, భావనా ప్రకర్షను, కవితా రహస్య సముదాయమును పరిశీలించి, సాహిత్య వేత్తలు - ఈ దయాశతకమును, గోదా స్తుతిని మాత్రమే సాహిత్య ప్రపంచములో విశిష్టములుగా పరిగణించినారు. కేవల స్తోత్రము లన్నియు అంత మాత్రమున తీసిపోయినవని భావము కాదు. సాహిత్యతా నిదానము లగు కొన్ని లక్షణములను పురస్కరించి, అట్లు వర్గీకరించుట భావుక వర్గమునకు సహజ లక్షణము. ఆర్ద్ర హృదయమును ప్రతి క్షణమునను - కదిలించివేయు నొక సున్నితమైన భావము నూతగా గొని, రూపకోత్ప్రేక్షకాది భావనా విధానములగు అలంకారములతో, ప్రకృతి దృశ్యచిత్రీకరణములతో సరస్వతి యందెల సవ్వడిని బోలు పద సముదాయముతోను-పర్వు లెత్తిన కవితా స్రవంతిని 'భావకావ్య' మని వ్యవహరించుట-అధునిక సాహిత్య పరిశీలకుల సంప్రదాయము. ఇట్టి కావ్యమునకు సంగీతమునుగూడ మేళవించినచో- అది సర్వ ప్రాణి సంమోహన మగును. ఇట్టి కావ్యములనే పాశ్చాత్య సాహిత్య పరిభాషలో-'లిరికల్ పొయిట్రీ' అందురు. హంస సందేశ సమీక్షా సందర్భమున, ఈ యంశములు కొలదిగ ప్రస్తావింపబడినవి. అవసర మని, మరల నిచట పునశ్చరణము జరిగినది.

కాగా - దయా శతకము, గోదాస్తుతి అను నీ రెండింటిని - 'భావ కావ్యములుగా' - పరామర్శించి, మిగిలిన స్తోత్రములను స్థాలీ పులాక న్యాయముగా పరిచయము చేయుట సంకల్పితము.

దయా శతకము శ్రీనివాస భగవానుని చరణ శరణాగతు లయిన నిగమాంత దేశికులు - శ్రీశుని దయా విభూతి నుద్దేశించి కావించిన ఆత్మ నివేదనము. శ్రీమన్నారాయణునకు - లీల, దయ - అను రెండు మహా విభూతులు కలవు. అందు మొదటిది - జీవులను సంసారమున బడవేసి, వినోదించుచుండును, రెండవ దగు దయ-జీవులను సంసార కూపము నుండి ఉద్ధరించుటకు సదా ప్రయత్నించుచుండును, ప్రయత్నమే కాదు. సమగ్రముగ నుద్ధరించి, చరితార్థులను చేయును. ఆ దయ - జగజ్జనని-శ్రీనివాసునే వీర విహారము చేయకుండగ నియమింపగల మహా శక్తి. అట్టి దయామ తల్లి నుద్దేశించి, త మ్ముద్ధరింపు మని భక్తులు వివిధముగ గావించిన ఆక్రోశములు - భక్తి సాహిత్యములో అనేకములు. అట్టివానికి తలమానిక మీ దయా శతకము. ఇందు వేంకట నాథులు - దయను పర స్వహస్త రూపములతో, ఉత్ప్రేక్షలతోను సంభావించి, భావుకుల హృదయములను - భక్తిరసాప్లావితముల జేసినారు.

**5. గోదా స్తుతి :-**

ఇరువది తొమ్మిది శ్లోకములతో గూడిన చిన్న ఖండ కావ్య మిది. శ్రీ విష్ణుచిత్తుల కుమారీ రత్నము 'అండాళు'. ఆమె శ్రీరంగనాథుని వలచి, తపించి, తుద కా స్వామికి ఆత్మార్పణము గావించుకొన్నది. ఈ సాధ్వీ మణియే గోదాదేవి. ఈమె చరితము - వైష్ణవ సంప్రదాయులకు సదా ఉపాదేయము. ఈమె ప్రేమ - ప్రపన్నులకు శిరోధార్యము. అహమహమికతో అనుసరింపదగిన - మధుర మధురమైన ప్రేయసీ భావ మది. ఆళ్వారు లందరును అవలంబించిన మార్గ మది. శ్రీశుని చరణ సాన్నిధ్యమును పొందుటకు - ఉత్తమోత్తమ మయిన సాధనము. "తేషాం నిత్యాభియుక్తానాం యోగ క్షేమం వహా మ్యహమ్" అని, భగవానుడు ముక్త కంఠమున జెప్పిన మహోపదేశము. అందువలననే, పరమ భాగవత పరంపరలో-గోదాదేవికి ప్రముఖమైన స్థాన మున్నది. కావుననే, వేదాంత దేశికులును

గోదాదేవి నుద్దేశించి, తమ మధుర భావకోకిలల నుల్లము నుల్లసింపపాడిరి. ఆమె యవలంభించిన మార్గము - తమకును శరణ్య మని సంభావించిరి.

ఇంతలో - ప్రధానముగ వర్గీకరించి పరామర్శింప దలచిన దేశిక సాహిత్య పిండ ఖర్జూరములను భావుక సమక్షమున నుంచిన ట్లయినది. అనుభవించి ఆనందించుట - వారి వంతే మరి.

## స్తోత్రములు

అనన్య సాధారణమైన భక్తి ప్రపత్తి భావములతో వేదాంతాచార్యుల కంఠము నుండి వెలువడిన స్తోత్ర కావ్యములు సుమారు ముప్పది వరకు నున్నవి. పైని చూపిన 'గోదాస్తుతి', 'దయా శతకము' కూడ - ఈ సంఖ్య యందు చేరినవే. అయినను-ఒక ప్రత్యేకమైన చూపుతో ఆ రెండింటిని వేరు చేయుట సంభవించినది. ఇతర స్తోత్రములును కావ్య సంపత్సమృద్ధములే యని ఇంతకు మున్నే సూచిత మైనది కదా ! అయినచో - స్తోత్రముల నన్నిటిని యథా తథముగ పరామర్శించినందువలన, గ్రంథ విస్తరమగును. కావున, కొన్నింటిని మాత్రమే దిగువ పరిశీలించుట జరుగును.

ఏదైన నొక దేవతా మూర్తిని భావించి, భక్తి మార్గము లగు వాక్కులతో - తదర్పితము చేయబడిన సారస్వత ప్రక్రియను - 'స్తోత్ర' మని వ్యవహరింతురు. పాదాది కేశాంత వర్ణనము, కేశాది పాదాంత వర్ణనము, గుణ గణ వర్ణనము, స్థల వర్ణనము, పరిసర వర్ణనము - మొదలగునవి ఇందు ప్రధాన విషయములై యుండును. ఏదియో నొకటియే లక్షణ ముండవలె నన్న నియమ మేదియు లేదు. భక్తుడు తనకు తోచిన విధమున, భగవానుని కీర్తించుటయు, అచట నచట కాననగును. ఇట్టి రీతితో నడచినదేశిక స్తోత్ర సముదాయములో-'హయగ్రీవస్తోత్రము' మొదట పేర్కొన దగినది.

**1. హయగ్రీవ స్తోత్రము :-**

హయగ్రీవుడు దేశికుల కిష్టదైవము. ప్రత్యక్ష మయి, నోట నమృతము చిలికి, దేశిక వాణికి అమృతత్వమును ప్రసాదించిన మహా మూర్తి, శ్రీ వైష్ణవ సంప్రదాయములో-విద్యలకు అధిదైవతమైన మహాను భావుడు. కావుననే, వేంకటనాథులు ఉత్కటమైన కవితావేశముతో, ఉత్కంఠ తోను ఈ స్తోత్రమును రచించిరి. హయగ్రీవుని శుద్ధ స్ఫటిక సదృశునిగ, కాంతిస్వరూపునిగ, విద్యల కధిపతిగ, గురువుగ, వా గధీశునిగ - ఇంకను ఏన్నో విధములుగను స్తుతించి, తమ వా క్ప్రవాహముల కనర్గళత్వమును, అజేయత్వమును ప్రసాదింపు మని యర్థించిరి. అతి ప్రసిద్ధ మయిన "జ్ఞానా నందమయం దేవం" ఇత్యాది శ్లోకము - ఈ హయగ్రీవ స్తోత్ర మందలి శ్రీకారమే.

**2. గరుడ పంచాశత్ :-**

తాము ఉపదేశమును పొంది, జపించి, సంపూర్ణ సిద్ధిని పొందిన గరుడ మంత్రమున కధిదేవత యయిన గరుడు నుద్దేశించి, ఉత్తుంగ గంగా ప్రవాహమువలె మహా గంభీరమైన ధాటితో కవితా దేవీ స్రగ్ధర లగు స్రగ్ధరా వృత్తములతో వేదాంత దేశికులు సాగించిన స్తోత్రరత్న మిది.

**3. భగవ ద్ధ్యాస సోపానము :-**

శ్రీనివాసుని దయ నుద్దేశించి వెలువడిన దయా శతకము వలెనే, శ్రీరంగనాథుని సౌందర్యము నుద్దేశించి వెలువడిన స్తోత్రమిది. 12 శ్లోకము లలో - రంగనాథుని పాదములు మొదలుకొని, కిరీటము వరకు గల భాగ ములు మనోరంజకముగ వర్ణింపబడినవి. కవుల కిది భావ జలధి; భక్తులకు తారక మంత్రము; ప్రపన్నులకు పరమ పదము.

**4. పాదుకా సహస్రము :-**

భక్తి, దివ్య ప్రేమ, శరణాగతి, వినయము, కైంకర్యము, భాగవతా రాధనము, నైచ్యానుసంధానము, కర్తవ్య పరాయణత్వము - మొదలగు శతాధికములయిన శ్రీవైష్ణవ సంప్రదాయ రహస్యములకు నిలయమైన దిది. ఇందు - శ్రీరంగేశుని పాదుకలను సుమారు వేయి శ్లోకములతో అను సంధించినారు దేశికులు. వాల్మీకి యొక్క పోకడలు, ద్రావిడామ్నాయమౌళి యగు నమ్మాళ్వారుల భావనా విశేషములును - ఇందు పుష్కలముగా ననుస రింపబడినవి.

**5. శ్రీ స్తుతి :-**

ఇరువది యైదు పద్య పుష్పములతో వేదాంత దేశికులు - జగజ్జనని యైన శ్రీదేవికి సమర్పించిన భక్త్యంజలి యిది.

## ఉపసంహారము

శ్రీ వేదాంత దేశికుల కవిత యంతయు - భక్తి, శాంతి రస ప్రధా నము. వారు వ్రాసుచ్చినట్లే, రసాంతరముల కందు తావు లేదు. ఎట్టి భావుకు డైనను - ఆ భక్తి, శాంత రసములలో మునిగి, తన్మయుడు కాక తప్పదు. అదొక భాగీరథీ ప్రవాహము. అదొక రమ్య ప్రశాంత తపోవనము. అదొక సద్యః కలిమల నిధ్వంసక మహా సిద్ధి క్షేత్రము. అదొక శ్రీనివాస కృపా ప్రవాహము. అదొక వరదరాజ దత్త వర ప్రసాదము. అదొక శ్రీరంగనాథ మందస్మిత ప్రభా పూరము. ఈ రీతిగా దేశికుల సంస్కృత సాహిత్యము - బహు భంగులుగా విల్లి విరియుచున్నది.



# ప్రముఖ వైష్ణవ క్షేత్రములు - తద్విశేషములు

'సుధీమణి'

శ్రీమాన్ కందాడై శ్రీనివాసాచార్యులు, ఎం. ఏ.,



" శ్రీరంగం కరిశైల మంజనగిరిం తార్క్ష్యాద్రి సింహాచలం
శ్రీకూర్మం పురుషోత్తమం చ బదరీ నారాయణం నైమిశమ్
శ్రీమ ద్ద్వారవతీ ప్రయాగ మధురా ఽయోధ్యా గయా పుష్కరం
సాలగ్రామగిరిం నిషేవ్య రమతే రామానుజోఽయం మునిః."

శ్రీరంగము, కాంచీపురము, వేంకటాచలము, గరుడాచలము, సింహాచలము, శ్రీకూర్మము, బదరీనారాయణము, నైమిశారణ్యము, ప్రయాగ, మధుర, అయోధ్య, పుష్కరము, సాలగ్రామము - మొదలైన దివ్య క్షేత్రములను కొన్నింటిని భగవద్రామానుజులు సేవించియున్నారు. పన్నిద్దరాళ్వారులు - 108 దివ్య క్షేత్రములలో గల అర్చామూర్తులను తమ తమ దివ్య ప్రబంధములలో మంగళాశాసనము గావించియున్నారు. ఈ 108 దివ్య దేశములలో - ఆళ్వారులు అవకాశము కొలది కొన్నింటిని మాత్రమే సేవించియుండిరి. ఐనచో - ఈ అష్టోత్తర శత (108) దివ్య క్షేత్రములలో - ఇరువది యైదు దివ్య క్షేత్రములు - మిక్కిలి ప్రసిద్ధములై యున్నవి. అవి యెవ్వి యనగా -

1) శ్రీరంగము 2) తిరుమాలిరుంశోలై 3) గోష్ఠిపురము 4) శ్రీవిల్లిపుత్తూరు 5) ఆళ్వారు తిరునగరి 6) వానమామల 7) తిరుక్కురుంగుడి

8) తిరువనంతపురము 9) తిరువాహేంద్రపురము 10) కాంచీపురము 11) తిరువళ్ళూరు 12) మహాబలిపురము 13) తిరువళ్ళిక్కేణి 14) ఘటికాచలము 15) వేంకటాచలము 16) అహోబిలము 17)అయోధ్య 18) నైమిశారణ్యము 19) సాలగ్రామము 20) బదరికాశ్రమము 21)దేవ ప్రయాగ 22) నంద ప్రయాగ 23) ద్వారక 24) గోవర్ధనము 25) గోకులము - అనునవి,

ఈ ఇరువది యైదు (25) దివ్య క్షేత్రముల వైభవ - విశేషములు ఎల్లఱకును అవశ్య గ్రహణీయములై యున్నవి.

## 1. శ్రీరంగము

ఈ శ్రీరంగ క్షేత్రము - దక్షిణ భారతము నందలి తమిళనాడు రాష్ట్రములో - తిరుచినాపల్లి పట్టణమునకు సమీపమున నున్నది. ఇచట వేంచేసి యున్న స్వామి - శ్రీరంగనాథుడు. ఈ స్వామి - దక్షిణాభిముఖముగా ఆదిశేషునిపై పవళించియున్నాడు. ఈ శ్రీరంగనాథుని దేవేరి - శ్రీరంగనాచ్చియారు. ఈ ఆలయ విమానము ప్రణవాకారముగా నుండును. పరిసరమున నే కావేరీ నది ప్రవహించుచుండును. ఒక వంక చంద్ర పుష్కరిణి. ఇత్యాది విశేషములతో ఈ శ్రీరంగ క్షేత్రము - కలియుగ వైకుంఠముగా విరాజిల్లుచుండును.

" కృతే యుగే దేవరాజః త్రేతాయాం రంగనాయకః
ద్వాపరే తు జగన్నాథో కలౌ వేంకటనాయకః. "

అనునట్లు - త్రేతా యుగములో ఈ రంగనాథస్వామి ఆలయ ప్రభావము ఇతోధికముగా నుండి యుండునని తెలియవచ్చుచున్నది.

పన్నిద్దరాళ్వారులలో - ఒక మధురకవియాళ్వారులు గాక, మిగిలిన పదునొకండు మంది ఆళ్వారులును ఈ శ్రీరంగనాథుని తమ తమ దివ్య ప్రబంధములలో మంగళాశాసనము గావించియే యున్నారు.

స్వయం వ్యక్త క్షేత్రములలో ఇది మొదటిది. స్వామికి అర్చనాదులు పాంచరాత్రాగమానుసారము జరుగునట్లు భగవద్రామానుజులు కట్టుబాటు చేసిరి. శ్రీమద్రామానుజులు ఈ క్షేత్రమున 60 సంవత్సరములు గడపినట్లు, చరిత్రాధారమును బట్టి తెలియుచున్నది. ఇచట పర్వదినములలో - వైకుంఠ ఏకాదశి - అతి ముఖ్యమైనది. పెరియనంబి, భట్టరు, వడక్కు-తిరువీథి పిళ్ళె, పిళ్ళెలోకాచార్యులు వంటి ఆచార్య వర్యుల జన్మ స్థల మీ శ్రీరంగక్షేత్రము. నాదమునులు, యామునాచార్యులు, భగవద్రామానుజులు, శ్రీవత్సాకంమిశ్రులు, వేదాంతదేశికులు మున్నగు ఆచార్య ప్రముఖులు ఈ శ్రీరంగ క్షేత్రమునే కేంద్రము గావించుకొని, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమును కొనసాగించిరి. తొండరడిప్పొడి యాళ్వారులు, తిరుప్పాణాళ్వారులు-ఈ శ్రీరంగక్షేత్రమునందే పరమపద మలంకరించిరి.

తిరుమంగ యాళ్వారులు ఈ శ్రీరంగ క్షేత్ర దేవాలయాదులను జీర్ణోద్ధరణము గావించుటకు, ఎంతో శ్రమించినట్లును, తురుష్కుల దండ యాత్రలు జరుగుచున్న సమయమున - వేదాంత దేశికులు అనేక కష్టములను సహించి, శ్రీరంగనాథుని అర్చా విగ్రహమును వేరొక తావునకు తరలించి, దండయాత్రలు సమసిన యనంతరము శ్రీరంగనాథుని అర్చా విగ్రహమును మరల యథాస్థానమునకు జేర్చిరనియు, అట్లే విశిష్టాద్వైత సిద్ధాంత గ్రంథములను సైతము తురుష్కుల బారి నుండి కాపాడిరనియు తెలియుచున్నది.

ఈ శ్రీరంగ నగరము సప్త (7) ప్రాకార సంయుతమై సంశోభించుచుండును. మొదటి ప్రాకారమున శ్రీరంగనాథస్వామి దేవాలయము, చిలుక (కిళి) మండపము కలవు. రెండవ ప్రాకారమును - 'విరజ వీథి' యని వ్యవహరింతురు. ఈ ప్రాకారములో దక్షిణపు వైపున చంద్ర పుష్కరిణి, పొన్న చెట్టు, శ్రీ కోదండరామస్వామివారి ఆలయము, తిరుమళిశై యాళ్వారుల ఆలయము, తిరుక్కచ్చినంబి ఆలయము, నమ్మాళ్వారుల ఆలయము, మధురకవి యాళ్వారుల ఆలయము, తిరుమంగయాళ్వారుల ఆలయము;

ఉత్తరపు వైపున - భగవద్రామానుజుల ఆలయము, సూర్య పుష్కరిణి, ఎత్తుగా గల గరుత్మంతుని ఆలయము కలవు. 'ఆళ్వార్ తిరుచ్చి' అనబడు నాల్గవ ప్రాకారములో - వసంత మండపము, చక్రత్తాళ్వారుల ఆలయము, శ్రీరంగ నాచ్చియార్ ఆలయము కలవు. ఐదవ ప్రాకారమును 'ఉత్తర వీథి' యని వ్యవహరింతురు. జీయరుస్వామి మఠము, ఉత్తమ నంబి, భట్టరు, కోయిల్ కందాడై అణ్ణా-అనువారల వంశీయుల గృహములు గలవు. ఆఱవ ప్రాకారమును - 'చిత్ర వీథి' యని యందురు. ఇందులో - పెరియ నంబి, కూరత్తాళ్వారులు మొదలగు వైష్ణవ ప్రముఖులు నివసించిన గృహములు గలవు. ఏడవ ప్రాకారము నుండి - 'కొల్లడము' అనబడు కావేరీ నదికి మార్గము గలదు. కావేరీ నదీ తీరములో - ఒక వైపున యామునాచార్యుల వారి సమాధి కలదు.

ఈ శ్రీరంగ క్షేత్రము - 'భోగ మండపము' అను పేర ప్రసిద్ధమైనది. ధర్మవర్మడు, రవివర్మడు - అను తన భక్తులకు - శ్రీరంగనాథస్వామి ప్రత్యక్ష మయ్యెనని ప్రతీతి కలదు. సూర్యునిచే అర్చింపబడిన ఈ రంగనాథుడు - ఇక్ష్వాకు మహారాజులకు ప్రసాదింపబడి, శ్రీరామచంద్రుని వఱకు గల ఇక్ష్వాకు ప్రభువు లందఱిచే పూజింపబడి, శ్రీరామచంద్రుని పట్టాభిషేక సమయమున విభీషణునకు ప్రీతితో బహుమానముగా నొసంగబడిన స్వామి - ఈ శ్రీరంగనాథుడు.

ఈ శ్రీరంగనాథునకు - 'పెరియ పెరుమాళ్' అనియు, 'అళగియ మణవాళన్' అనియు, 'నంబెరుమాళ్' అనియు - వివిధ నామము లున్నవి. అట్లే - శ్రీరంగ క్షేత్రమునకు - 'పెరియ కోయిల్' అను నామాంతరమున్నది.

# 2. తిరుమాలిరుం శోలై

ఈ క్షేత్రము - తమిళనాడులోని మధురకు 12 మైళ్ళ దూరములో గలదు. స్వామి - అళగర్, మాలాలంకారర్, సుందరబాహు పెరుమాళ్. తూర్పు అభిముఖము. నిలుచున్న భంగిమ - సుందర వల్లి నాచ్చియారు, సోమ సుందర విమానము, శిలంబారు (మాపుర గండై) తీర్థము - మున్నగునవి ముఖ్యముగా దర్శనీయములై యున్నవి.

ఈ క్షేత్రమున చందన వృక్షము గలదు వృషభ గిరిపై, స్వామి వేంచేసియున్నాడు, మలయ ధ్వజ పాండ్యునకు, ధర్మ దేవతకు స్వామి ప్రత్యక్షము. ఉత్సవమూర్తి పూర్తిగా బంగారముతో మలచబడినది.

పూదత్తాళ్వారులు, పేయాళ్వారులు, నమ్మాళ్వారులు, పెరియాళ్వారులు, ఆండాళ్, తిరుమంగయాళ్వారులు - తమ తమ దివ్య ప్రబంధములలో - ఈ స్వామిని మంగళాశాసనము గావించియున్నారు.

భగవద్రామానుజులు గోదాభీష్టానుసారము - నూరు పాత్రలలో వెన్నను, నూరు పాత్రలలో పాయసమును వృషభాధీశు డగు ఈ స్వామికి సమర్పింపగా - సంతసించి, గోదాదేవి భగవద్రామానుజులను 'శ్రీరంగం అన్నగారు' (నంకోయిల్ అణ్ణన్) అని, ప్రశంసించెనట ! రామానుజులు తిరునారాయణ పురములో వేంచేసియున్న సమయమున - కూరత్తాళ్వారులు చోళరాజ సభలో విష్ణు పరతత్త్వమును స్థాపించి, రాజాగ్రహామునకు పాత్రులై - నేత్రములు పోగొట్టుకొన్న కారణమున - శ్రీరంగమునకు బోవ వీలు గాక, ఈ వనాద్రిని జేరిరి. రామానుజులు తిరిగి శ్రీరంగమునకు వచ్చువఱకు సుందరబాహుస్వామిని సేవించుచు - కాలము గడపిరి. ఆ సమయమున కూరత్తాళ్వారులు - శ్రీస్తవము, శ్రీ వైకుంఠ స్తవము, అతి

మానుష స్తవము. శ్రీ సుందర బాహు స్తవము, శ్రీ వరదరాజ స్తవము - అను అయిదు (5) స్తవములను రచించిరి.

## 3. గోష్ఠీ పురము

ఈ క్షేత్రము - కొరైకుక్కుడి రైల్వేస్టేషనుకు 6 మైళ్ళ దూరములో గలదు. స్టేషన్‌వద్దనుండి బస్సులో బోవచ్చును. ఇయ్యది - గోష్ఠీ పూర్ణుల జన్మస్థలము. వీరివద్ద అష్టాక్షరీమహామంత్రమును, మంత్రార్థములనుపొందుటకై, పదునెనిమిది (18)పర్యాయములు శ్రీరంగము నుండి వేంచేసి, చివఱకు-శ్రీరామానుజులు గోష్ఠీ పూర్ణుల వద్ద మంత్రోపదేశమును పొందిరి. ఈ మంత్రము మఱి యెవరికిని చెప్పగూడదనియు, గురువు ఆజ్ఞను మీరి - అట్లు పరులకు చెప్పినచో - నరక లోకమునకు బోదు వనియు గురు వగు గోష్ఠీ పూర్ణులు శాసనము గావించిరి. అపుడు రామానుజులు - గురువు ఆజ్ఞను మీఱి, అచ్చటి నుండిగోపురము నెక్కి, అతి గోప్యమైన తిరుమంత్రమును సకల జనులకు బోధించిరి. గుర్వాజ్ఞను మీరినందున తాము నరకమునకు బోవుటకైనను రామానుజులు సిద్ధపడిరి. ఈ విషయమును గ్రహించిన గురువగు గోష్ఠీ పూర్ణులు-వీరిని కౌగలించుకొని, 'మన్నాథ !' (ఎంబెరుమానార్ !) అను పేరున పిలచిరి. నాటి నుండియు రామానుజులకు - 'ఎంబెరుమానార్' అను నామధేయము సార్థక మయ్యెను.

ఈ క్షేత్రమున వేంచేసియున్న స్వామి - మూలవరలు - ఉరమెల్ల నేయాన్. ఉత్సవ మూర్తి - సౌమ్య నారాయణ పెరుమాళ్. స్వామి సన్నిధి - నాలుగు అంతస్థులలో గలదు. మొదటిది శయన భంగిమ. రెండవది - నిలుచున్న భంగిమ. మూడవది - కూర్చున్న భంగిమ. నాల్గవది - దిగువలో - నృత్య భంగిమ. తూర్పు అభిముఖము. తాయారు - తిరుమామగళ నాచ్చియారు. పుష్కరిణి - దేవపుష్కరిణి. విమానము - అష్టాంగ విమానము. ఈ

దివ్య క్షేత్రమును 'కదంబ వనము' అనియును వ్యవహరింతురు. కదంబ మహర్షికి, ఇంద్రునకు - స్వామి ప్రత్యక్షము. పూదత్తాళ్వారులు, పేయాళ్వారులు, తిరుమళిశై యాళ్వారులు, పెరియాళ్వారులు, తిరుమంగ యాళ్వారులు — ఈ స్వామిని తమ తమ దివ్య ప్రబంధములలో మంగళాశాసనము గావించియున్నారు.

## 4. శ్రీవిల్లిపుత్తూరు

ఈ క్షేత్రము శ్రీవిల్లిపుత్తూరు రైలు స్టేషనకు వాయువ్య దిశలో - 2 మైళ్ళ దూరమున గలదు. స్వామి-వటపత్రశాయి, రంగమన్నారు. తూర్పు అభిముఖము. వటపత్రశాయి శయన భంగిమ. రంగమన్నారు - నిలుచున్న భంగిమ. ఆండాళ్, కోదై సాచ్చియార్ అనువారలు తాయారులు. విమానము- సంశన విమానము. తీర్థము - సౌమ్య తీర్థము, తిరువాక్కుళ తీర్థము, మండూక మహర్షికి, విష్ణుచిత్తునకును స్వామి ప్రత్యక్షము ఈ దివ్య క్షేత్రము-పెరియాళ్వారులకును, ఆండాళకును, జన్మ స్థలము. పెరుమాళ్ కుడి వైపున ఆ గోదాదేవితో, వేరొక ప్రక్కన గరుడాళ్వారు (పెరియాళ్వారు)తో దర్శన మొసంగుచున్నారు. ఆండాళ - తన సౌందర్యమును బావిలోని నీటిలో చూచుకొన్న విషయము, సర్వ జన విదితము గదా ! ఆ నాటి ఆ బావి - ఈనాటికిని కానవచ్చుడు. పెరియాళ్వారులు, ఆండాళ్ ఈ స్వామిని తమ తమ దివ్య ప్రబంధములలో మంగళాశాసనము చేసియున్నారు.

## 5. ఆళ్వారు తిరునగరి

ఈ క్షేత్రమును - 'కురికాపురి' యనియు, 'కురంగ పురి' యనియు 'తిరుక్కురుంగుడి' యనియు-వివిధ నామములతో వ్యవహరింతురు. ఈ

క్షేత్రము - ఆళ్వారు తిరునగరి రైలు స్టేషనుకు పశ్చిమముగా ఒక మైలు దూరమున గలదు. ఇది నమ్మాళ్వారుల జన్మస్థలము. నమ్మాళ్వారుల ఆలయము, ఆ నమ్మాళ్వారులు నివసించిన చింతచెట్టు - నేటికిని అచటకాన వచ్చును. ఇచ్చటనే నాథమునులు 'కణ్ణినుణ్' 'శిరుత్తాంబు జపముతో నమ్మాళ్వారులను ప్రత్యక్షము గావించుకొని, లుప్తమైన నాలాయిర దివ్య ప్రబంధమును సమగ్రముగా పొందగల్గిరి. నమ్మాళ్వారుల అర్చా విగ్రహమును - ఇచట మధురకవి యాళ్వారులు ప్రతిష్ఠించిరి. ఈ క్షేత్రమునందలి స్వామి - ఆదినాథ పెరుమాళ్. తాయారు - ఆదినాథ వల్లీ తాయారు. (కురుగూర్ వల్లీ తాయార్). విమానము - గోవింద విమానము. తీర్థము బ్రహ్మ తీర్థము. తామ్రపర్ణీ నది. బ్రహ్మకు. నమ్మాళ్వారులకు - స్వామి ప్రత్యక్షము. నమ్మాళ్వారులు ఈ స్వామిని గురించి-తిరువాయి మొళి (4-00)లో కీర్తించియున్నారు.

స్వామి అభయ హస్తము కలిగి యుండగా, నమ్మాళ్వారులు - ఉపదేశ ముద్రాకార హస్తముతో దర్శన మిత్తురు. నమ్మాళ్వారులకు ఇచట ప్రతి నిత్యము - 'తిరుమజ్జనము' జరుగును. ఈ తిరుక్కురుగూరుకు పరిసర ప్రాంతములందే నవ(9)దివ్య దేశములు కలవు. తిరుక్కురుగూరులో వేంచేసియున్న స్వామివారి బ్రహ్మోత్సవ సందర్భమున, ఐదవ నాడు నవ (9) దివ్యదేశములలో వేంచేసియుండు స్వాములు - గరుడ వాహనారూఢులై ఇచటకు వేంచేసి, తిరిగి రాత్రికి స్వస్థలములకు చేరుట-ఈనాటికిని ఆచారముగా నున్నది. ఇది అచ్చటి విశేషము.

కలియుగారంభమున అవతరించిన నమ్మాళ్వారుల సమయముననే ఉద్భవించిన 'తిరు పుళి' అనబడు చింత చెట్టు - నేటికిని అచట కాన వచ్చును.

సామాన్య మానవ శిశువుల వలె ప్రవర్తింపక, బాల్యమున అచట చింతచెట్టు తొఱ్ఱలో ప్రవేశించి, పదునారు సంవత్సరములు అన్న పానాదులు వీడి, భగవంతుని ధ్యానముతో గడపిన మహనీయులు - నమ్మాళ్వారులు. తమను అన్వేషించుచు విచ్చేసిన మధురకవి యాళ్వారులతో - మౌనము వీడి, ఆ యాళ్వారుల ధర్మ సందేహములను దీర్చి, ఆ మధుర కవులను తమ శిష్యరత్నముగా స్వీకరించినారు నమ్మాళ్వారులు. అనంతరము ఆ మధురకవి యాళ్వారులకు - తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియ తిరువందాది, తిరువాయి మొళి - అను నాలుగు దివ్యప్రబంధములననుగ్రహించిరి. అటు పిమ్మట - శ్రీమన్నారాయణుడు నమ్మాళ్వారులకు పరమ పదము ననుగ్రహించిరి. అపుడు - ఆ దివ్య దేహము ఆ చింతచెట్టు వద్దనే సమాధి చేయబడినది. కాలక్రమమున ఆలయము కూడ అచటనిర్మింపబడి నది. ఈ నమ్మాళ్వారుల ఆలయము దిదృక్షువులకు నేటికిని అచట దర్శన మిచ్చుచుండును.

## 6. వానమామల

ఈ క్షేత్రమును-'తోతాద్రి' యనియు, 'నాయనేరి' యనియు, 'శ్రీవర మంగై' యనియు-వివిధ నామములలో వ్యవహరింతురు. తిరునల్వేలికి దక్షిణ మున 20 మైళ్ళ దూరములో ఈక్షేత్రము గలదు. ఇది శ్రీమన్నారాయణుని అష్ట (8) స్వయం వ్యక్త క్షేత్రములలో నొకటి. మిగిలినవి - ముక్తి నారా యణము, బదరీనారాయణము, శేషాచలము, పుష్కరము, నైమిశారణ్యము, శ్రీముష్ణము, శ్రీరంగము అనునవి. ఈ వానమామల దివ్య క్షేత్రమున - జీయరు స్వామి వారి మఠము గలదు.

ఈ క్షేత్రమునందు వేంచేసియున్న స్వామి - వానమామలై పెరుమాళ్. తూర్పు అభిముఖము. కూర్చున్న భంగిమ. తాయారు -

శ్రీ వరమంగై వాచ్చియారు. విమానము : నంద వర్ధన విమానము. పుష్కరిణి - ఇంద్ర పుష్కరిణి. ఇచట పురాతనమైన మామిడి చెట్టు కూడ కలదు. స్వామి - శ్రీ, భూ, నీళాదేవులతో - దర్శన మిచ్చుచుండ, విష్వక్సేనులు, గరుడాళ్వారులు-వీరితో చామర కన్యలు, సూర్య చంద్రులు - పార్శ్వములలో నుందురు. ఇంద్రునకు, బ్రహ్మకు, రోమశ మహర్షికి, భృగు మహర్షికి, మార్కండేయ మహర్షికిని - స్వామి ప్రత్యక్షము. ఈ స్వామిని గుఱించి నమ్మాళ్వారులు తమ తిరువాయిమొళి దివ్య ప్రబంధములో స్తుతించి యున్నారు.

# 7. తిరుక్కురుంగుడి

వానమామల నుండి పశ్చిమమున 8 మైళ్ళ దూరములో-ఈక్షేత్రము గలదు. బస్సులో పోవచ్చును. దీనిని - 'వామన క్షేత్రము' అని వ్యవహరింతురు. స్వామి - వైష్ణవ నంబి. ఈ స్వామికి - మలై మేల్ నంబి, తిరుక్కురుంగుడి నంబి, ఇరుండ నంబి - మున్నగు నామాంతరము లనేకములు కలవు. తాయారు :- కురుంగుడు వల్లి తాయారు. విమానము :- పంచ కేతక విమానము. తీర్థము - పంచ తురై తీర్థము, తిరుప్పార్ కడల్ నది. ఈ స్వామి శివునకు ప్రత్యక్షము. ఈ స్వామి ప్రసాదించిన వరము వలననే నమ్మాళ్వారులు జనిమ్రించిరి. తిరుమంగయాళ్వారులు పరమపదించినది ఈ క్షేత్ర మందే. ఇచ్చటకు సమీపమున గల 'తిరుపాది వట్ట పారై' అను రాతి బండపైన ఆసీనులై భగవద్రామానుజులు - శిష్యులకు వేదాంత విషయములను బోధించుచుండెడివారట ! ఒకనాడు అష్టాక్షరీ మహా మంత్ర ప్రభావమును గుఱించి భగవద్రామానుజులు శిష్యులకు బోధించుచుండ, ఈ క్షేత్రనాథుడైన స్వామి విని, 'రామానుజ దాసుడను' అని పలుకగా, అపుడు రామానుజులు స్వామికి-'వైష్ణవ నంబి' అని నామకరణము చేసిరట! ఇచట- హయగ్రీవునకు, వేదాంత దేశికులకును - వేర్వేరుగా - ఆలయములు గలవు.

## 8. తిరువనంత పురము

ఈ క్షేత్రము తిరువేంద్రము రైలు స్టేషనుకు ఒక మైలు దూరములో గలదు. స్వామి :- అనంత పద్మనాభుడు. భుజంగ శయనము. తూర్పు అభిముఖము. తాయారు - శ్రీహరి లక్ష్మి తాయారు. విమానము :- హేమ కూట విమానము. తీర్థము :- మత్స్య తీర్థము. స్వామి ఇంద్రునకు, రుద్రునకు, చంద్రునకును - ప్రత్యక్షము. ఆలయ గర్భ గృహమునకు మూడు ద్వారములు గలవు. ఎడమ వైపు ద్వారము ద్వారా - స్వామి ముఖారవిందమును, మధ్య ద్వారము ద్వారా స్వామి నాభి కమలమందు గల బ్రహ్మదేవుని, మూడవది యగు కుడివైపు ద్వారము ద్వారా - స్వామి పాదారవిందములను సేవింపవచ్చును. ఇచట - యోగ నృసింహస్వామి ఆలయము కూడ కలదు. నమ్మాళ్వారులు తమ తిరువాయిమొళి దివ్య ప్రబంధములో - ఈ అనంత పద్మనాభస్వామిని గూర్చి మంగళాశాసనము గావించియున్నారు.

## 9. తిరువహీంద్ర పురము

ఈ దివ్య క్షేత్రము తిరుప్పాళియూరు రైలు స్టేషనుకు మూడు మైళ్ళ దూరమున గలదు. స్వామి - దేవనాయక పెరుమాళ్. నిలుచున్న భంగిమ. తూర్పు అభిముఖము. తాయారు - హేమాంబుజ నాయకి, వైకుంఠవల్లి. విమానము - శుద్ధ సత్త్వ విమానము. తీర్థము :- చంద్ర తీర్థము, శేష తీర్థము, భూత తీర్థము, బ్రహ్మ తీర్థము, గరుడ తీర్థము. ఈ తీర్థములేగాక, ఇచట గరుడ నదియు గలదు. చంద్రునకు, గరుడునకు - స్వామి ప్రత్యక్షము. తిరుమంగ యాళ్వారులు తమ దివ్యప్రబంధములో నొక తావున ఈ స్వామిని గురించి మంగళాశాసనము గావించియున్నారు.

ఇచ్చటకు కొలది దూరములో గల ఔషధ గిరిపై - హయగ్రీవుని ఆలయము కలదు. ఘూ తీర్థము, బ్రహ్మ తీర్థము - ఆ కొండపై గలవు. శేష తీర్థము, దేవ నాయక స్వామి ఆలయము - అచ్చటకు సమీపముననే గలవు. వేదాంత దేశికులు ఇరువది సంవత్సరముల వయస్సులో - ఇచట గరుత్మంతుని గూర్చియు, హయగ్రీవుని గూర్చియు - తప మాచరించినట్లు ప్రతీతి గలదు.

## 10. కాంచీ పురము

ఈ కాంచీ పురము - చిర కాలము నుండియు - చరిత్ర ప్రసిద్ధి గాంచియున్నది. హిందువులు, బౌద్ధులు, జైనులు - ఈ కాంచీ పురమును కేంద్రము గావించుకొని, వారి వారి మతములను ప్రచారము గావించు కొన్నట్లు తెలియుచున్నది. సప్త ముక్తి క్షేత్రములలో - ఈ కాంచీపుర క్షేత్ర మొకటి. ఈ కాంచీపురమునకు బోవుటకు - మదరాసు నుండి నేరుగా బస్సుల సౌకర్యము గలదు.

ఈ కాంచీ పురమునకు - 'సత్య వ్రత క్షేత్ర' మను నామాంతరము గలదు. ఈ కాంచీ పురము - 'శివకంచి' యనియు, 'విష్ణు కంచి'యనియు - రెండు విభాగములుగా నుండును. శివ కంచి పెద్దది. విష్ణు కంచి చిన్నది. విష్ణుకంచిలోనే ప్రసిద్ధమైన వరదరాజస్వామి ఆలయ మున్నది.

వరదరాజస్వామి వేంచేసి యున్న క్షేత్రమును - హస్తిగిరి, అత్తి మామలై, అత్తియూరు, పెరుమాళ్ కోయిల్, విష్ణు కంచి, కరి గిరి, తిరువత్తి నగర్, నాగ మామలై - అని, వివిధ నామములతో వ్యవహరించుచుందురు.

ఇచట వేంచేసియున్న స్వామి - వరదరాజస్వామి. ఈ స్వామిని దేవ రాజ పెరుమాళ్ - అనియు, తేవ పెరుమాళ్-అనియు, వివిధ నామములతో వ్యవహరించుచుందురు. తూర్పు అభిముఖము. నిలుచున్న భంగిమ. ఉభయ పార్శ్వముల యందును - పెరుందేవి తాయారు, మహాదేవి - అనువార

లుండును. ఆ యాలయ విమానము 'పుణ్యకోటి విమాన' మను పేర సుప్రసిద్ధము. శేష తీర్థము, కుశ తీర్థము, అనంత పద్మ తీర్థము, అగ్ని తీర్థము, అనంత సరస్సు - అను తీర్థములే గాక, వేగవతీ నదియును ఇచట గలదు. బ్రహ్మకు, గజేంద్రునకు, బృహస్పతికి, ఆదిశేషునకు, భృగు మహర్షికి, నారద మహర్షికి - స్వామి ప్రత్యక్షము.

## 11. తిరువళ్ళూరు

మద్రాసు నుండి అర్కోణమునకు పోవు దారిలో 25 మైళ్ళ దూరమున ఈ క్షేత్రము గలదు బస్సు సౌకర్యము కూడ గలదు. స్వామి వీరరాఘవ స్వామి. భుజంగ శయనము. తూర్పు అభిముఖము. తాయారు - కనకవల్లి తాయారు. తీర్థము :- హృత్తాపనాశ తీర్థము. విమానము :- విజయ కోటి విమానము. శాలిహోత్ర మహర్షికి స్వామి ప్రత్యక్షము. వామ హస్తము జ్ఞాన ముద్రను సూచించగా, దక్షిణ హస్తము శాలిహోత్ర మహర్షి శిరమున నుండును.

ఇచ్చట సంవత్సరమునకు రెండు బ్రహ్మోత్సవములు జరుగుట విశేషము. ఇచట - ఆళ్వారాచార్యులకు ప్రత్యేకముగ ఆలయములు గలవు. ఇచ్చటి స్వామికి - పాంచరాత్రాగమానుసారము అర్చన జరుగుచుండును. ఇచ్చటి తీర్థములో స్నానమాడిన శివునకు-బ్రహ్మహత్యా పాతకము తొలగెనని ప్రతీతి యున్నది. తిరుమళిశై యాళ్వారులు-తమ తమ దివ్య ప్రబంధములలో - ఈ స్వామిని గూర్చి మంగళాశాసనము గావించియున్నారు.

## 12. మహాబలి పురము

ఈ క్షేత్రమును - 'మామల్ల పుర' మనియు, 'మల్లి పుర' మనియును వ్యవహరింతురు. ఇది - మద్రాసు నుండి 37 మైళ్ళ దూరములో గలదు.

బస్సులో పోవచ్చును. ఈ క్షేత్రమున వేంచేసియున్న స్వామి-తల శయన పెరుమాళ్. తూర్పు అభిముఖము. భూ శయనము, భుజంగ శయనము. తాయారు - నిలయమంగై నాచ్చియారు. విమానము :- గగనాకృతి విమానము, అనంత విమానము. పుష్కరిణి :- పుండరీక మహర్షి పుష్కరిణి. దీనికి గరుడ నది-అంతర్వాహినిగా గలదు. స్వామి - పుండరీక మహర్షికి ప్రత్యక్షము. ఇచ్చటికి 6 మైళ్ళదూరములో - 'జ్ఞాన ప్పిరాన్' ఆలయము కలదు. ఇచట - సముద్ర తీరములో - మాధవీ పుష్పము నందు - పూద త్తాళ్వారులు అవతరించినట్లు - చరిత్ర ప్రసిద్ధి. పుండరీక మహర్షిని అనుగ్రహించుటకై శ్రీమన్నారాయణుడు పాలకడలినుండి ఇచ్చటకు వేంచేసి, సముద్ర తీరమున - స్థల శయనుడై యవతరించినట్లు ప్రతీతి. ఈ స్వామిని - పూదత్తాళ్వారులు, తిరుమంగయాళ్వారులు - తమ తమ దివ్య ప్రబంధములలో మంగళాశాసనము గావించియున్నారు.

## 13. తిరువళ్ళిక్కేణి

ఈ తిరువళ్ళిక్కేణి - మదరాసులోని ఒక అంతర్భాగము. ఇచట పార్థసారథి స్వామి ఆలయము ప్రసిద్ధమైనది. ఈ పార్థసారథి స్వామి ఆలయ ప్రాంగణములో మొత్తము ఐదు ఆలయములు గలవు.

౧. స్వామి - పార్థసారథి స్వామి. (ఉత్సవ మూర్తి). వేంకట కృష్ణ స్వామి (మూల విరాట్టు). నిలుచున్న భంగిమ. తూర్పు అభిముఖము. తాయారు - రుక్మిణీ దేవి. విమానము - ఆనంద విమానము తీర్థములు :- ఇంద్ర తీర్థము, అగ్ని తీర్థము, మీన తీర్థము, విష్ణు తీర్థము - అను నాల్గు తీర్థములు కలవు. పుష్కరిణి :- కైరవిణీ పుష్కరిణి. తొండమాన్ చక్రవర్తికి, అర్జునునకు - స్వామి ప్రత్యక్షము.

౨. రంగనాథస్వామి తూర్పు అభిముఖముగా - వేదవల్లి తాయారు సమేతుడై వేంచేసి యుందురు.

౩. అళగియ సింగరు-కూరుచున్న భంగిమ. అత్రి మహర్షికి-స్వామి ప్రత్యక్షము.

౪. శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న సమేత శ్రీరామచంద్రస్వామి. (చక్రవర్తి తిరుమగన్ దక్షిణ అభిముఖము. నిలుచున్న భంగిమ.

౫. స్వామి - దేవ పెరుమాళ్. (మూలవరులు గరుడారూఢులు.) తూర్పు అభిముఖము. శేష విమానము. సప్తరోమ మహర్షికి స్వామి ప్రత్యక్షము.

పైన పేర్కొనబడిన స్వాము లందఱిని తిరుమంగ యాళ్వారులు - తమ దివ్య ప్రబంధములలో మంగళాశాసనము గావించియున్నారు. ఈ క్షేత్రము - సప్త ఋషులు తప మాచరించిన పుణ్య క్షేత్రము.

పార్థసారథి స్వామి కృపాకటాక్షమువలననే - ఆసూరి కేశవాచార్య- కాంతిమతీ దంపతులు - భగవద్రామానుజులను పుత్ర రత్నముగా పొంద గల్గిరి. పే యాళ్వారులు, తిరుమళిశై యాళ్వారులు-ఈ పార్థసారథి స్వామిని తమ తమ దివ్య ప్రబంధములలో మంగళాశాసనము గావించియున్నారు.

## 14. ఘటికాచలము

ఈ క్షేత్రమును - 'చోళ సింగ పుర' మనియు, 'చోళింగ పుర' మని యును - వ్యవహరింతురు. ఈ క్షేత్రము - 'షోలింగర్' రైలు స్టేషనుకు 8½ మైళ్ళ దూరములో గలదు. 400 అడుగుల ఎత్తు గల పర్వతముపై యోగ నృసింహస్వామి ఆలయమున్నది. స్వామి తూర్పు అభిముఖముగా- కూరుచున్న భంగిమ గలిగి, అమృతవల్లీ నాచ్చియార్ సమేతుడై వేంచేసి యుండును. ఇచట అమృత తీర్థము గలదు. స్వామి ఆంజనేయునకు ప్రత్య క్షము. ఈ క్షేత్రమున వేంచేసియున్న యోగ నృసింహస్వామిని కొలిచిన వారికి - భూత ప్రేత పిశాచాది బాధ యుండదు. అట్టి బాధలను తొలగించు

కొనుటకై, భక్తు లనేకులు ప్రతి నిత్యము ఈ క్షేత్రమునకు వచ్చుచుందురు. ఈ క్షేత్రమునకు సమీపముననే 200 అడుగుల యెత్తుగల కొండపై-యోగ ఆంజనేయస్వామి ఆలయము గలదు. ఈ ఆంజనేయస్వామి యోగనృసింహ స్వామికి అభిముఖముగా నుండును. ఈ ఆంజనేయుని హస్తము లందు శంఖ చక్రము లుండుట విశేషము. కొండ దిగువలో - గరుడారూఢు డైన వరదరాజస్వామి ఆలయమున్నది. ఈ యోగానంద నృసింహస్వామిని భక్తి ప్రపత్తులతో పూజించినవానికి - ఘటిక (గడియ) కాలములోనే ఆస్వామి-ముక్తిని ప్రసాదింపగలడని ప్రతీతి గలదు. ఈ యోగ నృసింహ స్వామిని - పేయాళ్వారులు, తిరుమంగ యాళ్వారులు - తమ తమ దివ్య ప్రబంధములలో మంగళాశాసనము గావించియున్నారు.

## 15. వేంకటాచలము

ఈ దివ్య క్షేత్రము ఆంధ్ర దేశమున - చిత్తూరు జిల్లాలో గలదు. ఈ క్షేత్రమునకు - తిరుపతి, తిరుమల, వడమామలై, వేంకటాద్రి, వృషభాద్రి, గరుడాద్రి, శేషాద్రి, అంజనాద్రి, నారాయణాద్రి, నృసింహాద్రి - అను వివిధ నామములు గలవు. ఇచట శ్రీ వేంకటేశ్వరస్వామి తూర్పు అభిముఖముగా-నిలుచున్న భంగిమలో సేవ సాయించుచుండును. ఈ స్వామికి-తిరువేంగడత్తాన్, అనియు-'తిరువేంగడ ముడయాన్' - అనియు, శ్రీనివాస పెరుమాళ్-అనియు, వేంకట నాథన్ - అనియు, వేంకటాచలపతి - యనియు, బాలాజీ యనియు - అనేక నామము లున్నవి.

ఈ స్వామి దేవేరి - పద్మావతి. ఈ మెకు మఱి యొక పేరు - అలర్ మేల్ మఙ్గై తాయారు.

స్వామి ఆలయముపై గల ఆనంద విమానము దిదృక్షువులకు ఆనంద దాయకమై యుండును. ఆలయమునకు పరిసరముననే - స్వామి పుష్కరిణి గలదు. బ్రహ్మకు, ఇంద్రునకు, దశరథునకు, తొండమాన్ చక్రవర్తికిని -

స్వామి ప్రత్యక్షము. స్వామి పుష్కరిణీ సమీపమున - ఆదివరాహస్వామి ఆలయము గలదు. ఈ స్వామిని సేవించిన పిమ్మటనే భక్తులు - శ్రీ వేంకటేశ్వర స్వామిని సేవింతురు. ఇయ్యది - వరాహ క్షేత్రము గనుక, క్షేత్రాధిపతియైన వరాహస్వామి యనుమతి తోడనే శ్రీ వేంకటేశ్వరస్వామి ఈ క్షేత్రమున వేంచేసియున్నాడని చరిత్ర నుబట్టి తెలియవచ్చుచున్నది.

తిరుమలకు రెండు మైళ్ళ దూరములో - ఆకాశ గంగ, పాప వినాశ తీర్థము లున్నవి. ఇంకను వివిధ ప్రదేశములలో - తుంబురు తీర్థము, రామకృష్ణ తీర్థము, జాబాలి తీర్థము, గోగర్భ తీర్థము, పాండవ తీర్థము, చక్ర తీర్థము, వైకుంఠ తీర్థము-అనుతీర్థము లనేకములు కలవు. అదియును గాక, స్వర్ణ ముఖి నదియును సమీపమునే గలదు. కాలి బాటన తిరుపతి నుండి తిరుమల జేరుటకు - మెట్ల మీదుగా నడచి పోవచ్చును. అది 7 మైళ్ళ దూరము. రోడ్డు నుండియు పోవచ్చును. అది 11 మైళ్ళ దూరము. బస్సుల సౌకర్యము గలదు.

దిగువ తిరుపతిలో - గోవిందరాజస్వామి ఆలయము గలదు. చోళ రాజులచే ధ్వంసము గావింపబడిన ఈ ఆలయము - భగవద్రామానుజులచే పునరుద్ధరింపబడినది. స్వామి భుజంగ శయనము. స్వామిని దర్శించుటకు గోపురము దాటి పోవు దారిలో-ఒక వైపున ఆళ్వారాచార్యుల ఆలయములు కొన్ని కలవు.

తిరుపతి రైలు స్టేషనుకు రెండు మైళ్ళ దూరములో - 'తిరుచానూరు' కలదు. దీనిని-'అలమేలు మంగా పురము' అని వ్యవహరింతురు. దీనికి - 'శుక పురి' యని ప్రాచీన నామము. ఇచట వేంచేసియున్న పద్మావతీదేవిని- 'అలమేలు మంగ తాయారు' అని - వ్యవహరింతురు. ఇచట అమ్మవారికి - పాంచరాత్రాగమానుసారము అర్చనాదులు జరుగును. ఈ క్షేత్రమున-'పద్మసరో

వరము' అను పుష్కరిణి గలదు. ఈ క్షేత్రమున వేంచేసియున్న పద్మావతీ అమ్మవారినిగూర్చి ఆళ్వారులు కొందఱు - తమ తమ దివ్య ప్రబంధములలో మంగళాశాసనము గావించియున్నారు. తిరుమలలో వేంచేసి యున్న శ్రీనివాసభగవానునిగూర్చి పొయిగై యాళ్వారులు, పూదత్తాళ్వారులు, పే యాళ్వారులు, తిరుమంగై యాళ్వారులు, నమ్మాళ్వారులు, కులశేఖరా ళ్వారులు, తిరుమళిశై యాళ్వారులు - తమ తమ దివ్య ప్రబంధములలో - మంగళాశాసనము గావించియున్నారు.

స్వయం వ్యక్త క్షేత్రములలో శ్రీ వేంకటాచల క్షేత్ర మొకటి. 108 దివ్య దేశములలో - శ్రీరంగమునకు పిమ్మట, ఈ క్షేత్రమునకే రెండవ స్థానము. ఈ క్షేత్రమును అభివృద్ధి గావించుటలో - పల్లవ రాజులు, చోళ రాజులు - ఎంతయో శ్రద్ధ వహించి, అపారముగ ధనమును వెచ్చించి, దివ్య క్షేత్రముగా, దివ్యసుందరముగా తీర్చి దిద్దినట్లు - మనకు చరిత్రాధారముల వలన తెలియుచున్నది.

శ్రీ వేంకటాచల మాహాత్మ్యము, శ్రీవరాహ పురాణము, బ్రహ్మాండ పురాణము, స్కాంద పురాణము, భవిష్యోత్తర పురాణము, ఆదిత్య పురాణము, పద్మ పురాణము, గరుడ పురాణము, హరి వంశము, మార్కండేయ పురాణము, వామన పురాణము - మున్నగు పురాణములలో ఈ వేంకటాచల క్షేత్ర వైభవము విపులముగా వర్ణింపబడియున్నది. భగవద్రామానుజుల ఆదేశానుసారము తిరుమలలో నష్ట కష్టముల కోర్చి - పుష్ప కైంకర్యమును గావించిన అనంతాళ్వారుని పుష్పవనము - నేటికిని కలదు. ఈ వేంకటాచలమును ఒకపుడు వీరశైవు లాక్రమించి, స్వామిని పరమ శివునిగా రూపొందించినపుడు - ఈ 'క్షేత్రము వైష్ణవ క్షేత్రమే' అని భగవద్రామానుజులు నిరూపించి, అచ్చటి వీరశైవులను పరాజితులను గావించి పంపివేయుగా - నాటినుండి మరల ఈ క్షేత్రము - వైష్ణవ క్షేత్ర ముగా తీర్చి దిద్ది, అచట ఆ స్వామికి నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ,

సంవత్సరోత్సవాది వివిధము లగు ఉత్సవముల నేర్పరచి, ఈ ఉత్సవాదుల పర్యవేక్షణమునకై - ఒక జీయరు స్వామిని నియమించిరి. భగవద్రామాను జులు శ్రీనివాస భగవానునకు శంఖ, చక్రములను ధరింపజేసి, ఆచార్యులైరి. వక్షస్థలమున లక్ష్మిని అలంకరింపజేసి, మామగారైరి. కృతయుగమున వరదరాజస్వామి, త్రేతాయుగమున రంగనాయక స్వామి, ద్వాపర యుగ మున పూరీ జగన్నాథస్వామి,కలియుగమున శ్రీ వేంకటేశ్వర స్వామియు - ప్రసిద్ధి గాంచగలరని - పురాణ వచనము.

తాళ్ళపాక అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వర స్వామిని స్తుతించుచు వేలకొలది సంకీర్తనలను రచించిరి. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి యనుగ్రహ విశేషము వలననే, ఆ స్వామి ఘంటావతారముగ - వేదాంత దేశికు లుదయించి, విఖ్యాతి గాంచిరి. తిరుమల శ్రీ వేంకటేశర్వస్వామి వారి బ్రహ్మోత్సవము జగత్ప్రసిద్ధము.

## 16. అహోబిలము

ఈ క్షేత్రమునకు - నంద్యాల నుండి గాని, కడప నుండి గాని - బస్సులో చేరవచ్చును. ఇచట - నరసింహస్వామి - లక్ష్మీదేవి సమేతుడై, నిలుచున్న భంగిమలో-తూర్పు అభిముఖముగా వేంచేసియుండును. ఆలయ విమానము పేరు - 'కురుగై'. ఇచట ఇంద్రతీర్థము, నరసింహ తీర్థము, పాపనాశ తీర్థము, గజ తీర్థము, భార్గవ తీర్థము - అనునవి కలవు. ఈ నరసింహస్వామి - ప్రహ్లాదునకు ప్రత్యక్షము. ఈ దివ్యక్షేత్రమును - 'నవ నారసింహ క్షేత్రము' అని వ్యవహరింతురు. ఇచట - జ్వాల, అహోబిల, మాలోల, క్రోడ (వరాహ), కారండ, భార్గవ, యోగానంద, ఛత్రవట పావన- నామకము లగు లక్ష్మీనృసింహస్వామి ఆలయములు వివిధ ప్రదేశము లలో - నవ (9) సంఖ్యలో గలవు. స్వామివారలకు శ్రీ పాంచరాత్రాగ మానుసారము అర్చనాదులు జరుగుచుండును. ఇచటి లక్ష్మీనృసింహ

స్వామిని - తిరుమంగయాళ్వారులు తమ దివ్య ప్రబంధములో మంగళా శాసనము గావించిరి. ఇచట అహోబిల మఠము గలదు. ఆ మఠములో - లక్ష్మీ నృసింహస్వామి అర్చా విగ్రహము - ఆదివణ్ శఠకోప జీయరు స్వామి వద్ద గలదు. ఇచ్చట - శ్రీ లక్ష్మీ నరసింహస్వామికి - ప్రతి సంవత్సరము - బ్రహ్మోత్సవము వైభవముగా జరుగుచుండును.

## 17. అయోధ్య

ఉత్తర ప్రదేశములో-ఈ క్షేత్రము సుప్రసిద్ధమైనది. ఈ క్షేత్రము-ఫైజాబాదు రైలు స్టేషనుకు రెండు మైళ్ళ దూరములో గలదు. అచ్చట పురాతనముగా గల రామాలయము - తురుష్కులచే ధ్వంసము చేయబడి, ఆ స్థానమున ఒక మసీదు నిర్మింపబడినది. ఆ మసీదులోని కొంత భాగమును - శ్రీరాముని జన్మ స్థానముగా చూపుచుందురు.*

మఱి యొక రామాలయము - సరయూ నదీ తీరమున నిర్మింపబడినది. అచట - ఆంజనేయస్వామి ఆలయము కూడ కలదు. దానిని - 'హనుమాన్ టికిరీ' అని వ్యవహరింతురు. ఆ క్షేత్రమున - శ్రీరామ చంద్ర మూర్తి - సీతాదేవీ సమేతుడై, ఉత్తరాభిముఖముగా, కూరుచున్న భంగిమలో - దర్శన మిచ్చుచున్నాడు. పుష్కల విమానముతో ఆలయము

---

* శ్రీరాముని జన్మస్థలములో నిర్మింపబడిన ప్రధాన ఆలయముపై తురుష్కులచే నిర్మింపబడిన బాబ్రీ మసీదును - ఇటీవల 1992 డిశెంబరు 6 - వ తేదీన-భారతీయ జనతాపార్టీవారును, మఱికొందరు హైందవ ప్రముఖులును సమూలముగా కూల్చివేసిన విషయము జగద్విదితము. అచటి ప్రాచీన రామాలయమునకు చెందిన ఆధారము లనేకములు లభించినట్లు - తెలియవచ్చుచున్నది.

— సంపాదకుడు

శోభిల్లు చుండును. ఇచట-సత్య పుష్కరిణి గలదు. సహస్ర ధారా తీర్థము, బిల్వ తీర్థము, ఘృతాచీ తీర్థము, రామ తీర్థము, సీతా కూపము - మున్నగు నవియును ఇచట గలవు. దేవతలకు, ఋషులకు, భరతునకు - స్వామి ప్రత్యక్షము. కులశేఖరాళ్వారులు ఈ స్వామిని తమ దివ్య ప్రబంధములో - మంగళాశాసనము గావించిరి.

## 18. నైమిశారణ్యము

ఈ దివ్యక్షేత్రము - సీతాపురమునకు పోవు దారిలో "నైమిశార్ రైలు స్టేషన్‌కు - ఒక మైలు దూరములో గలదు. ఇచట - శ్రీమన్నారాయణుడు అరణ్య రూపముతో వేంచేసియుండును. బదరికాశ్రమమును దర్శించి వచ్చునపుడు - ఈ క్షేత్రమును సేవింపవచ్చును. ఇచట - దేవాలయము లేదు. కాని, నారాయణాంశా సంభూతుడైన వ్యాస మహర్షి తప మాచరించిన తావు గనుక, ఇది యొక దివ్య క్షేత్రముగ భావింపబడుచున్నది. ప్రపన్నులు ఇచ్చటి చక్ర తీర్థములో స్నాన మాచరించి, నైమిశారణ్యమునకు భక్తితో నమస్కారము గావింతురు.

## 19. సాలగ్రామము

ఈ దివ్య దేశము నేపాలు రాష్ట్రమునందు గలదు. గండకీ నది యొడ్డునగల యీ క్షేత్రము - ఖాట్మండుకు 60 మైళ్ళ దూరములో గలదు. ముక్తినారాయణ క్షేత్రము దీనికి 100 మైళ్ళ దూరములో నుండును. నేపాలు ప్రభుత్వమువారి యనుమతితో, 50 మందికి తక్కువ కాకుండ పోవచ్చును. ఎవరి గృహమున 12 సాలగ్రామములకు తగ్గక ఉండునో - ఆ గృహము దివ్య దేశముతో సమానము. అచట స్పర్శ దోషము యుండదని శాస్త్ర ప్రమాణము.

ఈ సాలగ్రామ క్షేత్రమున - శ్రీమూర్తి స్వామి - శ్రీదేవీ సమేత ముగ, ఉత్తరాభిముఖుడై, నిలచియున్న భంగిమతో వేంచేసియున్నాడు. కనక విమానము, గండకీ తీర్థము, చక్ర నది - అనునవి ఈ క్షేత్రము నందలి విశేషములుగా చెలువుచున్నవి. బ్రహ్మ రుద్రాదులకును, 'గండకి' యను వేశ్యకును - స్వామి ప్రత్యక్షము. పెరియాళ్వారులు, తిరుమంగ యాళ్వారులు - ఈ స్వామిని తమ తమ దివ్య ప్రబంధములలొ మంగళా శాసనము గావించియున్నారు.

స్వయం వ్యక్త క్షేత్రములలో ఇది యొకటి. ఈ క్షేత్రమునకు-మిగి లినవానికంటెను ప్రాధాన్యము గలదు. భగవ ద్దర్శనము కారణాంతరము లచే నిషేధింపబడినను, సంప్రోక్షణ మిట ఆవశ్యకము కాదు. సాలగ్రామ ములు సరి సంఖ్యలో పూజింపవలెను అనగా - 4, 6, 8, 10,12. ఈ విధముగా ఎన్నియేని యుండవచ్చును. కాని, బేసి సంఖ్యలో మాత్రము సాలగ్రామము లుండరాదని నిర్ణయము.

## 20. బదరికాశ్రమము

హిమాలయములలో నున్న ఈ దివ్య క్షేత్రము - సముద్ర తలము నకు 23, 210 అడుగుల యెత్తున గలదు. హరిద్వార్ రైలు స్టేషన్‌లో దిగి, విష్ణుపద ఘాట్ వద్ద గంగా నదిలో స్నాన మాచరించి, ఋషీకేశము నకు బస్సులో గాని, రైలులోగాని పోవచ్చును. అచ్చటకు 14 మైళ్ళ దూర ములో బదరికాశ్రమము గలదు. బదరీనాథుకు పోవు బస్సులు-ఋషీకేశము నుండి బయలుదేరును. ఇచ్చటి క్షేత్రములో - బదరీనారాయణ స్వామి - అరవిందవల్లీ తాయారు సమేతుడై, తూర్పు అభిముఖముగా, కూరుచున్న భంగిమలో వేంచేసి యుండును. తప్త కాంచన విమానముతో ఆలయము శోభిల్లుచుండును. ఇచట తప్త కుండ తీర్థము గలదు. పురాతనమైన బదరీ వృక్షము గలదు,

శ్రీమన్నారాయణుడు నరునకు (అర్జునునకు) అష్టాక్షరీ మహా మంత్రోపదేశము చేసిన దివ్య దేశ మిది. వేడి నీటి ధారలు గల తప్త కుండములో స్నాన మాచరించి, పిమ్మట - సింహ ద్వారము వద్ద గల గరుత్మంతుని సేవించి, దేవాలయములోనికి బోవలయును. ఈ దేవాలయ ప్రాకారము 100 అడుగుల పొడవు, 60 అడుగుల వెడల్పు గలిగి యుండును. ధర్మ దర్శన సమయమున ప్రతి యొకరును కనీసము ఇరువది నిమిషముల కాలము స్వామిని దర్శింపవచ్చును. ఇట్టి ధర్మ దర్శనమే గాక, తగిన శుల్కములను చెల్లించి, అభిషేకము, అర్చన, కర్పూరహారతి- మొదలగు సేవలను జరిపించుకొనవచ్చును. ఇచ్చటి ప్రధాన అర్చకుని - 'దావల్‌జీ' అని వ్యవహరింతురు, వీరు - కేరళ రాష్ట్రములోని విద్వాంసులైన నంబూద్రి బ్రాహ్మణ వర్గమునకు జెందినవారు.

బదరీనారాయణస్వామి - జటా జూటము గలవాడై, తపస్వి రూపమున, శంఖ చక్రములను రెండు చేతులలో ధరించి, క్రింది హస్తముల రెంటిని యోగ ముద్రతో నుంచి, పద్మాసనాసీనుడై యుండును. స్వామికి కుడి వైపున కుబేరుడు, గరుత్మంతుడును, వామభాగమున దేవర్షి నారదుడు, ఉద్ధవుడు. నరుడు, నారాయణుడును, వేంచేసియున్నారు. గురు శిష్య పరంపరను లోకమునకు వెల్లడించుట - స్వామి ముఖ్యోద్దేశము. ఈ నర నారాయణులు - సత్యయుగమున గలరు. ద్వాపరయుగమున వీరే నర నారాయణులు. అనగా - కృష్ణార్జునులు. ఆలయ ప్రాంగణము లోపల - లక్ష్మిదేవి ఆలయము ప్రత్యేకముగ గలదు.

ఈ బదరీనారాయణస్వామి దేవాలయమునకు సమీపముననే 'బ్రహ్మ కపాలము' కలదు. ఈ బ్రహ్మ కపాలమున - యాత్రికులు తమ తమ పూర్వికులకు పిండప్రదానము గావించి, తర్పణములు విడతురు. ఈ బదరీనాథ క్షేత్రమును - 'విశాల పురి' యనియు - వ్యవహరింతురు. ఈ బదరీ నారాయణ స్వామి ఆలయములో ఆరు (6) మాసములు మాత్రము

యాత్రికులు బదరీ నాథుని సేవించుటకు అవకాశము కల్గును. ఈస్వామిని - దేవతలు ఆఱు మాసములు పూజింతు రనియు,ఆఱు మాసములు మానవులు పూజింతు రనియు ప్రతీతి. దీనికి నిదర్శనముగా - దేవాలయ ద్వారములు మూసివేయుటకు ముందు వెలిగించిన జ్యోతులు - తిరిగి దేవాలయ ద్వారములు తెరచినపుడును - అటులనే దేదీప్యమానముగ ప్రకాశించుచుండును. ఇది యొక అద్భుతమైన విశేషము. పెరియాళ్వారులు, తిరుమంగయాళ్వారులు - ఈ బదరీ నాథుని - తమ తమ దివ్య ప్రబంధములలో మంగళాశాసనము గావించియున్నారు.

## 21. దేవ ప్రియాగ

హరిద్వారము నుండి 58 మైళ్ళ దూరములోగల ఈ దివ్య క్షేత్రము- హిమాలయములలో గలదు. ఈ ప్రదేశమున - విష్ణు గంగ, భాగీరథీ నది, అలక నంద-అనునవి-అలకాపురినుండి ప్రారంభ మగును. భాగీరథిగంగోత్రి నుండి ప్రారంభ మగును. అలక నంద, భాగీరథి, సరస్వతీ అను మూడు నదుల యొక్క- ఈ సంగమ స్థలమును - త్రివేణీ సంగమ మనుచుందురు. ఇచట - నీలమేఘ స్వామి - పుండరీకవల్లీ నాచ్చియారుతో - తూర్పు అభిముఖముగా, నిలుచున్న భంగిమతో దర్శన మొసంగుచుండును. ఆలయముపై మంగళ విమానము శోభిల్లుచుండును. పరిసరముననే మంగళతీర్థము కలదు. భరద్వాజ మహర్షికి స్వామి ప్రత్యక్షము. ఈ స్వామిని పెరియాళ్వారులు - తమ దివ్య ప్రబంధములో మంగళాశాసనము గావించియున్నారు.

## 22. నంద ప్రియాగ

ఈ క్షేత్రము - ఋషీకేశము నుండి బదరీ నారాయణమునకు పోవు మార్గములో 140 మైళ్ళ దూరమున గలదు. ఇచట పరమ పురుషస్వామి -

పరిమళవల్లీ తాయారుతో సహా-తూర్పు అభిముఖముగా భుజంగశయనముగా దర్శన మిచ్చును. ఆలయ విమానము - గోవర్ధనము. ఇంద్ర తీర్థము, గోవర్థన తీర్థము, మానస సరోవరము-ఇచటకలవు. తిరుమంగై యాళ్వారులు ఈ స్వామిని గురించి మంగళాశాసనము గావించియున్నారు.

శీతా కాల ప్రారంభమున దేవాలయము మూయునపుడు - స్వామి యొక్క- ఉత్సవ మూర్తిని-ఇచ్చటకు సమీపమున గల పాండుకేశ్వరములో వేంచేపు చేసెదరు. తిరిగి 6 మాసముల ఆరాధన యనంతరము - బదరీ నాథుని ద్వారములు తెరచిన పిమ్మట, వైభవముతో తిరిగి ఆలయములో వేంచేపు చేయుదురు. నంద ప్రయాగలోని పరమ పురుష స్వామి - పార్వతీ దేవికి ప్రత్యక్షము.

హరి ప్రయాగ - సముద్ర మట్టమునకు 2,000 అడుగుల యెత్తున గలదు. ఇచ్చటనే అలకనందయు, మందాకినీ నదియు - కలియును. ఈ ప్రదేశమునందే కణ్వమహర్షి ఆశ్రమ ముండెడిది. శకుంతలా దుష్యంతుల వివాహ మహోత్సవమైన దిచ్చోటనే. ఇచ్చటకు 6 మైళ్ళ దూరమున - వైరస కుండ తీర్థము కలదు. ఇచటనే రావణాసురుడు కైలాస పర్వత మును పెకలించుటకు ప్రయత్నించెనని ప్రతీతి. బదరీనారాయణులు శీతాకాల ములో వేంచేయు పాండుకేశ్వరము - సముద్ర మట్టమునకు 6,450 అడు గుల ఎత్తున గలదు. పంచపాండవుల తావు ఇదియే యనియు, ఇచటనే పాండు మహారాజు తప మాచరించెననియు - ప్రతీతి యున్నది.

## 23. ద్వారక

ఈ క్షేత్రము - సముద్ర తీరము నందు గలదు. 'జామ్ నగర్'నుండి రైలులో పోవచ్చును. శ్రీకృష్ణుడు నివసించిన ద్వారకను నేడు మనము

చూడజాలము. అయ్యది - సముద్రమున మునిగిపోయినది. ఈ నడుమనే కొన్ని భాగములను పురావస్తు పరిశోధన శాఖ వారు - వెలికి తీసియున్నారు. గోముఖీనది సముద్రములో గలియు తావులో-శ్రీకృష్ణుని దివ్య విగ్రహము గలదు. అచట కొంత శుల్కమును చెల్లించి, ఆ సంగమ స్థలములో స్నానమాచరించి, శ్రీకృష్ణుని-దగ్గరగా నుండి సేవింపవచ్చును. ఈ విగ్రహము-కల్యాణ నారాయణ స్వామి వారికి అభిముఖముగా నుండును.

ఇచట - కల్యాణ నారాయణ స్వామి అర్చా విగ్రహము-కూరుచున్న భంగిమలో నుండెడిది. కాని, ప్రస్తుతము నిలుచున్న భంగిమలో కానవచ్చును. పశ్చిమాభిముఖముగా నుండును. కల్యాణ నాచ్చియారు, అష్ట మహిషులు స్వామివారి దేవేరులు. ఆలయ విమానము హేమకూట నామకము. గోమతీతీర్థ మిట గలదు. స్వామి-ద్రౌపదికి ప్రత్యక్షము. శ్రీకృష్ణుని రాజధాని యగు ద్వారక - సముద్రమున మునిగిపోయిన పిమ్మట, ప్రస్తుతము కానవచ్చు ద్వారక - పునర్నిర్మింపబడినది. సప్త మోక్ష స్థలములలో ఈ ద్వారక యొకటి. ఈ ద్వారకాధీశుని - తిరుమళిశైయాళ్వారులు, నమ్మాళ్వారులు, పెరియాళ్వారులు, ఆండాళ్ - తమ తమ దివ్య ప్రబంధములలో మంగళాశాసనము గావించియున్నారు.

## 24. గోవర్ధనము

ఈ క్షేత్రము ఢిల్లీ పట్టణమునకు 90 మైళ్ళ దూరమున గల మధుర రైల్వేస్టేషన్ జంక్షనులో దిగి పోవలయును. మధుర - యమునా నదీ తీరమున గలదు. ఇచట గోవర్ధనేశుడు సత్యభామా సమేతుడై వేంచేసి యున్నాడు. ఆలయముపై గల గోవర్ధన విమానము, పరిసరమున గల యమునానది - ఇంద్ర తీర్థము, గోవర్ధన తీర్థము-అనునవి ఇచట విశేషాంశములు. ఇంద్రాది దేవతలకు స్వామి ప్రత్యక్షము. ఈ గోవర్ధన స్వామిని -

నమ్మాళ్వారులు, పెరియాళ్వారులు, తిరుమంగై యాళ్వారులు - మంగళా శాసనము గావించి యున్నారు.

ప్రస్తుతము ఈ క్షేత్రమున గల అర్చా విగ్రహములు - ఆళ్వారులచే మంగళాశాసనము చేయబడినవి కావు. అచట పండాలు చూపించు విగ్రహ ములు వాస్తవమైనవి కావు. అవి ఏనాడో శిథిలమైనవి. ఈ గోవర్ధనమునకు 8 మైళ్ళ దూరములో - 'బృందావనము' గలదు. ఇచట 125 సంవత్సర ములకు పూర్వము నిర్మించిన 'రంగ మందిరము' గలదు. ఇచ్చట దాక్షి ణాత్య సంప్రదాయము ననుసరించియే అర్చనలు జరుగును. శ్రీకృష్ణపర మాత్మ గోవులను గాచిన గోవర్ధనగిరి - మధురానగరమునకు 7 మైళ్ళ దూరములో గలదు. ఈ గోవర్ధనగిరి యొక్క చుట్టుకొలత - దాదాపు 10 మైళ్ళు కలదు.

## 25. గోకులము

ఈ క్షేత్రము మధురా నగరమునకు 4 మైళ్ళ దూరములో గలదు. గోకులము కూడ మహమ్మదీయుల దండయాత్రల వలనధ్వంసమయ్యెను. ఆళ్వారులు మంగళాశాసనము గావించిన గోకులనాథుని మనము నేడు సేవింపజాలము. అచటి స్వామి - నవ మోహనకృష్ణుడు - రుక్మిణీ సత్యభామా సమేతుడై, తూరుపు అభిముఖముగా, నిలుచున్న భంగిమలో సేవ సాయించుచున్నాడు. హేమకూట విమానముతో ఆలయము శోభిల్లు చుండును. ఆలయమునకు పరిసరముననే యమునా నది గలదు నంద గోపునకు స్వామి ప్రత్యక్షము. పెరియాళ్వారులు, ఆండాళ్ - ఈ స్వామిని గురించి తమ తమ దివ్య ప్రబంధములతో మంగళాశాసనము గావించి యున్నారు.



# శ్రీరంగ క్షేత్ర వైశిష్ట్యము

"చారిత్రిక శిరోమణి - విశిష్టాద్వైత వేదాంత విశారద"

**డాక్టర్ : శ్రీమాన్ శ్రీ పెరుంబుదూరు శ్రీరంగాచార్యులు,**

యం. ఏ; పి హెచ్. డి.



## అంజలి

" సప్త ప్రాకార మధ్యే సరసిజ ముకుళో ద్భాసమానే విమానే
కావేర్యో ర్మధ్య దేశే ఫణిపతి శయనే శేష పర్యంక భాగే
నిద్రా ముద్రాభిరామం కటి కట శిరః పార్శ్వ విన్యస్త హస్తం
పద్మా ధాత్రీ కరాభ్యాం పరిచిత చరణౌ రంగరాజం భజేఽహమ్."

## క్షేత్ర పరిచయము

దక్షిణ దేశమందలి అతి ప్రాచీనమైన పుణ్య క్షేత్రములలో పేర్కొన దగినది - శ్రీరంగము. అరవవారు దీనిని - 'అరంగ' మందురు. నేటి తమిళనాడు రాష్ట్రములో - తిరుచునాపల్లి జిల్లా యందు ఈక్షేత్రము గలదు. ఇచ్చటి స్వామి - శ్రీరంగ నాథుడు. 108 దివ్య తిరుపతులలో నొకటిగా ఈ క్షేత్రము - శ్రీవైష్ణవులు సేవించు ముఖ్య క్షేత్రములలో నొకటి. ఈ దేవాలయ నిర్మాణము ఎప్పుడు జరిగినది - చరిత్రకారులకు అందని విషయము. పురాణముల యందు మాత్రము - ఇది క్రీ. పూ. 10-వ శతాబ్దమునకు జెందిన ఆలయమని గలదు. దేవాలయ శాసనములు-రికార్డులు A. D. పదియవశతాబ్దము నుండి గలవు. ప్రస్తుతమున్న దేవాలయము 10-వ శతాబ్దమునఅభివృద్ధి చేయబడినది. దీనికి - పాండ్యులు ముఖ్యులు. అనంతరము

వచ్చిన రాజవంశములవారు - ఈ స్వామికి భూరి దానమిచ్చినట్లు - మన చరిత్రలు తెల్పును.

## అన్య మతస్థుల దుష్కృత్యములు

ఇట్టి దివ్యక్షేత్రము - రాజకీయమైన దండయాత్రలను, అన్య మతస్థుల ప్రధ్వంస కృత్యములను - అనుభవించినది. ముఖ్యముగా మహమ్మదీయుల దండయాత్రల వలన దేవాలయ శోభ చెడిపోయినది. క్రీ. శ, 1371-లో - 'మలిక్ కాఫిర్' అను నతని దండయాత్ర (బుక్కరాయల మధురా విజయయాత్ర కూడ ఈ సమయముననే) జరిగినపుడు - ఆ అల్ల కల్లోలములకు తట్టుకొనలేక, వేదాంత దేశికులు - స్వామివారి విగ్రహమును తిరుపతికి తీసుకొని వెళ్ళి రక్షించి, అనంతరము యథాస్థానమున జేర్చినారట. ఈ విషమును దెలుపుచు దేశికులు వేయించిన ఒక శాసనము నందు - ఈ క్రింది శ్లోకము గలదు :-

" ఆనీ యానీల శృంగ ద్యుతి రచిత జగ ద్రంజనా దంజనాద్రేః
చెంచ్యా మారాధ్య కంచిత్ సమయ మవనిహతో ద్ధమష్కాన్ తురుష్కాన్
లక్ష్మిక్ష్మాఖ్యా ముఖాభ్యాం సహ నిజ నవరే స్థాపయన్ రంగనాథం
సమ్య క్సర్వాన్ సవర్యాన్ పున రకృత యశః ప్రావణో గోపనార్యః. "

(బుక్కరాయల ధర్మోద్ధరణమును శ్లాఘించుచు దేశికులు శిలా ఫలకమును చేయించుచుండగా - గోపన దండనాథుడు - స్వామివారికి చేసిన అనితర సాధ్య మగు బృహత్ కైంకర్యమును దలచి, అనువుగ ఈ శ్లోకమును చెప్పి వ్రాయించినారు.)

ఈ అలజడుల కారణముగా - అప్పటికి విజయనగర రాజులచే నిర్మాణము చేయించబడుచుండిన స్వామివారి గోపుర నిర్మాణము కూడ ఆగిపోయినది. తర్వాత, అనగా - క్రీ : శ : 1630 - 1643 సంవత్సర

ములలో - చేరరాజు విజయమునకు చిహ్నముగా - అచ్యుతరాయలు - నిర్మింప తలపెట్టిన గోపురము కూడ 40 అడుగుల పరిమాణములోనే ఆగిపోయినది.

## తమిళనాడు ప్రభుత్వము - వారి భక్తి శ్రద్ధలు

అనాటి అచ్యుతదేవరాయలు అసంపూర్తిగా వదలిన గోపురమును ఇటీవల 1990 లో తమిళనాడు ప్రభుత్వము వారు పూర్తిచేయ తలపెట్టగా- ఆ ప్రయత్నమునకు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వమువారును, తిరుమల తిరుపతి దేవస్థానములవారును-తగిన సహకార మందింప-ఆ గోపురము240 అడుగుల యెత్తు గలిగి, 15 అంతస్థులతో రూపొంది, నేడు దిదృక్షువులను ఆశ్చర్యచకితుల గావించుచున్నది.

ఆశ్చర్యకర విషయ మే మనగా-ఈ రాజగోపురము పునాది (ఫౌండేషన్) 18 అడుగులకు మించిన లోతులో గల దట ! 'లోకనాథము' అను చీఫు ఇంజనీయరు త్రవ్వించుచుండగా, అంతు చిక్క-లేదట ! అపరమితముగా నీరు మాత్రము ఊరి వచ్చినదట ! "ఆజలాంతం దేవాలయ నిర్మాణమ్" అను పద్ధతికి - ఇది యొక తార్కాణము. ౧.

## శ్రీరంగనాయకుల ఆస్థానము

స్వామివారి గర్భాలయము-సప్తప్రాకారములు దాటిన తర్వాతగలదు. ఇందలి మొదటి మూడు ప్రాకారములు - లౌకికుల పట్టణములు. నాల్గవ

---

౧. 29-7-79 నాటి హిందూపత్రికలోని చిన్న వ్యాసము అధారముగా ఈ విషయములు గ్రహించబడినవి.

దాని నుండి - శ్రీరంగనాయకుల ఆస్థానము. అయినను, యాతాయాతజన వ్రాతము, ప్రయాణీకుల వాహనములు-ఈ రద్దీవలన, మనము ప్రాకారముల లోపల నున్న విషయమునే విస్మరింతుము.

ఇచట స్వామివారి శయ్యా విగ్రహము - సుమారు 20 అడుగుల మూలవిరాణ్మూర్తి* దేవాలయమునకు ఉభయ పార్శ్వములందును - కావేరీనది ప్రవహించుచుండును. ౨. ఇచట ఈ నది రెండుగా చీలి, ఉత్తర శాఖ - కొల్లడము (కోల్ రూన్) అను పేరు గలిగి యుండును. దక్షిణ వాహిని యగు కావేరి - మరి ఐదు శాఖలుగా మారి, ఆ ప్రాంతమును సస్య శ్యామలముగా చేసినది. త్యాగరాజస్వామి తిరువయ్యూరు-కావేరీ తీరముననే గలదు.

కరికాల చోళుడు ఈ కావేరికి ఆనకట్టలు కట్టించుట ప్రసిద్ధమైన విషయము.

## విశిష్టాద్వైత మత స్థాపన

నాథమునులు, యామునాచార్యులు, రామానుజాచార్యులు, పరాశర భట్టరు, వేదాంత దేశికులు - మున్నగు వైష్ణవాచార్యులందరును-ఈ శ్రీరంగ క్షేత్రమును కేంద్రము గావించుకొనియే - తమ తమ శ్రీసూక్తులను ప్రవచనము గావించిరి. శ్రీమద్రామానుజులు ఈ క్షేత్రమునందు దాదాపు అరువది సంవత్సరములు సంచరించిరని ప్రతీతి. వేదాంత దేశికులు ప్రథమ పర్యాయము శ్రీరంగమునకు విచ్చేసినపుడు - శ్రీరంగనాథస్వామివారి దర్శన భాగ్యమును పొంది, ఆ స్వామివారి అవయవ సౌందర్యమునకు ముగ్ధులై,

---

౨. ఇచ్చట కావేరీ - బాహువులు సాచిన నాయిక యనియు, స్వామి నాయకు డనియు-కవుల వర్ణన. అట్టిదే భైరవ కవి విరచిత మగు శ్రీరంగ మహాత్మ్యమునందు గలదు. (1-104-141).

ఆ యా యవయవ సౌందర్యవిశేషములను వర్ణించుచు - పంద్రెండు శ్లోక ములలో స్తుతించిరి. ఈ స్తోత్రము 'భగవ ద్ధ్యాన సోపాన' మను పేర ప్రసిద్ధమై యున్నది.

" శ్రీరంగం కరిశైల మంజనగిరిం తార్క్ష్యాది సింహాచలం
శ్రీకూర్మం పురుషోత్తమం చ బదరీనారాయణం నైమిశమ్
శ్రీమ ద్ద్వారవతీ ప్రయాగ మధురా కాంచీ గయా పుష్కరా
సాలగ్రామగిరిం నిషేవ్య రమతే రామానుజోఽయం మునిః"

రామానుజులకు పూర్వము మిక్కిలి ప్రచారమునందని శ్రీవైష్ణవము- వీరి అవతార ప్రాదుర్భావముతో మిక్కిలిగా వ్యాప్తి జెందినది. వర్ణభేద మును శ్రీవైష్ణవ మతములో కలిగించదు. అందు కుదాహరణము - ఆళ్వా రులే. వీరియందు - పంచమజాతివారును గలరు.

## వైష్ణవములో - రెండు శాఖలు

రామానుజుల యనంతరము - దేశికుల హయాములో - ప్రపత్తి మార్గమున వచ్చిన భేదభావము వలన శ్రీవైష్ణవము రెండు శాఖలుగా మారి నది. ఒకటి - వడగళ్, రెండవది - తెనగళ్. వడహల వారికి దేశికులు ముఖ్యులు కాగా, తెనగల సంప్రదాయమునకు పిళ్ళలోకాచార్యులు ముఖ్యు లైనారు. వీరి ప్రచారము కారణము వలన, మతాభివృద్ధి విశేషముగా జరిగినది. ౩

దేశికుల కుమారుడు - శిష్యుడును అయిన వరదాచార్యులు (వీరికే నైనారాచార్యు లను నామాంతరము) రాచకొండ సంస్థానమునకు విచ్చేసి, పండితులతో వాదించి, శైవుడైన శాకల్య మల్లనను ఓడించి, ప్రభువులను, అస్థాన కవిని - శ్రీవైష్ణవులుగా మార్చినట్లు - చారిత్రకుల వ్రాతలు సాక్ష్య

౩. విజ్ఞాన సర్వస్వము - ౩ - వ సంపుటములో-560 - 562 పుటలందు గల 'తెలుగు సంస్కృతి' వ్యాసములోని - 'వైష్ణవము' ఉపశీర్షిక.

మిచ్చుచున్నవి. వీరినుండియే తెలంగాణమునందు శ్రీవైష్ణవము వ్యాప్తి జెంది, వెలమ - రెడ్డి ప్రభువులు - 'శ్రీమతే రామానుజాయ నమః' అనుచు త దాచారములతోనే ఉండిరి. (నేటికిని వీరినుండు - ఈ పద్ధతి తెలంగాణ మున గలదు.) వరదాచార్యుల ప్రభావము వలన - భట్టరు, కందాళ, తిరుమల, నల్లాన్ చక్రవర్తుల - మొదలగు పీఠము లేర్పడినవి. వీరి ప్రభావము ననే - తెలంగాణమున విష్ణ్వాలయముల నిర్మాణము, కవుల విష్ణు గాథా పూరితములైన రచనలు - విరివిగా జేయుట జరిగిన వనవచ్చును. తెలంగాణమున శ్రీరంగ రాజ మన్నారు ఆలయములు వెలయుటకు కూడ ఇదియే కొంత ప్రోద్బలము. ఈ విధముగా - రాచకొండవారిపై బడిన శ్రీవైష్ణవ మత ప్రభావము - కవులకును తప్పలేదు. అందులకే భైరవ కవి - శ్రీరంగ మహాత్మ్యమును రచించినాడు.

## శ్రీరంగ మహత్త్వ సమీక్ష

భైరవ కవి రచించిన 'శ్రీరంగ మహత్త్వము' అను ఆంధ్ర పద్య కావ్యమునకు మూలము - సంస్కృత భాషలో గల గరుడ పురాణము. ఐదు ఆశ్వాసములుగల ఈ కావ్యమును భైరవ కవి-చాగయ రామదేవపండితునకు అంకితము చేసినాడు. ఈ చాగయ రాముడు - బహమనీరాజ్యమందు ఒక మాండలికుడుగా గల సైవఖాన్ వద్ద - మంత్రి యగు విఠలేశ్వరునకు సోదరుడు

శ్రీరంగ మహత్త్వ గ్రంథకర్త యగు ఈ భైరవుడు - తన తండ్రి యైన 'గౌరన' రచనల మూలముగ ప్రభావితు డయ్యెను. గౌరన కాలము 1380 - 1425 అని-కొందఱు పరిశోధకులు నిర్ణయించిరి. ఈ నిర్ణయము ననుసరించి - ఆతని పుత్రు డగు భైరవుని కాలమును నిర్ణయింపవచ్చును

శ్రీరంగ మహత్త్వమును చదువువారికి-సమస్త కల్యాణములు చేకు రును. ఇదియే భైరవుని గ్రంథ మందలి సందేశము.

"సారంబై మోక్షపదా
ధారలబై, పుండరీక దళ నయన నిజా
గారంబై మహి బరగిన
శ్రీరంగ మహత్త్వ మతి విచిత్రము దలపన్."

అని - శ్రీరంగ మహత్త్వ ప్రభావమును వివరించినాడు భైరవ కవి.

భైరవుడు శైవుడు. భ్రమరాంబా వర ప్రసాద లబ్ధ కవిత్వము గల వాడు. అట్టి భైరవుడు - శ్రీరంగ మహత్త్వమును తెనిగించినాడు. కృతి భర్త - వైష్ణవ మతాభిమాని. కవి - వైష్ణవ మతాభినివేశముతో దీనిని ఆంధ్రీకరించినాడు.

భైరవ కవియే గాక, యతిరాజాచార్యుల శిష్యుడును, శ్రీవైష్ణవమతాభి మానియునగు కట్టా వరదరాజు-గారుడాంతర్గతమగు శ్రీరంగమహాత్మ్యమును తెనిగించినాడు. 1650 వ శతాబ్దమునకు జెందిన ఈ వరదరాజుకు - శ్రీ వేంకటేశ్వర స్వామి ఇష్టదైవము. ఇందువలన, ఈతడు తన కృతుల నన్నింటిని - ఆ స్వామికే అంకితము గావించెను. ఇతని కృతులు - 1) పరమ భాగవత చరిత్ర 2) ద్విపద రామాయణము 3) శ్రీరంగ మహా త్మ్యము - అనునవి.

## మఱికొన్ని శ్రీరంగ మాహాత్మ్యములు

మనకు లభించిన శ్రీరంగ మహాత్మ్య గ్రంథములలో - భైరవుని రచనయే మొదటిది. ఇతనికి ముందు-అనగా క్రీ : శ : 1415 ప్రాంతమున నున్న శ్రీగిరి కవి - శ్రీరంగ మహత్త్వమును వ్రాసెను గాని, అది లభింప లేదు.

భైరవుని రచన తర్వాత - శ్రీరంగ మహాత్వములు - పద్య, ద్విపద, వచన రూపములుగా మఱికొన్ని వచ్చినవి. ఆ యా వివరములు - ఈ క్రింద పేర్కొనబడుచున్నవి.

ముద్రితములు :-

| | కవి | కాలము | గ్రంథ విభాగము | ముద్రణము |
|---|---|---|---|---|
| 1. | శ్రీరంగ కవి | 1815 | పద్యము | — |
| 2. | కట్టా వరదరాజు | 1600 - 1650 | పద్యము | 1921 |
| 3. | కస్తూరి రంగయ్య | ,, | పద్యము | 1921 |
| 4. | పులిపాక రామన్న | ,, | వచనము | 1921 |
| 5. | వెల్ల నరసింహాచార్యులు | ,, | వచనము | 1978 |
| 6. | సరస్వతి వెంకట సుబ్బరాయ శాస్త్రి | ,, | వచనము | 1913 |
| 7. | శ్రీరంగ నాథుడు | ,, | వచనము | 1874 |
| 8. | కర్తృత్వము తెలియనిది | ,, | వచనము | 1914 |
| 9. | ,, | ,, | వచనము | 1966 |
| 10. | ,, | ,, | పద్యము | 1980 |
| 11. | వరమల నరసామాత్యుడు | | కంద పద్యములు | |

అముద్రితములు :-

| | కవి | కాలము | గ్రంథ విభాగము |
|---|---|---|---|
| 1. | చేకూరి సిద్ధకవి | | పద్యము |
| 2. | విజయరంగ చొక్కనాథుడు | 1706 - 1732 | వచనము |
| 3. | ముకుంద యోగి | | |
| 4. | రాజగోపాలము | | పద్యము |
| 5. | గుంటుపల్లి జగన్నాథకవి | | పద్యము |

6. యాముజాల వెంకట శాస్త్రి పద్యము
7. కర్తృత్వము తెలియనిది ద్విపద
8. భాగవతుల రామయ్య ద్విపద
9. వంగీపురం వెంకట రామానుజాచార్యులు తాహర
10. మఱియొకటి ఎవరిదో - గేయము

వీరలే గాక, శ్రీరంగ మహత్త్వమును వర్ణించి, రచించినవారిలో - చెన్నమల్లు, సింగలి సూరన, మరింగంటి సింగరాచార్యులు - అను వారును గలరు.

## ఇతర కావ్యములలో - శ్రీరంగ క్షేత్ర ప్రశంస

ఈ గ్రంథములు వ్రాసినవారలే గాక, తమ తమ గ్రంథములలో శ్రీరంగ ప్రస్తావన - వర్ణన చేసినవారును గలరు. అట్టివారిలో -

శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద ప్రసిద్ధమైనది. ఇది-గోదాదేవీ శ్రీరంగనాథుల కథ. కేంద్రము - శ్రీరంగమే.

1720 ప్రాంతమునకు జెందిన కృష్ణమాచార్యులు - 'శ్రీరంగ వచనములు' వ్రాసినాడు. అంతే గాక, ఇతడు రచించిన సింహగిరి వచనములందును శ్రీరంగము గలదు. ఈయన - అచటనే పరమపదించినట్లు పరిశోధకుల భావన.

సంకుసాల నృసింహ కవి - తన కవికర్ణరసాయనమును శ్రీరంగ నాథునకు అంకిత మిచ్చినాడు. ఇందు నృసింహకవి - శ్రీరంగనాథుని అవతార వైభవమును ప్రథమాశ్వాసమున - 30 వ పద్యము నుండి, 91 - వ పద్యము వఱకు వర్ణించినాడు.

కళాపూర్ణోదయమునందు వీణాధరుని తీర్థయాత్ర సందర్భముతో - శ్రీరంగము గలదు.

వసు చరిత్రము 1 - 34 నందు - శ్రీరంగనాయక స్వామికి, కృతి భర్తకు - అభేద ప్రతిపత్తి చెప్పబడినది.

రఘునాథ రాయల వాల్మీకి చరిత్రలో - 2 - 24 నుండి 33 వరకు - శ్రీరంగనాథ ప్రస్తావన గలదు.

విజయ విలాసములో-'శ్రీరంగేశుడె వచ్చి యచ్యుతధరిత్రీ కర్తయై' ఇత్యాది పద్యము - శ్రీరంగనాథుని దర్శింపజేయును. ఏల ననగా, చెవ్వ నృపతి పుత్రుడు అచ్యుతప నాయకుడు (1580 - 1600) శ్రీరంగపతికి సింహాసనము, వసిడి సెజ్జ, అష్టమ ప్రాకారము, గోపురము - సమకూర్చి, రత్నాంగద కిరీటము, అభయ హస్తము - ప్రదానము చేసెను. ఈయన - చివరి దినములలో-రఘునాథునకు రాజ్య మప్పగించి, శ్రీరంగమునందే శేష జీవితమును గడపినాడు. అందులకే పై పద్యమును చేమకూర వెంకన్న వ్రాసినాడు.

ఇంకను - 108 దివ్య తిరుపతులను వర్ణించిన గణపవరపు వేంకట కవి ప్రబంధరాజమునందును, అయ్యలరాజు నారయణామాత్యుని 'హంస వింశతి' యందును - శ్రీరంగ ప్రస్తావన చేయబడినది.

తాళ్ళపాకవారి 'పరమయోగి విలాసము'నందు - శ్రీరంగనాథ పై భవము వర్ణింపబడినది.

సారంగు తమ్మయ రచించిన 'విప్రనారాయణ' అనబడు భక్తాంఘ్రి రేణువు (తొండరడిప్పొడి యాళ్వారులు) చరిత్రకు, దేవదేవీ విలాసమునకు- రంగ స్థలము శ్రీరంగమే.

## ముగింపు

ఇట్లే - ఇంక ఎందరో కవిశేఖరులు - శ్రీరంగక్షేత్ర ప్రశస్తిని, శ్రీరంగనాథుని దివ్యవైభవమును - బహు విధములుగా వర్ణించియున్నారు. ఇట్టి కారణములను బట్టి - శ్రీరంగ క్షేత్ర వైశిష్ట్యము సుస్పష్టము.

" శ్రీరంగ దివ్య భవనం భువి గోపురాణాం
ప్రాకారతేన నికరేణ గరుత్మతేన
పార్శ్వ ప్రసారిత పతత్ర పుటేన భక్త్యా
నానా తనూభి రుపగూఢ ముపఘ్నయామః."

—(శ్రీరంగ రాజ స్తవము ; 1 - 34)

ప్రాకారములు గల గోపుర సమూహములచే కూడుకొనినట్టియు, ఈ లీలా విభూతి యందు పార్శ్వములలో వ్యాపించినట్టియు, పత్రాకారము గల రెక్కలు గలిగినట్టి గరుత్మంతునిచేతను, అనేక శరీరములచేతను, అనేక విగ్రహములచేతను ఆవరింపబడిన శ్రీరంగ ధామమును ఆశ్రయించు చున్నాను."



# భగవద్ధ్యాన సోపానము

—: సంస్కృత మూలము :—

"కవితార్కిక కేసరి – సర్వతంత్ర స్వతంత్ర"

## శ్రీ వేదాంత దేశికులు

—: ఆంధ్ర తాత్పర్యము :—

'విశిష్టాద్వైత వేదాంత విశారద'

**శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యులు,** ఎం. ఏ; బి. యిడి.



**1**

అంతర్జ్యోతిః కిమపి యమినా మంజనం యోగదృష్టేః
చింతారత్నం సులభ మిహ న స్సిద్ధి మోక్షానురూపమ్
దీనానాథ వ్యసన శమనం దైవతం దైవతానాం
దివ్యం చక్షుః శ్రుతిపరిషదాం దృశ్యతే రంగమధ్యే.

**తాత్పర్యము :-**

బ్రహ్మ రుద్రేంద్రాది దేవతలు పూజించు శ్రీమన్నారాయణుని దర్శింపవలెనని తహ తహ లాడు భక్తుల నేత్రములకు అంజనమువంటి వాడు, యోగుల హృదయారవిందములలో విలసిల్లువాడు, దీనులను-అనాథులను కష్ట పరంపరలనుండి కడతేర్చువాడు, తన స్వరూప వైభవమును తెలిసికొనుటకు వేదాంత శాస్త్రములను బోధించి, జ్ఞాన నేత్రమును ప్రసాదించువాడు, సౌలభ్య సౌశీల్యాది కల్యాణ గుణ గణ పరిపూర్ణుడు, తనను

తలచినవారి కోరికలను ఫలింపజేయువాడు, ఈ లోకమందే తనను సేవించు వారికి మోక్షానందమును సిద్ధింపజేయుటకు అర్చా రూపముతో వెలసిన శ్రియపతి - శ్రీరంగ క్షేత్రమున దర్శన మిచ్చుచుండును.

**2**

వేలాతీత శ్రుతి పరిమళం వేదసాం మౌళిసేవ్యం
ప్రాదుర్భూతం కనక సరితః సైకతే హంసజుష్టే
లక్ష్మీ భూమ్యోః కర సరసిజై ర్లాలితం రంగభర్తుః
పాదాంభోజం ప్రతిఫలతి మే భావనా దీర్ఘికాయామ్.

**తాత్పర్యము :-**

సార మెఱుంగరాని వేదములలో పరిమళించునవియు బ్రహ్మలు తలలు వంచి సేవింపదగినవియు, పరమహంసలు పరివేష్టితులై సేవించు చున్నప్పుడు కావేరి యిసుకతిన్నె మీద ఉప్పతిల్లి కానవచ్చునవియు, శ్రీ భూ దేవుల పాణిపద్మములచే అతి మృదువుగా నొత్తబడుచుండునవియు నగు శ్రీరంగనాథుని పాదపద్మములు - నా హృదయ సరస్సులో ప్రతిఫలించు చున్నవి.

**3**

చిత్రాకారాం కటకరుచిభి శ్చారు వృత్తానుపూర్వాం
కాలే దూత్యద్రుత తరగతిం కాంతి లీలా కలాచీమ్
జానుచ్ఛాయా ద్విగుణ సుభగాం రంగభర్తు ర్మదాత్మా
జంఘాం దృష్ట్వా జనన పదవీ జాంఘికత్వం జహాతి.

**తాత్పర్యము :-**

కడియముల కాంతులచే తీర్చి దిద్దిన వృత్తముల వలె చిత్రమైన ఆకారము, జానువుల శోభచే ఇనుమడించిన సోయగము కలిగి, ఒకప్పుడు రాయబారమునకు అతి శీఘ్రముగా నడక సాగించి, కాంతివిలాసములను

పుక్కిలించిన ట్లున్న శ్రీరంగనాథుని పిక్కల చక్కదనమును మక్కువతో సేవించి, నా మనస్సు - ఇక జన్మ మెత్తకుండునట్లు - సంసారపు బాటలో పరువెత్తుట విరమించినది.

4

కామారామ స్థిర కదళికా స్తంభ సంభావనీయం
క్షౌమా శ్లిష్టం కి మపి కమలా భూమినీళోపధానమ్
న్యంచ త్కాంచీ కిరణ రుచిరం నిర్విశ త్యూరుయుగ్మం
లావణ్యౌఘ ద్వయ మివ మతి ర్మామికా రంగయూనః.

తాత్పర్యము :-

వలరాజు సింగారపు తోటలో కలకాలము శోభించు కదళీ స్తంభము లనదగినవియై, శ్రీ భూ నీళా దేవేరులకు తలగడ దిండ్లుగా అమరినవియై, జారుచున్న మొలత్రాటి మణుల కాంతులతో నిగ నిగ లాడుచు - లావణ్య రాశి రెండు పాయలైన ట్లున్న శ్రీరంగనాథుని ఊరువులలోనికి నా మనస్సు చొరవతో చేరుచున్నది.

5

సంప్రీణాతి ప్రతికల మసౌ మానసం మే సుజాతా
గంభీరత్వాన్ క్వచన సమయే గూఢ నిక్షిప్త విశ్వా
నాళీకేన స్ఫురిత రజసా వేధసో నిర్మిమాణా
రమ్యావర్త ద్యుతి సహచరీ రంగనాథస్య నాభిః.

**తాత్పర్యము :-**

దివ్య స్వరూపమునకు మధ్యలో ఒద్దికగా ఉండి, చేతనాచేతన రూపమైన విశ్వమును ప్రళయ కాలమునందు భద్రముగా దాచిపెట్టుచు, సృష్టి నిమిత్తము తనలోనే వెలసిన తామర పుప్పొడి నుండి ఒక విరించిని సృజింపజేయుచు, కమనీయ కాంతులు లోపల రమణీయముగ సుళ్ళు తిరుగు శ్రీరంగనాథుని గంభీరమైన నాభి - ప్రతి క్షణము - నా డెందమును ఆనందమయము చేయుచున్నది.

## 6

శ్రీవత్సేన ప్రథిత నిభవం శ్రీ పదన్యాస ధన్యం
మధ్యం బాహ్వో ర్మణి వర రుచా రంజితం రంగధామ్నః
సాంద్రచ్ఛాయం తరుణ తులసీ చిత్రయా వైజయంత్యా
సంతాపం మే శమయతి ధియ శ్చంద్రికోదారహారమ్.

**తాత్పర్యము :-**

'శ్రీవత్స' మను పుట్టు మచ్చ ప్రసిద్ధమై, లక్ష్మీదేవిచే పాద లక్షణములతో ధన్యమైన కౌస్తుభ మణి కాంతిచే రంజితమై, పచ్చని తులసీ దళములతో మనోజ్ఞముగా అల్లిన వైజయంతిమాలచే అలరారినదియై, వెన్నెలను విరజిమ్మె తెల్లని ముత్యముల హారముతో నిత్యముశోభించు శ్రీరంగధాముని వక్షస్థలము - నా మనస్తాపమును హరించుచున్నది.

## 7

ఏకం లీలోపిహిత మితరం బాహు మాజానులంబం
ప్రాప్తా రంగేశయితు రఖిల ప్రార్థనా పారిజాతమ్

దృష్టాసేయం దృఢ నియమితా రశ్మిభి ర్భూషణానాం
చింతా హస్తి న్యనుభవతి మే చిత్ర మాలాన యంత్రమ్.

**తాత్పర్యము :-**

శ్రీరంగశాయి బాహువులు భక్తుల కోరికలు దీర్చు పారిజాతములు. ఆ రెంటిలో ఒకటి - తన తలగడ దిండును, మఱి యొకటి-మోకాటి వఱకు చాపబడి, పవళించు తీవిని ప్రకటించుచున్నట్లును ఉండును. దర్పముతో విచ్చలవిడిగా విహరించు నా మన స్సనెడు ఏనుగు - ఆ బాహువు లనెడు రెండు మేకులకు - నగల కాంతి కిరణములు త్రాళ్ళతో కదలకుండునట్లు బంధింపబడినది. శ్రీరంగశాయి బాహు సౌందర్యమును చిత్రముగా అనుభవించుచున్న దీ మనస్సు.

## 8

సాభిప్రాయ స్మిత వికసితం చారు బింబాధరోష్ఠం
దుఃఖాపాయ ప్రణయిని జనే దూర దత్తాభిముఖ్యమ్
కాంతం వక్త్రం కనక తిలకాలంకృతం రంగ భర్తు
స్స్వాంతే గాఢం మమ విలగతి స్వాగతోదారనేత్రమ్.

**తాత్పర్యము :-**

దొండపండు వలె అందమైన అధరోష్ఠము ఆశ్రితులపట్ల సాభిప్రాయముగా చిందించుచు, ఉజ్జ్వలముగా ప్రకాశించు ఊర్ధ్వపుండ్రము ఉన్నతిని సూచించుచు, ఔదార్యమును ప్రకటించు కన్నులు స్వాగతము పలుకుచు, దుఃఖమును బాపుమని వేడుకొను ఆర్తులకు అల్లంత దూరముననే అభిముఖ సంపదను అందజేయుచు, దర్శన భాగ్యమును కలిగించుచు -

గొప్పగా ఆకర్షించు శ్రీరంగనాథుని తిరుముఖమండలము - నా హృదయములో - స్థిరముగా నెలకొని విలసిల్లుచున్నది.

## 9

మాల్యై రంతః స్థిర పరిమళై ర్వల్లభా స్పర్శమాన్యైః
కు వ్యచ్చోళీ వచన కుటిలైః కుంతలైః శ్లిష్టమూలే
రత్నాపీడద్యుతి శబలితే రంగభర్తుః కిరీటే
రాజన్వత్యః స్థితి మధిగతా వృత్తయ శ్చేతసో మే.

**తాత్పర్యము :-**

శ్రీ భూ నీళా దేవతామతల్లులు వాల్లభ్యముతో అల్లి, ముద్దుగా శిరమున తురుమిన పూల మాలికలు, లోలోపల కమ్మని తావులను విరజిమ్మగా - ప్రణయ కోపముతో చిఱచిఱలాడు చోళదేశపు వనితల వక్రోక్తులవలె కుటిలముగా నున్న కుంతలములను, ఉంగరముల జుట్టును ఆవరించి, శిఖరము చుట్టును పొదగిన రకరకముల రత్నముల వలన పలువన్నెల చిన్నెలతో కనబడు శ్రీరంగరాజు కిరీటమును సేవించి, నా చిత్తవృత్తులు రాజాధీనములై, నిశ్చలముగా నిలిచిపోయినవి.

## 10

పాదాంభోజం స్పృశతి భజతే రంగనాథస్య జంఘా
మూరు ద్వంద్వే నిజగతి శనై రూర్ధ్వ మధ్యేతి నాభిమ్
వక్షస్యాప్తే వలతి భుజయో ర్యామికేయం మనీషా
వక్త్రాభిఖ్యాం పిబతి వహతే వాసనాం మౌళిబంధే.

**తాత్పర్యము :—**

నా మనసు - శ్రీరంగనాథుని పాద కమలములను సున్నితముగా స్పృశించుచు, జంఘలను జన్మరాహిత్యముగా సేవించుచు, ఊరువులను చౌరవతో తగులుచు, పైకి మెల్లగా ప్రాకి, నాభిని జేరి, ఎదమీద నెమ్మదిగా నుండి, బాహువులను వలగొని, ముఖ వర్చసును చూరగొని, కిరీట పరిమళమును మూర్కొని పరవశించినది.

# 11

కాంతోదారై రయ మిహ భుజైః కంకణ జ్యాకిణాంకైః
లక్ష్మీ ధామ్నః పృథుల పరిఘై ర్లక్షితా భీతి హేతిః
అగ్రే కించిత్ భుజగ శయనః స్వాత్మనై వాత్మన స్సన్
మద్యే రంగం మమ చ హృదయే వర్తతే సావరోధః.

**తాత్పర్యము :-**

శేషశాయి యగు శ్రీరంగనాథుడే తనకు కొంచెము ముందువైపు ఉత్సవ మూర్తిగా నిలిచియున్నాడు. బంగారు కంకణములు, నారి సారించుట వలన కాయలుగాచిన గుర్తులను కలిగి యున్నట్టియు, లక్ష్మీదేవి ధామమునకు పెట్టిన కోటగా నున్నట్టియు, అభయ ముద్రను ప్రకటించుచు- ఆయుధములను ధరించియున్నట్టి - కాంతులను వెదజల్లు నాలుగు భుజములతో, శ్రీ భూ నాళ్ని పత్నులతోను, శ్రీరంగములో వెలసిన ఉత్సవమూర్తి శ్రీరంగనాథుడు - ఆహా ! నా అంతరంగమందును వెలసియున్నాడు.

## 12

రంగస్థానే రసిక మహితే రంజితాశేష చిత్తే
విద్వత్సేవా విమల మనసా వేంకటేశేన క్లుప్తమ్
అక్లేశేన ప్రణిహిత ధియా మారురుక్షో రవస్థాం
భక్తిం గాఢాం దిశతు భగవ ద్ధ్యాన సోపాన మేతత్.

**తాత్పర్యము :-**

అనేక రసికావతంసులు డెంద మానంద ధామ మగునట్లు గానముచేయు శ్రీరంగనాథుని సన్నిధిలో - జ్ఞాన వృద్ధుల సేవ చేయుట వలన చిత్త శుద్ధి కలిగిన శ్రీవేంకటనాథ కవి రచించిన ఈ 'భగవధ్యాన సోపాన' మను స్తోత్రము - యోగారూఢ స్థితిని అనాయాసముగా పొందగోరువారికి స్థిరమైన పరమ భక్తిని ప్రసాదించుగాత !



# కవి పండిత పరిచయము

## శ్రీమాన్ తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు

వీరు – తాళ్ళపాక అన్నమాచార్యుల తనయులు. జననము క్రీ. శ. 1473.

తండ్రి వలెనే వీరును మహా భక్తులు. తిరుమలలో శ్రీనివాస భగవానుని సన్నిధియందు – తాము స్వయముగా రచించిన సంకీర్తనములను వీరు గానము చేయుచుండెడివారు. తత్ఫలముగా వీరికి శ్రీనివాస భగవానుఁడు – తమ దర్శన భాగ్యమును ప్రసాదించుచుండెడివాఁడు.

మహా దాతృత్వ గుణ సంపన్నులైన ఈ తిరుమలాచార్యులు ఎన్నియో ధర్మకార్యములను గావించిరి. అట్టివానిలో ముఖ్యముగా పేర్కొనఁబడినవి :- (1) విజయనగరమునఁ గల విఠలేశ్వరస్వామివారి ఆలయమును జీర్ణోద్ధరణము గావించి, ముఖమండపమును నిర్మించి, మెట్లు కట్టించుట (2) తిరుమలలో – తమ నివాస స్థానమునకు అభిముఖముగా నొక మండపమును కట్టించుట (3) శ్రీనివాస భగవానుని అర్చనాది కైంకర్యముల నిమిత్తమై, శ్రీవైష్ణవ స్వాములను నియమించి, వారికి స్థిరమైన వసతి సౌకర్యములను, స్థిరమైన జీవన భృతిని – కల్పించుట, (4) శ్రీ వేంకటేశ్వరస్వామివారి పేర 13 గ్రామములను దానము చేయుట. (5) విశేష ధనమును, స్వర్ణాభరణములను – శ్రీస్వామివారి బొక్కసమునకు సమర్పించుట. (6) శ్రీ వరాహస్వామివారి ఆలయమునకు – ముఖ మండపమును, ప్రాకారమును నిర్మించుట. (7) శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయమునకు – ప్రాకారమును, ముందు గోపురమును నిర్మించుటకు ఆరంభించుట. (8) వీరి తండ్రి యగు అన్నమాచార్యులవారిచే రచింపబడిన వేలకొలఁది సంకీర్తనములను రాగి రేకులపై చెక్కించి, తిరుపతిలో – ఒక గదిలో భద్రపరచుట. (9) తిరుపతిలో - ఆళ్వార్ తీర్థ ప్రాంతమున శ్రీ లక్ష్మీ నారాయణులను ప్రతిష్ఠించుట. ఇట్టి ఘన కార్యములను ఈ పెదతిరుమలాచార్యులవారు అనేకములను గావించి, 'శ్రీమ ద్వేదమార్గ ప్రతి

ష్ఠాపనాచార్య', 'శ్రీ రామానుజ సిద్ధాంత స్థాపనాచార్య', 'శరణాగత వజ్ర పంజర' - అను బిరుదములను పొందిరి.

ఈ పెద తిరుమలాచార్యులు తెనాలి రామకృష్ణుని గురు వగు కందాడై అప్పలాచార్యులవారి వద్ద పంచ సంస్కారములను పొంది, శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత వైశిష్ట్యమును గ్రహించిరి.

వీరి రచన లివి :- (1) శృంగార సంకీర్తనలు (2) శృంగార దండకము (3) శృంగార వృత్త శతకము (4) వైరాగ్య వచన మాలికా గీతములు (5) చక్రవాళ మంజరి (6) వేంకటేశోదాహరణము (ఇయ్యది - ఈ గ్రంథారంభమున ప్రచురితము), (7) సుదర్శన రగడ (8) మేలుకొలుపు (9) రేఫాకార నిర్ణయము (10) భగవద్గీతా వచనములు (11) సంకీర్తన లక్షణము (లక్షణ గ్రంథము), (12) ఆంధ్ర వేదాంతము (13) శ్రీ వేంకటేశ్వర నీతి శతకము (14) ఆంధ్ర హరి వంశము (15) శ్రీ వేంకటేశ్వర వచనములు. ఈ రచనల నన్నింటిని - తమ యిష్ట దైవ మగు తిరుమల శ్రీనివాస భగవానునకే అంకితము గావించిరి.

మహా భక్తులుగా, మహా దాతలుగా, ధార్మిక గ్రంథ నిర్మాతలుగా వీరు శాశ్వత యసస్కులై, క్రీ. శ. 1556 లో - పరమపదించిరి.

## డాక్టర్ : సముద్రాల రంగ రామానుజాచార్యులు



వీరి జన్మ స్థానము - గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకా, పెద్దపరము అగ్రహారము. జననము 5-8-1949. విద్యాభ్యాసము : 1) హైస్కూలు చదువు S.S.L.C. వఱకు ధూళిపూడిలో. 2) తిరుపతి ప్రాచ్యకళాశాలలో విద్వాన్ (65-68) 3) కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ

విద్యాపీఠమునందు - సాహిత్య విద్యా ప్రవీణ - మఱియు, కర్ణాటక సంగీతము (66-71).

విశేష గురువులు : సాహిత్యముదో - శ్రీయుతులు పేరి శ్రీరామమూర్తి గారు, 'వేదార్థ విశారద' ధూళిపాళ రామచంద్రశాస్త్రిగారు, కట్టి శ్రీరామమూర్తిశాస్త్రి గారు, శ్రీమాన్ రొంపిచర్ల శ్రీనివాసాచార్యులుగారు. సంగీతములో - సుప్రసిద్ధ వాయులీన విద్వాంసులైన తిరుపతి పొన్నారావుగారు. వేందాంత దర్శనమున - శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు.

ఉద్యోగములు : 1) 1971 - 72 సంవత్సరములలో - ద్వారకా తిరుమల దేవస్థానమునకు జెందిన హైస్కూలులో సంస్కృత పండిత పదవి. 2) కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యా పీఠము సంస్కృత కళాశాలలో సంస్కృతాధ్యాపకులుగా 1973 జనవరి నుండి కొనసాగుచున్నది.

ఉపాధులు : సాహిత్య విద్యా ప్రవీణ, M. A. (వ్యాకరణము), Ph. D. అలంకార శాస్త్రము, సంగీత సాహిత్యములందును, నాటక రచన యందును, అభి నయమునందును అభిరుచి, అభినివేశము. భారతీయ దర్శనములలోని విశేషములను గ్రహించుటయందును, విశిష్టాద్వైత వేదాంత వైశిష్ట్యమును ఆకళించుకొనుట యందును విశేష కృషి.

రచనా వ్యాసంగము : 1) సంస్కృత సాహిత్య శాస్త్ర ప్రాముఖ్యమును గుఱించియు, జైన బౌద్ధాది నాస్తిక దర్శనములలోని యంశములను గుఱించియు, ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సులలోను, మఱి కొన్ని సభలలోను వీరు అనేక పత్రములను సమర్పించిరి. 2) దార్శనిక విషయములకు, వేదాంత విషయములకు సంబంధించిన వీరి వ్యాసము లనేకములు - పత్రికలందును, విశేష సంచిక లందును ప్రకటింపబడినవి. 3) భగవద్రామానుజుల వేదార్థ సంగ్రహమునకు ఆంధ్రానువాదమే గాక, త ద్వివరణము కూడ వీరిచే విరచింపబడినది ఈ

గ్రంథము - తూర్పు గోదావెరి జిల్లా మండపేటలో గల మెహర్ చైతన్య నికేతన్ ట్రస్టు వారు 1990 లో ముద్రించి, ప్రకాశింపజేసిరి. 4) 'హరిభక్తి సుధాకరము' అను నారదీయ పురాణాంతర్గతమైన 20 అధ్యాయముల గ్రంథమునకు వీరు తెలుగు వివరణమును వ్రాయగా, దానిని కొవ్వూరులో గల గౌడీయ మఠమువారు 1991 ఆగష్టులో ముద్రించి, ప్రకటింపజేసిరి. 5) విశిష్టాద్వైత సిద్ధాంత వైశిష్ట్య సంగ్రహ రూపమైన 'వేదాంత కారికావళి' అను సంస్కృత గ్రంథమునకు వీరు ఆంధ్రాను వాదము, 'సుజన తోషిణి' వ్యాఖ్యలు వ్రాయగా, గ్రంథమును మండపేటలో గల చైతన్య నికేతన్ ట్రస్టువారు 1922 జూలైలో ముద్రించి ప్రకాశింపజేసిరి. వీరిచే రచింపబడి, నేటివఱకు అముద్రితములుగా నున్న గ్రంథము లివి. 1) చైతన్య వైభవమ్ (సంస్కృత నాటకము. ఇయ్యది - పూరి, మద్రాసు, రాజమండ్రి మొద లగు పట్టణములలో విద్వాంసులచే ప్రదర్శింపబడినది.) 2) శ్రీనాథుని పల్నాటి వీర చరితమునకు - మాత్రాఛందస్సులో సంస్కృతానువాదము. 3) 'వైకుంఠ నాథ విలాసము' అను సంస్కృత శ్లోక ఆంధ్ర గేయ బద్ధమైన ఖండ కావ్యము. 4) భారతీయ వేదాంత పారిభాషిక పద కోశము (సంస్కృతాంధ్రములలో రచింప బడినది.) 5) జైన బౌద్ధాది అవైదిక దర్శన కోశము (సంస్కృతాంధ్రాంగ్లము లలో.) 6) వైష్ణవ విశ్వాస ప్రాదుర్భావ వికాసములు (చారిత్రక గవేషణము) తెలుగులో. ఇంకను వివిధ విషయములపై వ్రాయబడిన రచనలు మఱికొన్ని. రేడియో ప్రసంగములు :- ఆకాశవాణి విజయవాడ కేంద్రము ద్వారా వీరిచే అనేక సంస్కృత ప్రసంగములు చేయబడినవి. ప్రస్తుతము సంస్కృత పరిచయ కార్య క్రమము నిర్వహింపబడుచున్నది.

## శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు

వీరి జననము 1-7-1930. జన్మస్థానము - తిరుపతి. జననీ జనకులు - జానకమ్మ, వేంకట నరసింహాచార్యులుగారలు. విద్యాభ్యాసము - నెల్లూరు నందలి వేద సంస్కృత కళాశాలలో. ఉభయ వేదాంతాధ్యయనము - పితృ

పాదుల సన్నిధిలో. డిగ్రీలు :- 1. విద్యా ప్రవీణ 2. భాషా ప్రవీణ 3. ఎం ఏ. (సంస్కృతము.)



ఉద్యోగము :- నెల్లూరులో - వేద సంస్కృత కళాశాలాధ్యక్షులుగా చిర కాలము పని చేసి, ఇటీవలనే ఉద్యోగ విరమణ గావించిరి.

రచనలు :- (ముద్రితములు) 1. శుక సందేశమ్(సంస్కృత కావ్యమ్) 2. సంస్కృత బాషా ప్రవేశిక (వ్యాకరణము) 3) వైకుంఠనాథ పంచాశత్ (స్తోత్రము) 4. శ్రీమన్మహాశిలగిరీశ్వర (పెంచలకోన) సుప్రభాతము. 5. స్వాగతమ్ (ఖండ కావ్యము) 6. హాహా హూహూ (విశ్వనాథ సత్యనారాయణగారి నవలకు సంస్కృతానువాదము) 7. శ్రీబాష్య సారము - 1, 2 బాగములు. 8. శ్రీ భగవద్గీతామృతము - 1, 2, 3 భాగములు. 9. శ్రీ గోదా సహస్ర కమల మాలికా (శ్రీ గోదా సహస్ర నామ స్తోత్రము) 10. శిక్షావల్లి (చంద్రికా వ్యాఖ్యానముతో - 'భక్తామృతమ్' మేగజైనులో.

అముద్రితములు :- 11. రత్నమాలా (డాక్టర్ : చెణవాడ గోపాలరెడ్డి గారి వచన కవితకు సంస్కృతానువాదము) 12. శర్వరీ (ఆకిలి శ్రీరామశర్మ గారి ఆంధ్ర పద్య కావ్యమునకు సంస్కృత పద్యానువాదము) 13. బాదరాయణ హృదయము (బాదరాయణ, బోధాయన, సంవాద రూపమున బ్రహ్మ సూత్రార్థ వివరణము సలుపుట) 14. ఉపనిష చ్చంద్రికా (ఆంధ్రమున ఉపనిషత్తులకు ప్రతి పదార్థ తాత్పర్యములు గలది. ఛాందోగ్య, బృహదారణ్యకములు మినహా.)

## శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు

జననీ జనకులు - నాచ్చియారమ్మ, అప్పలాచార్య దంపతులు. జన్మ తిథి 16-2-1933. జన్మించిన గ్రామము - వేములవాడ (పల్లి) కరీంనగర్ జిల్లా.



విద్యాభ్యాసము - వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాల- సీతారాంబాగ్, హైదరాబాద్. చదినిన శాస్త్రములు : 1. వేదాంతము 2. వ్యాకరణము 3. న్యాయము 4. సాహిత్యము. శాస్త్రాచార్యులు శ్రీ ఉ. వే శ్రీమాన్ కోయిల్ కందాడై అప్పన్ శఠకోప రామానుజాచార్యస్వామివారు [సీతా రాంబాగు సంస్కృత కళాశాలా సంస్థాపకులు, సుప్రసిద్ధ, చతుశ్శాస్త్ర పండితులు.] ఉత్తీర్ణత నొందిన పరీక్షలు :- 1. నవీన తర్క- విద్వాన్ (మైసూరు విద్వన్మహా సభ మైసూరు ప్రభుత్వము) 2. విశిష్టాద్వైత వేదాంత విద్వాన్ (వేద శాస్త్రాగమ విద్వత్ సదస్సు - తిరుమల) 3. సాహిత్య విద్యా ప్రవీణ. (ఆంధ్ర కళా పరిషత్తు - వాల్తేరు.) 4. వ్యాకరణ బి. ఓ. యల్. 5. సాహిత్య రత్న (ప్రయాగ హిందీ విద్యాలయ) 6. తెలుగు బి. ఓ. యల్, 7. ఎం. ఏ. (తెలుగు) 8. ఎం. ఏ. (సంస్కృతము.) [4, 6, 7. 8 సంఖ్యలు గల డిగ్రీలు హైదరాబాదులో గల ఉస్మానియా విశ్వ విద్యాలయమునకు సంబంధించినవి.]

సన్మానములు - బిరుదములు :- 1) మైసూరు విద్వన్మహాసభ వీరిని నవీన తర్క- విద్వాంసులుగా పరిగణించి, మహారాజావారి ద్వారా సన్మానము గావించినది.

2) వేదశాస్త్రాగమ సదస్సు-వీరిని విశిష్టాద్వైత వేదాంత విద్వాంసులుగా పరిగణించి, ప్రతి సంవత్సరము సన్మానించుచున్నది. 3) హైదరాబాదులో 1. సురభారతి, 2. సంస్కృత భాషా ప్రచారిణీ సభ - అను సుప్రసిద్ధ సంస్కృత సంస్థలు రెండును వీరిని మహా విద్వాంసులాగా సంభావించి, సన్మానించినవి. 4) ఆంధ్రప్రదేశ్ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము వీరిని గ్రంథ సంపాదకులుగా భావించి సన్మానించినది. 5) విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తక సంఘము విజయవాడ శాఖవారు వీరిని విశిష్ట మహా విద్వాంసులుగా తలంచి సన్మానించినది. 6) నడిగడ్డపాలెమున గల శ్రీమదుభయ వేదాంంతాచార్య పీఠము వీరిని మహా విద్వాంసులుగా భావించి, ప్రతి సంవత్సరము సన్మానించుచున్నది. 7) వేములవాడ, సిద్ధిపేట, యాదగిరి, పాలకొల్లు, నరసాపురము, కోరుకొండ, సింహాచలము, భద్రాచలము మొదలగు పట్టణములలో గల దేవస్థానము లనేకములు వీరిని మహోపన్యాసకులుగా భావించి, సన్మానించినవి. 8) విజయవాడ, ఉయ్యూరు, మచిలీపట్టణము, రాజమండ్రి, గుంటూరు, పాలకొల్లు, పెంటపాడు, విశాఖ పట్టణము, విజయ నగరము మొదలగు అనేక పట్టణములకు సంబంధించిన సాహిత్య - ఆధ్యాత్మిక సంస్థ లనేకములు వీరి ఉపన్యాసము లేర్పరచి, 'ప్రవచన వాచస్పతి', 'మధురోపన్యాసక', 'విశద వాక్శిఖామణి' ఇత్యాది బిరుదులతో గూడ వీరిని సన్మానించినవి. 9) హైదరాబాదు, సికింద్రాబాదు జంట నగరములందును ఎల్లప్పుడు ఏదియో యొక సంస్థ పక్షమున రామాయణ - మహాభారత - భగవద్గీతాదులకును, ముముక్షుప్పడి, గీతాభాష్యము, తిరుప్పావై, భగవద్విషయములు మొదలగువానికి సంబంధించిన వీరి ప్రసంగము జరుగుచుండును, 10) హైదరాబాదులోని జీయర్ ఎడ్యుకేషన్ ట్రస్టు భవనమున - ప్రతి ఆదివారము వీరి భగవద్విషయ ప్రవచనము, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరుస్వామివారు నియమనమున జరుగుచున్నది. 11) హైదరాబాదు రేడియో కేంద్రమున సుమారు 35 సంవత్సరముల నుండి వీరి సంస్కృత కావ్య గానముకాని, సంస్కృత కావ్య నాటక సంబంధము లగు ప్రసంగములుగాని ప్రసార మగుచున్నవి, 11 సంవత్సరముల నుండియు వీరి సంస్కృత పాఠములు కూడ ప్రసారము చేయబడుచున్నని. ఇది రేడియోవారి సన్మానము.

వృత్తి :- హైదరాబాదు నగరమునందలి శ్రీ వేంకటేశ్వర వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాలలో 1952 నుండి వీరు – న్యాయ శాస్త్రాచార్యులుగా అధ్యాపనము చేయుచున్నారు.

రచనలు :- 1. భాగవత రత్నములు [సురభారతీ ప్రచురణ] 2. అలంకార మకరందము [ఆంధ్ర ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార ప్రచురణ] 3. వివిధ గ్రంథములకు పీఠికలు, కవితా ఖండికలు, వ్యాసములు - అనేకములు.

## శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు



జననము :- పరీధావి నామ సంవత్సర-నిజ ఆషాఢము (17-7-1912). జన్మస్థానము సుబ్బమ్మపేట. (టెక్కలి తాలూకా శ్రీకాకుళంజిల్లా) జననీ జనకులు :- చూడమ్మ, శఠకోప రామానుజాచార్యులుగారలు. ప్రస్తుత నివాసము:- హైదరాబాదు.

ఆంధ్ర, సంస్కృత, ఆంగ్ల, హిందీ, తమిళ భాషలలో వీరు విద్వాంసులు, కృష్ణాజిల్లాలో గల చిట్టిగూడూరు గ్రామము, హైదరాబాదు, సికింద్రాబాదు నగరములందును వీరు ఉపాధ్యాయులుగా పని చేసిరి. వీరు – సహజ కవి, విద్యా రత్న – అను బిరుదములను సంపాదించిరి.

ముద్రిత రచనలు :- 1. పురుషోత్తముడు (ఆంధ్ర విశ్వ విద్యాలయ పాఠ్యము) 2. రామాయణ కల్పవృక్ష విమర్శ (1957 జులై భారతి) 3. ఆంధ్ర ముకుందమాలా కులశేఖర చరిత్రలు (1964) 4. ఆచార్య – జగదీశ చంద్రబోసు (1971) సంవత్సరమున న్యూఢిల్లీలో – కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖవారి అవార్డు

పొందినది. 5. భారక హృదయము (గీతా కావ్యము - ఆంధ్ర భగవద్గీతలు.) 6. ఆంధ్ర సుదర్శన శతకము.

అముద్రితములు :- 1. ఆచార్య జగదీశ చంద్రబోసు (గద్యము) 2. కళాశాల (సికింద్రాబాదు నందలి మహబూబ్ కాలేజీ చరిత్ర.)

సన్మానము :- మాజీ మంత్రివర్యులు - ఆంధ్ర విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులగు యం. ఆర్. అప్పారావుగారి అధ్యక్షతన, వివేకానంద పరిషత్తువారిచే ఘన సన్మానము.

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు



వీరి జననము 1914. జన్మ స్థానము :- జగ్గయ్యపేట. ప్రస్తుత నివాసము - విజయవాడ. వీరు సంస్కృతాంధ్ర భాషలో ఉద్దండ పండితులు. తర్క, వ్యాకరణ, అలంకార శాస్త్ర వేత్తలు. సంగీత విద్యా నిపుణులు. వాయులీన విద్వాంసులు. కవితా ధురంధరులు. ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయన తత్పరులు. 'సంగీత సాహిత్య కళానిధి' బిరుదాలంకృతులు.

త్యాగరాజ చరిత్రము, నారాయణ శతకము, బిడాల మోక్షము – మున్నగు వీరి తెలుగు కావ్యములును. 'నరసింహ తాండవమ్' అను నొక హరికథయు, భూ ప్రశంస, చంద్రకళా షోడశత్వము, నౌకా చరితమ్, రామాయణ కథాయాం వ్యవదేశాః మొదలగు వీరి గ్రంథములును – పండిత ప్రశంసలకు పాత్రములైనవి క్షేమేంద్రుని కళా విలాసమున కనువాదము, సింహావలోకనము (సంస్కృతము

శ్రీనివాస కల్యాణము, రామకృష్ణ పరమహంస, వరదాభ్యుదయము (హరికథలు), విప్రనారాయణ (యక్షగానము) మున్నగునవి ముద్రణ భాగ్యమును పొందవలసి యున్నవి.

నాట్యకళ, గానకళ మొదలగు పత్రికలలో – వీరి సంగీత సాహిత్య వ్యాసము లనేకములు ప్రకటింపబడినవి. త్యాగరాజు, రామదాసు, గోదాదేవి మొదలగు వీరి హరికథా కాలక్షేపములు శ్రోతలను తన్మయుల గావించుచు, కొనియాడ బడుచున్నవి.

ఫిడేలు వాద్యములో అనేక శతావధానము పెద్ద పెద్ద సభలలో వీరి ప్రక్క వాద్యములు, సోలో కచేరీలు అనేకములు జరిగినవి. ఆంధ్ర ప్రదేశ్ సంగీత అకాడమీ పక్షమున వీరు పెక్కు తావులలో సంగీతమును గూర్చి ఉపన్యాసము లొసంగిరి. 1382 డిసెంబరులో – మద్రాసు మ్యూజిక్ అకాడమీలో – సంగీతోత్సవమున విద్వత్సభలో – సంగీతమును గురించి తమిళ భాషలో ప్రసంగించి, శ్రోతల మన్ననలను పొంది, ఘన సన్మానము నందిరి.

కపిలేశ్వర పురము జమీందారగు శ్రీ S. B. P. B. K. సత్యనారాయణ రావుగారి కోరికను పురస్కరించుకొని మాలవికాగ్నిమిత్రమ్, మేఘ సందేశమ్, వాల్మీకి రామాయణమ్ కథలు, రఘువంశానువారముగా రామ చరితమ్, త్యాగరాజ చరితమ్ – మొదలగు పండ్రెండు హరికథలను వీరు సంస్కృతమున రచించిరి. ఇవి అనితర సాధ్యములు.

ఇటీవలి రచనలు :– జగన్నాథ పండితరాయల 'గంగా లహరి' వలె, సంస్కృతములో – 'కృష్ణా లహరి' 20 శ్లోకములును, కావేరీ పుష్కర సందర్భమున సంస్కృతములో 40 శ్లోకములున్నూ. ఇయ్యవి – పూజ్యశ్రీ – జీయరు స్వామి వారి యానతితో రచించిన – కావేరీ మాహాత్మ్యము తెలుగు కథ 100 పుటల గ్రంథములో ప్రచురింపబడినవి.

1991 నవంబరులో - కాళిదాస సమారోహ్ వారిచే ఉజ్జయినిలో నిర్వహింపఁబడిన పండిత మహాసభలో - వీరు సంస్కృత కవితా గానము గావించి, యావ ద్భారత పండితులను ముగ్ధుల గావించిరి.

1993 అక్టోబరు 31 వ తేదిన వీరికి - 70 సంవత్సరములు నిండిన సందర్భమును పురస్కరించుకొని, విజయవాడలో - శ్రీ జీయరువారి సమక్షమున, వారి మంగళాశాసనములతో - పౌరులు, విద్వాంసులు, ఆప్తులు, శిష్యులు - ఎంతో ఘనముగ సన్మానించిరి. స్వర్ణమయ మైన సింహ తలాట మనబడు కర కంకణమును బహూకరించిరి.

## శ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మ



వీరి జన్మస్థానము - విశాఖ పట్టణము జిల్లా - యలమంచిలి తాలూకా - అప్పల్ల అగ్రహారము - (కొత్తగ్రహారము). జననీ జనకులు - సత్యనారాయణమ్మ, శ్రీరాములు గారలు. జననము : 10-11-1920.

ఈ సోమేశ్వరశర్మగారి విద్యాభ్యాసము - విజయనగరమునందలి మహారాజ సంస్కృత కళాశాలలో. పట్టములు :- 1. వ్యాకరణ విద్యా ప్రవీణ, 2. సాహిత్య విద్యా ప్రవీణ 3. భాషా ప్రవీణ 4. M. A. 5. P. O. L. బిరుదములు :- 1. వ్యాకరణాలంకార చక్రవర్తి 2. సాహిత్య విశారద. ఆచార్యత్వము :- వ్యాకరణాలంకారములలో - ౫౦ సంవత్సరములు.

రచనలు :- 1. సాహిత్య విమర్శ 2, నిపాతావ్యయోపసర్గవృత్తి (సంస్కృతము), 3. సాహిత్య సాకః (సంస్కృతము) - సంపాదితము - పరిష్కృతము.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయమువారి ముద్రణ ప్రశంస) 4. వాక్యపదీయము - 1, 2 భాగములు, 5. ధర్మవ్యాధుఁడు 6. సాయణాచార్యులు (5, 6 సంఖ్యలు గల రెండు గ్రంథములును - తిరుపతి - శ్రీనివాస బాల భారతివారిచే ప్రచురింపఁబడినవి.) ఇత్యాది గ్రంథము లనేకములు వీరిచే రచితములై యున్నవి.

వీ రిపుడు - విశాఖపట్టణమునందలి T. P. T. కాలనీలో - స్వగృహమున నివసించుచు, విద్యార్థులకు విద్యలను గఱపుట, భగవ ద్ధ్యానము చేయుట, అపు డపుడు వేదికలపై, సాహిత్య ధార్మికోపన్యాసములు చేయుట - అను వానితో - కాలమును గడపుచున్నారు.

## శ్రీమాన్ కందాడై శ్రీనివాసాచార్యులు



వీరి జననము 12-11-1953. జన్మస్థానము : గుంటూరుజిల్లా - పొన్నూరు. జననీ జనకులు :- కమలమ్మ, వేంకట రాఘవాచార్యులుగారు.

భాషా పరిచయము :- తెలుగు, హిందీ, సంస్కృతము, ఇంగ్లీషు, ఉర్దూ, తమిళము.

ఉద్యోగము :- భారత ప్రభుత్వ అంతరిక్ష విభాగములో - రసాయన విశ్లేషణ.

స్వాచార్యులు :- శ్రీమ త్పరమహంస పరివ్రాజకాచార్య- శ్రీ శ్రీరంగ నారాయణ జీయరు స్వామివారు - శ్రీరంగము.

రచనలు :- 1. ధనుర్దాస విజయము - నాటిక. (హైదరాబాదు రేడియో కేంద్రమునుండి, 1981 ప్రసారితము.) 2. యతిరాజ విజయము (నాటిక : 1987 లో - భక్తి నివేదన పత్రికలో ప్రకటితము.) 3. భగవద్రామానుజ వైభవము (వ్యాసము. శ్రీరామానుజ కీర్తి కౌముది - 7-వ భాగములో ప్రచురితము) 4. సమతావాది - రామానుజులు (వ్యాసము - భగవద్రామానుజుల తిరునక్షత్ర సందర్భమున - ఆంధ్రప్రభలో ప్రచురితము.) ఇత్యాది రచనలును, ఇంకను మున్ముందు - వివిధ విషయములపై - నాటికలు మున్నగునవి మరికొన్ని రానున్నట్లు సూచన.

విశేషాంశములు :- 1. హైదరాబాదునందలి వనస్థలి పురములో - 'శ్రీవైష్ణవ ధర్మ పరిషత్తు' అను పేర నొక సంస్థను నెలకొల్పి, తద్వారా - ప్రతి సంవత్సరము - ఆళ్వాచార్యుల తిరునక్షత్రములందును, ఏకాదశి విధులందును - విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారార్థమై ప్రవచనములు చేయుట. 2. భగవద్రామానుజ సిద్ధాంత పరివ్యాప్తికి - బహుముఖములుగా - కృషి గావించుట - ఇత్యాదులు - వీరికి మిగుల ఆసక్తికరములు.

## డాక్టర్ : శ్రీపెరుంబూదూరు శ్రీరంగాచార్యులు



జన్మస్థానము :- చందుపట్ల గ్రామము - నకరికల్లు మండలము. నల్లగొండ జిల్లా. జననీ జనకులు : తాయమ్మ, రాఘవాచార్యులు గారలు. జననము , 22-10-1944.

విద్యా వ్యాసంగము :- స్వగ్రామములో పాఠశాల విద్య, హైదరాబాదులోని వేదాంత వర్థినీ కళాశాలయందు కొంత కాలము; ఆంధ్ర ప్రాచ్య కళాశాలయందు మరి కొంత కాలము (1961 - 66) చదివి, B. O. L. పట్టమును పొంది, 1971 లో - ఉస్మానియా విశ్వ విద్యాలయ ప్రప్రథములుగా

M. O. L; 'మరింగంటి కవుల సాహిత్య సేవ' అను విషయమును గూర్చి పరిశోధన చేసి, 1989 లో - కాకతీయ విశ్వ విద్యాలయమునుండి Ph. D. పట్టమును స్వీకరించిరి.

వీరికి - సంస్కృతాంధ్ర సాహిత్యాధ్యయన - పరిశోధనలలో అభిరుచి మెండు.

ఉద్యోగములు :- 1967 లో - మహబూబ్ నగర్ జిల్లా - 'పాలెము' లోని ఓరియంటల్ కాలేజీలో - అధ్యాపకులుగా వీరు ప్రవేశించి, 1991 నుండి అదియే కళాశాలలో - ప్రధానాచార్యత్వ (ప్రిన్సిపాల్) బాధ్యత వహించుచున్నారు.

పదవులు :- ఉస్మానియా విశ్వ విద్యాలయములో - ఓరియంటల్ కోర్సుల విభాగమునకు ఛైర్మన్‌గా (Board of Studiees in Telugu) 1988 - 1991 వరకు బాధ్యతలను నిర్వహించిరి. అదియే విశ్వ విద్యాలయము - ఎకడమిక్ సెనేతే మెంబరుగా 1988 నుండి 1902 వరకు - పదవిని నిర్వహించిరి.

వ్యాసములు :- 1965 నుండి వివిధ పత్రికలలో - వీరి సాహిత్య వ్యాస రచన లనేకములు ప్రచురింపఁబడినవి. అదియునుగాక, విజ్ఞాన సర్వస్వము, నల్లగొండ జిల్లా సర్వస్వము, మహబూబ్ నగర్ జిల్లా సర్వస్వము, వావిళ్ళ శత జయంతి సంచిక - మున్నగువానిలో - వీరిచే విస్తృతముగా రచింపఁబడిన వ్యాసములు ప్రచురింపఁబడినవి.

ప్రసంగములు - ఉపన్యాసములు :- వీరు ఆకాశవాణిలో దాదాపు 30 ప్రసంగములు చేసిరి. సభా వేదికలపై సాహిత్యోపన్యాసము లనేకము లొసంగిరి.

పరిష్కరణలు - పీఠికలు :- వీరి పరిష్కరణ, విపుల పీఠికలతో వెలువడిన గ్రంధములలో - 1) దశరథ రాజ నందన చరిత్ర (నిరోష్ఠ్య రామాయణము) 1971-1991 సంవత్సరములో రెండు పర్యాయములు ముద్రణ. 2) చాటుపద్య రత్నావళి (1978). 3) శ్రీరంగ మహత్త్వము (1979) 4) తాలాంక

నందినీ పరిణయము (1980) అను గ్రంథములను ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీవారు ముద్రించిరి.

హైదరాబాదులోని 'యువ భారతి' సంస్థ - 1981 లో - పింగళి సూరన కవితా వైభవమును, వనపర్తి సాహిత్య వేదిక వారు-'సి. పి. బ్రౌన్. జీవితము - సాహిత్యము' అను గ్రంథమును 1984 లో ప్రచురించిరి.

తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఆర్థిక సహాయముతో - 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము (1981), క్షత్రబంధూపాఖ్యానము (1984) అను గ్రంథములను ప్రకాశింపజేసిరి.

రాష్ట్రప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము ద్వారా - శ్రీకృష్ణ శతానందీయము' ఇపుడు ముద్రణలో నున్నది.

వీరి సిద్ధాంత వ్యాసమైన 'మరింగంటి కవుల సాహిత్య సేవ' - 1991 లో ముద్రింపఁబడినది.

'నల్లగొండ జిల్లా కవి పండితులు' అను గ్రంథము - వీరి పర్యవేక్షణలో ఇవుడు ముద్రింపబడుచున్నది.

అముద్రిత - లిఖిత - తాళపత్ర గ్రంథ సేకరణ, ప్రశంసనమును వీరు పహితీ జీవిత ధ్యేయముగా ఇపుడు దాదాపు 60 పుస్తకములను తిరుగ వ్రాసి, వానిలో కొన్నిటిని పరిష్కరించిరి. వీనిలోనే కొన్నింటిని ముద్రణ చేయించిరి.

ఈ శ్రీరంగాచార్యులవారి తండ్రిగారైన రాఘవాచార్యులవారు - నిర్వ క్తృవులు, ప్రౌఢప్రబంధ నిర్మాతలు. వారి ప్రభావము ఈ శ్రీరంగాచార్యులవారి పైనను, వీరి సోదరులపైనను ప్రసరించి యున్నది. సాహిత్యముతోపాటు - వారికి విద్వత్తు, వైద్య - జ్యోతిషములయందు మంచి ప్రతిభావంతమైన పాండిత్యము కలదు.

# శ్రీమాన్ కారంచేటి తిరుమల వేంకట రాఘవాచార్యులు



జననము:- విభవనామ సంవత్సర పుష్య శుద్ధ ద్వాదశి (1929). జన్మ స్థానము :- కరీంనగర్ జిల్లా - నారాయణపురము. జననీ జనకులు:- వేంకటమ్మ, మనోహరాచార్యులు గారలు. అభ్యసించిన భాషలు :- సంస్కృతములో-ఎం. ఏ. తెలుగులో - ఎట.పి. హిందీలో - 'భూషణ', బి. యిడి. ట్రైనింగు, స్వయంకృషితో ఉరుదు.

అభ్యసించిన విద్యలు ;- వేదము, పంచ దశ కర్మలు, ద్రావిడ దివ్య ప్రబంధములు.

ఉద్యోగములు ;- ఆంధ్రోపన్యాసకులుగా, సంస్కృతోపన్యాసకులుగా తెలంగాణమున అనేక కళాశాలలో పని చేసి, చివరకు - సిద్దిపేట ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పని చేసి, ఇటీవలనే ఉద్యోగ విరమణ గావించి, హైదరాబాదులో స్థిర నివాస మేర్పరచుకొని యున్నారు.

విశేషాంశములు ;- రామాయణము, భాగవతము, భగవద్గీత, తిరుమంత్రార్థము, తిరుప్పావు, భగవద్విషయము వంటివానిని గురించి వీరు తరచుగా ఉపన్యాసము లొసంగుచుందురు. దేవ - మానుష యాజ్ఞికములను నిర్వహించుచుందురు. హైదరాబాదు ఆకాశవాణిలో - వేద పఠనము, సంస్కృత కావ్య ప్రసంగములను చేసి, ప్రశంసల నందుకొనిరి. వివిధ సందర్భములలో అనేక ఘన సన్మానములను పొందిరి.

రచనలు :- 1) మాఘ మహాకవి విరచిత మగు 'శిశుపాల వధ' కావ్యము నందలి విశిష్ట మగు కవితా సౌందర్యము నుగ్గడించుచు - 'మాఘకావ్య వైభవము' అను పేర నొక గ్రంథమును వీరు రచింప, దానిని - యువ భారతి - (హైదరాబాదు) వారు ప్రచురించిరి. 2) శ్రీ వేదాంతదేశికులచే రచింపబడిన గోదాస్తుతికి పరిమళ వ్యాఖ్యానము, 3) భగవద్ధ్యాన సోపానమునకు మనోహరా వ్యాఖ్యానమును రచించిరి. 4) భగవద్విషయము - 'ఈడు అవతారిక' అనునది - వీరి ఆంధ్రానువాదము.

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 18 | ప్రితాపము | ప్రతాపము |
| 12 | 26 | బలైశ్వర | బలైశ్వర్య |
| 14 | 4 | నమ్మాళ్వాలు | నమ్మాళ్వారులు |
| 16 | 5 | ణము దుష్ట | ణము, దుష్ట |
| 16 | 7 | పవిత్రాణాయ | పరిత్రాణాయ |
| 21 | 16 | లక్ష్మి | లక్ష్మి |
| 21 | 17 | ఏకోనచత్వారింశిత్ | ఏకోనచత్వారింశత్ |
| 23 | 4 | కతత్స్థుడు | కకుత్స్థుడు |
| 23 | 24 | కుజ్ఞమూర్తి | యజ్ఞమూర్తి |
| 25 | 3 | రైనత | రైవత |
| 26 | 10 | కపిలా | కపిల |
| 27 | 23 | సనుష్టి | సమష్టి |
| 28 | 16 | అధాయ | అధ్యాయ |
| 30 | 9 | అసులికి | అసురికి |
| 31 | 17 | హంస కూర్మశ్చ | హంసః కూర్మశ్చ |
| 32 | 6 | పంచయ ముండె | ధరించి యుండె |
| 50 | 10 | ప్రతికలో | ప్రతితో |
| 64 | 23 | త్యద్ధికావ్యము | త్ర్యర్థి కావ్యము |
| 65 | 16 | మెగనామాత్య | వెంగనామాత్య |
| 66 | 4 | ధనకుదర | ధనకుధర |
| 67 | 7 | కౌమది | కౌముది |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 77 | 7 | క్రూరుడు | అక్రూరుడు |
| 80 | 9 | రామకృష్ణావతారముల | రామాయణ-మహాభారతముల |
| 89 | 6 | గర్భృని | గర్భుని |
| 94 | 22 | సద్వజ్ఞత్వ | సర్వజ్ఞత్వ |
| 95 | 7 | ముక్తితర | ముక్తిదళ |
| 96 | 12 | సామనాధికర | సామానాధికర |
| 96 | 20 | విషములు | విషయములు |
| 103 | 6 | శ్రుతులను – | శ్రుతులును – |
| 105 | 15 | న్యాయకువిశ | న్యాయకులిశ |
| 106 | 10 | జీవిత | జీవిక |
| 107 | 16 | గడిపిరి. | గడపిరి. |
| 108 | 21 | గడిపి, | గడపి, |
| 109 | 20 | దర్శింజేయుదు. | దర్శింపజేయును. |
| 115 | 13 | గడిపిరి. | గడపిరి. |
| 115 | 19 | విశిష్ఠమైన | విశిష్టమైన |
| 116 | 2 | వికతములు | వివరములు |
| 116 | 18 | ఈశోదనష | ఈశోపనిష |
| 117 | 12 | తాత్త్విక సంక | తాత్త్విక |
| 120 | 6 | యథాక్తకారి | యథోక్తకారి |
| 121 | 23 | సోపాన | పోవు సోపాన |
| 122 | 19 | బౌద్థ | బౌద్ధ |
| 124 | 11 | రప్పేత్. | రిప్పేత్. |
| 121 | 18 | వీపిత సాధువర్తి | నీపితసాధువర్తి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 129 | 14 | ప్రస్యష్టం | ప్రస్పష్టం |
| 130 | 15 | యద్వా౽కార్థ | యద్వానేకార్థ |
| 135 | 8 | వాభవుడు | వాయభవుడు |
| 138 | 16 | అంతియుగాక, | అంతియగాక, |
| 143 | 9 | సాహిత్వ | సాహిత్య |
| 148 | 21 | ఠిరికల్ | కిరికల్ |
| 149 | 7 | చుండును, | చుండును. |
| 150 | 4 | ఇంతతో – | ఇంతలో – |
| 152 | 21 | విల్లి విరియు | వెల్లివిరియు |
| 163 | 17 | దేవనాయవ | దేవనాయక |
| 167 | 5 | (చక్రవర్తి తిరుమగన్ | (చక్రవర్తితిరుమగన్) |
| 171 | 25 | లక్ష్మీనృసింహ | లక్ష్మీనృసింహ |
| 181 | 11 | తీసుకొని | తీసికొని |
| 184 | 2 | వర్తించుచు | వర్ణించుచు |
| 196 | 5 | బాహూవులు | బాహువులు |
| 197 | 19 | వత్నలతోను | వత్నులతోను |

★

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

## వదాన్య శేఖరులు

Proffessor : Narender P. Reddy Ph. D. Acron (U.S.A.) Dol's 31

## మహా రాజ పోషకులు

1. శ్రీమాన్ : చిలకమర్తి సత్యలక్ష్మణాచార్యులు, Retd I. T. O. గుంటూరు
2. డాక్టర్ : కిడాంబి సత్యనారాయణాచార్యులు, M. S; M. N. A. N. S. గుంటూరు
3. శ్రీ వి. మధుసూదనరావు (రిటైర్డు జిల్లా రిజిస్ట్రార్) ,,
4. శ్రీమతి – కిడాంబి సుశీలాదేవి ,,
5. శ్రీమతి – గుడివాడ హేమమాలినీ రాణి, M. A. ,,
6. శ్రీమాన్ కిడాంబి వెంకట నరసింహాచార్యులు పెంటపాడు
7. శ్రీ ఘండికోట వెంకట సుబ్బారావు ప్రశాంతి నిలయము
8. డాక్టర్ : శ్రీ పెరుంబూదూరు శ్రీరంగాచార్యులు,M.A.Ph. D. పాలెమ్
9. శ్రీమాన్ - S.A.T. సింగరాచార్యులు (అస్ట్రాలజర్) నెల్లూరు
10. శ్రీ వడ్లమూడి వెంకటేశ్వరరావు విజయవాడ
11. శ్రీమతి – రావు రమాదేవి (MOBILE) అమెరికా

## రాజ పోషకులు

1. శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రాఘవన్, B. Com. గుంటూరు

## పోషకులు

1. శ్రీమాన్ నందూరు బుచ్చిరామానుజాచార్యులు గుంటూరు
2. డాక్టర్ : సి. రామదాసు, D. M. & E. D. M. R. గుంటూరు

3. శ్రీమతి - కిడాంబి వేంకట లక్ష్మమ్మ — గుంటూరు
4. శ్రీమాన్ - నండూరు సత్యనారాయణాచార్యులు — గుడివాడ
5. డాక్టర్ : సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యులు, M. A. Ph. D. — కొవ్వూరు
6. శ్రీమాన్ - చిత్రకవి ఆత్రేయ, M. A. — విశాఖపట్టణము
7. శ్రీ. వి. పాండురంగరాజు — ,,
8. శ్రీమాన్ - కందాడై అప్పన్ కృష్ణమాచార్యులు, M. A. — వాల్తేరు
9. శ్రీమాన్ - కె. వి. రాఘవాచార్యులు, M. A; B.Ed. — హైదరాబాదు
10. శ్రీమాన్ - టి. కె. వి. రాఘవన్, M. A. — ,,
11. శ్రీమాన్ - అచ్చి శేషాచార్యులు — ,,
12. కుమారి - సి. సీతాదేవి (జాయంటు కమీషనర్ - కమర్షియల్ టాక్సెస్) — ,,
13. శ్రీమాన్ - యన్. సి. వరదాచారి — మద్రాసు
14. శ్రీమాన్ - యన్. సి. గోపాలస్వామి — మద్రాసు
15. శ్రీమాన్ సౌమిత్రి రంగాచార్యులు, M.A; B. Ed. — హనుమకొండ
16. శ్రీమాన్ - కె. గోపాలాచార్యులు — చిట్టూరు
17. శ్రీమాన్ - కె. కృష్ణమాచార్యులు — చిట్టూరు
18. శ్రీమాన్ - ఆర్. జె. పార్థసారథి — బొంబాయి
19. శ్రీ - ఉప్పలపాటి గోపాలకృష్ణ — విజయవాడ
20. శ్రీ - కె. సుందరరాజు, (అసిస్టెంటు ఇంజనీర్ - పెలికం) — ఒంగోలు
21. శ్రీ - టి. రాంప్రసాద్ — భానూరు
22. శ్రీ మెట్టుపల్లి వేంకటయ్య పంతులు — కిలా వనపర్తి

## విరాళములు

1. శ్రీమతి - తిరుక్కోవళ్ళూరి మరుద్వతి - గుంటూరు - రూ. 100
2. డాక్టర్ : చింతాపట్టణం - శ్రీరంగాచార్యులు, M. A; Ph. D. నాగోల్ - రూ. 100

# పూర్ణిమ (15) కౌముదిలో రానున్న రచనలు

1. శ్రీ వేంకట పతి స్తుతి (పద్య రచన)
   శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులు, M. A.
2. విష్ణు సహస్ర నామ స్తోత్ర ప్రభావము
   శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, M. A.
3. విష్ణు భగవానుని దివ్య వైభవము
   శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు
4. శ్రీ స్తవము
   సంస్కృత మూలము :- శ్రీవత్సాంక మిశ్రులు.
   ఆంధ్రవ్యాఖ్యానము :-
   శ్రీమాన్ పరవస్తు అప్పన్ గోవిందాచార్యులు
5. దశావతారములు — తద్విశేషములు
   డాక్టర్ : సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యులు, M. A; Ph. D.
6. కలియుగ మహత్త్వము - కలి పురుషుని యవతరణము
   శ్రీమాన్ దిట్టకవి లక్ష్మీ నరసింహాచార్యులు
7. శ్రీమద్రామానుజులు - వేదాంత సారము
   డాక్టర్ : తట్టా విజయ రాఘవాచార్యులు, M. A; Ph. D.
8. శ్రీ రామానుజ విజయము (పద్య రచన)
   శ్రీమాన్ కుంటిమద్ది శేష శర్మ
9. వడగల - తెంగల సంప్రదాయ భేదములు
   శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు, B. A.
10. శ్రీ వరదరాజ క్షేత్ర వైశిష్ట్యము
   శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు